

“పలుకవేలా, అలుకదేలా!”

సంవత్సర చందా
రు. 13-0-0
విడిపత్రిక 25 న.పై.

# ఆంధ్రపత్రిక

## సచిత్ర వారపత్రిక

సంపుటము 52
సంచిక 49
30-7-58

Founder : K. NAGESWARA RAO

విలంబ శ్రావణ శుద్ధ పూర్ణిమ బుధవారం



## విషయానుక్రమణిక



ముఖచిత్రం :
ప్రభా ప్రొడక్షన్స్‌వారి
'ఆడపెత్తనం'లో అంజలీదేవి

# యుద్ధ మేఘాలు

గత వారం రోజులలో ప్రపంచ పరిస్థితులు అత్యంత ప్రమాద భరితంగా పరిణమించాయి. మరో మహాసంగ్రామ అఖాతంలోకి ప్రపంచాన్ని దూకించబోతున్నారేమో ననిపిస్తున్నది. కనపడని దారుణ వ్రణంలా మానవకోటిని తీరనివ్యథల పాలుచేస్తున్న ప్రచ్ఛన్న యుద్ధానికి స్వస్తిచెప్పి అగ్రరాజ్యాలు ప్రత్యక్ష యుద్ధానికే తలపడబోతున్నాయేమో ననిపిస్తున్నది. ఈ పరిస్థితుల కారణంగా ప్రపంచ ప్రజలు భయభ్రాంతులైపోతున్నారు.

ఈ భయానకపరిస్థితులకు ముఖ్యకారణం మొన్న జూలై 14 వ తేదీన ఇరాక్‌లో సంభవించిన ఆకస్మిక సైనికవిప్లవం మాత్రం కాదు. మధ్యప్రాచ్యమని వ్యవహరించే పశ్చిమ ఆసియారాజ్యాలలో ఆకస్మిక సైనిక విప్లవాలు, రాజకీయహత్యలు, రాజరికాల పతనం సర్వసాధారణమైన విషయాలు. ఇరాకీ సైన్యం హఠాత్తుగా విప్లవంసాగించి తెలవారేసరికి రాజరికానికి ఉద్వాసన చెప్పింది. పాతప్రభుత్వాన్ని కూలద్రోసి కొత్తప్రభుత్వాన్ని స్థాపించింది. గతముప్ఫయ్యేళ్ళుగా ఆధిపత్యం వహిస్తున్న వృద్ధ రాజకీయ నాయకుడు ప్రధాని నూరి సయ్యద్‌ను, యువరాజు అబ్దుల్ ఇల్లాను హత్య చేశారు. రాజు ఫైసల్ ఆచూకీ తెలియదు; కాని, అతడినికూడా ఫైసల్ చేసేశారని వార్తలువస్తున్నాయి. రాజరికంస్థానే అక్కడ రిపబ్లికన్ ప్రభుత్వాన్ని స్థాపించారు. ఈ రిపబ్లికన్ ప్రభుత్వంలో అబ్దుల్ కరీం కాసిం ప్రధానమంత్రి, ముగ్గురు ముఖ్యులతో ఒక సర్వాధికారమండలిని ఏర్పాటు చేసుకున్నారు. పదవులలోవున్న పాతఉన్నతాధికారుల నందరినీ తొలగించివేశారు. మొత్తంమీదఈ విప్లవం ఎంత హఠాత్తుగా ప్రారంభమైందో అంతహఠాత్తుగానే సమాప్తమైంది. ఇరాకీ నూతన వ్యవస్థను ఇప్పటికప్పుడే ఐక్య అరబ్ రిపబ్లిక్, రష్యా, చైనా ఇండోనీషియా, యుగోస్లావియా మొదలైన కొన్ని దేశాలు అధికారపూర్వకంగా పరిగణింపబడం కూడా జరిగింది.

ఇకపోతే, లెబనాన్; ఇదిపశ్చిమాసియాలో మరొక చిన్న రాజ్యం. ఇప్పటికి దాదాపు పది పన్నెండు వారాలనుంచీ చామోన్ ప్రభుత్వంపై బాహాటంగా అంతర్యుద్ధం సాగిస్తున్న తిరుగుబాటుదారులు ఇరాకీ విప్లవాన్ని హర్షించారు. విప్లవ విజయ వార్త వినగానే "నాసర్ జిందాబాద్!" అని నినాదాలు చేస్తూ ఆనందంతో నృత్యం చేశారట.

అయితే, ఇరాకీ విప్లవంపట్ల లెబనాన్ తిరుగుబాటుదారులు హర్షించడానికి అరబ్ ప్రజల జాతీయ సమైక్యతా భావవిజృంభణే కారణం. ఈ అరబ్ జాతీయ సమైక్యత చిహ్నంగానే, దాదాపు మూడు మాసాల క్రితం నాసర్ ఆధిపత్యాన ఈజిప్టు సిరియాల ఏకీకరణ జరిగి, ఐక్య అరబ్ రిపబ్లిక్ అవతరించింది. అరబ్ జాతేకాక, సభ్యతా ప్రపంచమంతా నాటి ఏకీకరణను అభినందించింది. పశ్చిమాసియాలో ఏ విధంగానైనా తమ ఆధిపత్యాన్ని నిలుపుకోవాలని ఆశించే పశ్చిమ రాజ్యాలకు మాత్రం అది కంటకప్రాయంగా తయారైందనే చెప్పాలి. అదే సమయంలో ఇరాక్, జోర్డాన్ రాజ్యాలుకూడా ఒక సమాఖ్యను ఏర్పాటుచేసుకున్నాయి. ఇది కేవలం ఆయా రాజ్యాధిపతులు చేసుకున్న ఏర్పాటు. అందుచేతే దీనికి ఈజిప్టు సిరియాల ఏకీకరణకు లభ్యమైనట్లుగా స్థానికప్రజల అండదండలు లభ్యం కాలేదు; పశ్చిమ అగ్రరాజ్యాల ఆశీర్వాదబలంమాత్రం దండిగా లభ్యమైంది. అందుచేత ఇరాకీ జోర్డానుల సమాఖ్య పశ్చిమరాజ్యాల 'ముద్దుబిడ్డ'గా వర్ధిల్లుతూ వచ్చింది. పైగా బాగ్దాద్ సైనిక ఒప్పందానికి (పాకిస్తాన్, ఇరాన్, ఇరాక్, జోర్డాన్, బ్రిటన్‌లు కలసి చేసుకున్నది) ఇరాక్ ఆయువుపట్టు. అందుచేత బాగ్దాద్ ఒప్పందంలోనుంచి బాగ్దాద్ ఎగిరిపోతున్నదనేసరికి పశ్చిమరాజ్యాలకు కుండే బేజారైనంత పని అయివుంటుంది. ఒప్పందానికి అమర్చిన మూలస్తంభమే పోతే, వారిప్రతిష్ఠకు పెద్దదెబ్బే-నన్నమాట; చిరకాలంగా పన్నుతున్న సైనిక వ్యూహాలే తారుమారైపోయేప్రమాదం ఏర్పడిందన్నమాట.

అందుచేతనే, ఐసెన్‌హోవర్ మధ్యధరా సముద్ర స్థావరాలలోవున్న తమ సైనిక బలాన్ని (ర వేలకు పైగా) ఇరాక్ విప్లవం జరిగి ఇరవైనాలుగుగంటలైనా పూర్తికాకముందే లెబనాన్‌లో దింపించివేశాడు; ఇదేమిటి అమాంతం ఇలా సేనలను దించారంటే అక్కడి అమెరికన్ పౌరులను రక్షించుకోడానికేనని సమాధానం చెబుతున్నారు; అంతేగాక లెబనాన్ అధ్యక్షుడు చామోన్ ఆహ్వానించినమీదటే తమ సేనలు దిగినవంటున్నారు. అమెరికన్ పౌరులరక్షణను అక్కడవున్న సమితి పరిశీలక బృందంద్వారా సాగించడానికి వీల్లేకపోలేదు. అమెరికన్ సేనలు లెబనాన్‌లో దిగితే, బ్రిటిష్‌సేనలు జోర్డాన్‌లో దిగాయి. రెండుసంవత్సరాల క్రితం సూయజ్ గొడవ సందర్భంలో బ్రిటిష్ ఫ్రెంచి సేనలు సయిద్ రేవుపై విజృంభిస్తే అమెరికా ఆ చర్యను ఖండించి, ప్రమాదాన్ని నిగ్రహించగల్గింది. ఆనాడు బ్రిటన్ ఫ్రాన్సులు చేసిన తప్పిదాన్నే ఈనాడు అమెరికా చేస్తున్నది. అందుచేతే అమెరికా ధోరణి సభ్యతా ప్రపంచమంతా ఐక్యకంఠంతో ఖండిస్తున్నది.

ఇరాక్‌లో సంభవించిన సైనిక విప్లవం గాని, లెబనాన్‌లో సాగుతున్న అంతర్యుద్ధం గాని కేవలం ఆదేశాల ఆంతరంగిక వ్యవహారాలు. వాటిలో అన్యదేశాల ప్రమేయం అనవసరమే కాకుండా, అత్యంత ప్రమాదకరం కూడా.

మధ్యప్రాచ్యరాజ్యాలలో అమెరికన్, బ్రిటిష్ సేనలు ఈ విధంగా విశృంఖలంగా ప్రత్యక్షం కావడం, అక్కడ తిష్ఠవేయడం ప్రపంచశాంతికి తీవ్రఅవరోధంగానే పరిణమిస్తుంది. బ్రిటన్ అమెరికాలు ప్రస్తుత స్థితిలో నిగ్రహాన్ని కోల్పోయి ఏ మాత్రం మరికొంత వేగిరపాటు ప్రదర్శించినా, మధ్యప్రాచ్య పరిస్థితి ఒక్కసారి భగ్గుమంటుంది. ఈనాటి లెబనాన్, జోర్డాన్ ప్రభుత్వాలు అమెరికన్ బ్రిటిష్ సేనలను ఆహ్వానించినట్లే, ఐక్యఅరబ్ రిపబ్లిక్ నాయకులుతమనిస్సహాయ స్థితిలో సోవియట్‌రష్యా సైనికసహాయాన్ని అర్థించవచ్చు. ఇరుగుపొరుగునవున్న చిన్న చిన్న పశ్చిమాసియా రాజ్యాలలో ఈవిధంగా మూడు అగ్రరాజ్యాల సేనలు చేరడం తప్పక మరో ప్రపంచయుద్ధానికే దారితీస్తుంది. ప్రపంచశాంతికే కృషిచేస్తున్నామని పైకి చెప్పేకబుర్లన్నీ కేవలంకల్లబొల్లికబుర్లుగానే తయారవుతాయి. మధ్యప్రాచ్యంలో ప్రారంభమైన ఈ కొత్త రగడ చివరకు శాంతియుతంగానే తెమిలిపోతుందో, లేక మరొక భీకర సంగ్రామంగానే పరిణమిస్తుందో రానున్న కొన్ని వారాలలోనే స్పష్టపడుతుంది. ★




# సచివాలయంలో రైల్వే సచివుడు

ఇరాక్‌లో విప్లవంకంటే, లెబనాన్‌లో అమెరికన్ సేనలు దిగటంకంటే భారత దేశానికి ముఖ్యమైన సంఘటనలు ఇటీవల జరిగాయి. శ్రీమతి సుభద్రా జోషీ కాంగ్రెసు ప్రాథమిక సభ్యత్వానికి రాజీనామా ఇచ్చింది. హఠాత్తుగా జరిగిన ఈ సంఘటనకు రాజకీయ పరిశీలకులు ఆశ్చర్యపడ్డారు. ఆమె అనుకున్న విధంగా కాంగ్రెసు అధిష్ఠానవర్గం నడుచుకోలేదు గనుక, చౌధురి బ్రహ్మప్రకాష్‌పై చర్య తీసుకోకుండా వదిలేసింది గనుక, ఆమె రాజీనామా ఇవ్వటం జరిగిందని తెలుస్తోంది. లెబనాన్‌లో అమెరికన్ సేనలు దిగిన వార్త, శ్రీమతి జోషీ రాజీనామా ఇచ్చిన వార్త పత్రికల మొదటిపుటలలో ప్రముఖంగా ప్రచురింపబడ్డాయి. రాజీనామాను ఉపసంహరించుకోవలసిందిగా ఆమెను ఒత్తిడి చేస్తున్నారు. ఆమె ఉపసంహరించుకుంటుందనే ఇంకా శ్రీ కృష్ణనాయర్, శ్రీ రాధారమణ్ ఆశిస్తున్నారు. అసలు విషయం స్పష్టంగా తెలుస్తూనే ఉంది. కాంగ్రెసు అధిష్ఠానవర్గం తమ నిర్ణయాన్ని మార్చుకుని దాసోహం అనాలన్నమాట. శ్రీమతి జోషీ సభ్యత్వం కాంగ్రెసుకు కావలసిఉంటే చౌధురి బ్రహ్మప్రకాష్‌ను బహిష్కరించాలన్నమాట.

శ్రీమతి జోషీ రాజీనామా ఇవ్వటానికి ఇదే మొదటిసారి కాదు. ఈ నెలలో కాంగ్రెసు ఎన్నికలు జరుగుతాయి. ప్రస్తుత స్థితిగతుల్లో శ్రీమతి జోషీ, ఆమె ముఠావారు కాంగ్రెసు సంఘాన్ని చేజిక్కించుకునే అవకాశం లేశమైనాలేదు. ఆమె రాజీనామాతో బెదిరిస్తోంది. ఆమె అనుయాయులు మేమీ ఎన్నికల్లో పాల్గొనమని బెదిరిస్తున్నారు. కాని శ్రీ కృష్ణనాయర్ గాని, శ్రీ రాధారమణ్ గాని తమ నాయకురాలైన శ్రీమతి జోషీ అడుగుజాడల్లో నడుచుకుని కాంగ్రెసు సభ్యత్వానికి రాజీనామా ఇచ్చే అవకాశం ఏమీ లేదని తెలుస్తోంది.

చివరికి శ్రీమతి జోషీ కాంగ్రెసు నుంచి తప్పుకోవటమే జరిగితే ఢిల్లీనగరం విమోచనోత్సవం జరుపుకోవచ్చు. అప్పుడు కాంగ్రెసూ, పరిపాలనవర్గమూ కలిసి కమ్యూనిస్టులపట్ల దృఢమైన వైఖరి అవలంబించవచ్చు. శ్రీమతి జోషీ భర్త కమ్యూనిస్టు అని అందరూ ఎరిగినదే.

* * *

ఇటీవల ప్రచారంపొందిన మరొక సంఘటన ఏమిటంటే రైల్వేమంత్రిని సచివాలయం

**శ్రీకృష్ణ**

[ఆంధ్రపత్రిక ప్రతినిధి]

లోకి వెళ్లకుండా సెక్యూరిటీ పోలీసులు అడ్డగించారు. మంత్రిగారు సచివాలయంలోకి మెట్లు ఎక్కబోతుండగా కాపలామనిషి జోగిందర్ సింగ్ అటకాయించి, 'మీ అనుమతిపత్రం చూపించ'మన్నాడట. మంత్రిగారి దగ్గర మంత్రిగారని తెలిపే పత్రం ఏమీ లేదట. నన్ను గుర్తు పట్టలేవా అని మంత్రిగారడగ్గా నాకేం తెలియదన్నాడట కాపలామనిషి. మంత్రిగారి వెనకాల ఉన్న అంగరక్షకుడు ఎంత నచ్చచెప్పినా కాపలామనిషి వినలేదట.


ఆంధ్రప్రదేశ్ ఎగువశాసనసభ ఉపాధ్యక్షుడు శ్రీ జి. సుబ్బరాజు

ఏం పొగరు? నీ వెవరో తెలియదూ! ఇదివరకిలాగే కొందరు మంత్రుల్ని గూర్చి కథలుండేవి. కాపలావాడు తన విధి తను నెరవేర్చాడు. ఏ ప్రభుత్వంలో రైల్వే మంత్రి సభ్యులో ఆ ప్రభుత్వం ఆదేశం ప్రకారమే కాపలావాడు మంత్రిగారిని అటకాయించాడు. ఏమిటా ఆదేశం? అనుమతిపత్రం లేనిదే, అడిగితే చూపించనిదే ఎవర్నీ సచివాలయంలోకి పోనివ్వకూడదని ఆదేశం. తన ముఖమే తన అనుమతిపత్రం అని భ్రమపడి రైల్వేమంత్రి వేరే అనుమతిపత్రాన్ని తీసుకు రాకపోవటం ఆయనదే తప్పు. రిసెప్షన్ కార్యాలయానికి వెళ్ళి ఆయన ఒక అనుమతిపత్రాన్ని తీసుకుని మరీ సచివాలయంలోకి వెళ్లిఉండవలసింది.

సెక్యూరిటీ ఉన్నతాధికారులు ఆ దరిమిలాను మంత్రిగార్ని కలుసుకుని, జరిగినదానికి విచారం వెల్లడించారని వార్త. కాపలా మనిషి మీద చర్య తీసుకోవద్దని మంత్రిగారు అధికారులకు సలహా ఇచ్చారట.

ఈ వార్త నిజమేఅయితే సెక్యూరిటీ అధికారులను బరతరఫ్ చెయ్యాలి. విచారం వెలిబుచ్చవలసిన అవసరం ఏముంది? తప్పు మంత్రిగారిది. తన ప్రవర్తనకు విచారం వెలిబుచ్చవలసింది మంత్రిగారు. అదీగాక ఏ నిబంధన ప్రకారం కాపలా మనిషిమీద చర్య తీసుకొందా మనుకున్నా రసలు! హార్డింజ్ ప్రభువునుగూర్చి ఒక కథ ఉన్నది. ఈపాటికి దీన్ని వార్తాపత్రికలుకూడా మరిచిపోయిఉంటాయి. హార్డింజ్ ప్రభువు రాత్రిళ్లు భోజనం చేసినతర్వాత కాసేపు షికారు వెళ్లి రావటం అలవాటు. ఒకసారి ఆయన పాత ఢిల్లీలో వైస్రాయి భవనంలోకి తను మామూలుగా వెళ్ళే మార్గానగాక ఇంకోదోవన వెళ్లి

టానికి ప్రయత్నిస్తుండగా కాపలా వాడు అడ్డగించాడు. అంగరక్షకుడు ఎంత చెప్పినా అతడు వినలేదు. అప్పుడు అటువైపు వస్తున్న గస్తీవళింవారు చూసి వైస్రాయిని గుర్తుపట్టి ఆయన్ని లోపలకు పోనివ్వమని కాపలా వాడిని ఆజ్ఞాపించారు. వైస్రాయి అతడికి ఆ మర్నాడు ప్రమోషను ఇచ్చారు.

కాపలావానిపై చర్య తీసుకోవద్దని అధికారులకు సలహా ఇవ్వటంకంటే, తన విధి నిర్వర్తించినందుకు అతనికి రైల్వేమంత్రి బహుమతి పంపించి ఉండాల్సింది.

* * *

## అందం ఖరీదు

ఒక స్థానిక పత్రిక ఇలా ప్రకటించింది. "రాజధానిలో సింధియా భవనానికీ, రీగల్ భవనానికీ మధ్యవున్న 8½ ఎకరాల స్థలాన్ని 'ఢిల్లీ ట్రాన్స్‌పోర్టు అండర్ టేకింగ్' బస్సుల టర్మినస్‌గా మార్చాలని ఆలోచిస్తున్నారు. ఈ స్థలం రాజధానిలో విలువైన స్థలాల్లో ఒకటి.

పరిశీలనదశలో ఉన్న ఈ ఆలోచన ఢిల్లీ మాస్టర్ ప్లానులో భాగం. కేంద్ర రోడ్డు పరిశోధనసంస్థ ఈ పథకంలో వివరాలను అప్పుడే తయారు చేస్తున్నది. ఇది మరొక రెండు నెలల్లో తయారు కాగలదట.

రద్దీ సమయాల్లో సింధియా భవనం దగ్గర బస్సుల మూలంగా వచ్చే రాకపోకల ఇబ్బందిని తొలగించటానికి ఈ ఆలోచన ప్రారంభమైందని తెలుస్తోంది. ఒక పెద్ద టెర్మినస్, కాంటీను, వెయిటింగ్ గదులు, విశ్రాంతి గదు', ముందుగా టిక్కెట్లు అమ్మే ఆఫీసు ఇవన్నీ కట్టాలని ఆలోచిస్తున్నారు.

ఇప్పుడీ స్థలంలో దుబ్బులు తుప్పలు పెరిగాయి. ఒకప్పుడిది టాటా సంసది. అయిదేళ్ళ క్రితం న్యూఇండియా అస్యూరెన్సు కంపెనీ వాలూకు జీవిత భీమా విభాగానికి దానినిచ్చారు. జీవిత భీమా వ్యాపారం జాతీయంకాగానే అది జీవిత భీమా కార్పొరేషనుకు వచ్చింది.

టాటాసంస్థ అక్కడ ఒక హోటలు, అంగడి కట్టాలని పూర్వం అనుకున్నారు. కాని కంపెనీల శాసన నిబంధన ప్రకారం దానికి వీలులేక పోయింది. ఇప్పుడీస్థలం విలువ 20-25 లక్షల రూ. ల మధ్య ఉంటుంది.

ఢిల్లీకి అభివృద్ధి సంఘం ఒకటీ, స్థలాల సంఘం ఒకటి ఉన్నాయి. వార్తా పత్రికల ద్వారా న్యూఢిల్లీని అందంగా చెయ్యటానికి పూనుకున్న సంఘాలుకూడా ఉన్నాయి. ఇవి ఎంతెంత పెద్దపేర్లు పెట్టుకున్నా వాటి నిర్వహణ కర్తలలో అపరిశుభ్ర మనస్తత్వం పోనంతకాలం న్యూఢిల్లీ పరిశుభ్రపడదు.

25 లక్షల రూ. ల ఖరీదైన మంచి స్థలాన్ని కేవలం బస్సు స్టాండుగా మార్చాలనే ఆలోచన కేవలం ఉన్మాదంగా కనిస్తోంది. ఈ స్థలం ప్రభుత్వానిది కాదు. జీవిత భీమా కార్పొరేషనుది. అక్కడ కార్యాలయ భవనాలు, నివాస భవనాలు కడితే కార్పొరేషనుకు కావలసినంత అద్దె లభిస్తుంది.

న్యూఢిల్లీ ఆశలన్నీ ప్రధానమంత్రి మీదే ఉన్నాయి. ఆసియాలోని అందమైన ఒక పట్టణం ఇలా దారుణంగా పాడైపోతూ ఉంటే ఆయన ఊరుకోరు.

* * *

## పబ్లిక్ వేస్ట్ డిపార్టుమెంట్

పి. డబ్ల్యు. డి. అంటే చాలా రకాల అర్థాలున్నాయి. పబ్లిక్ వేస్ట్ డిపార్టుమెంటు అని కూడా ఒక అర్థం తీయవచ్చు. ఈ అర్థం సార్థకం అవుతోంది.

న్యూఢిల్లీ కట్టినప్పటినుంచీ, రోడ్డుపక్కన నడిచే దారికి బజ్రీ అనబడే ఎర్రమట్టి వేయటం ఆచారం. ఇది మామూలుగా వర్షాకాలం తరవాత జరుగుతుంది. ఈ ఏడాది వర్షాలకు ముందే, రాజపథంలో ఎర్రమట్టి వేస్తున్నారు. వర్షాలు వచ్చాయంటే బజ్రీ గిజ్రీ కొట్టుకుపోతుంది. వర్షాలు తగ్గాక మళ్ళ బజ్రీ వేయాల్సి వుంటుంది. అటువంటప్పుడు ఇంతముందుగా ఎర్రమట్టి ఎందుకు వేశారో తెలియదు. పోనీ ఆర్థిక సంవత్సరం అయిపోయేలోగా డబ్బు ఎలాగో ఓలాగు ఖర్చు పెట్టాల్సి ఉందేమో, అందుకని చేస్తున్నారేమో అనుకుందామంటే అదీ లేదు. ఈ విషయాన్ని శ్రీ రెడ్డి విచారించాలి.

మరొక విషయం. ఆరంతస్తుల కొత్త సచివాలయ భవనం శ్రేయోరాజ్య సిద్ధాంతానికి అనుగుణంగానే ఉన్నది. ఈ భవనంలో తలుపు లెంత దృఢంగా ఉన్నాయంటే ఎప్పుడు చూసినా వాటికి మరమ్మతులు చేస్తూనే ఉంటారు. గోడల్ని తాపీగా మరమ్మతుచేస్తూ బోలెడు మంది తాపీ వారు ఎప్పుడు చూసినా కనిపిస్తారు.

## బూట్ పాలిష్

న్యూఢిల్లీలో బూట్ పాలిష్ పనివారు పురపాలక సంఘంతో దాగుడు మూతలాడుకుంటున్నారు. అందమైన చిన్న చిన్న తోటలను పీకి పాడుపెట్టి, పురపాలక సంఘం ఇప్పుడు బూట్‌పాలిష్ వాళ్ళమీద దండయాత్ర సాగిస్తోంది. వాళ్ళు సంఘటితులుగా లేకపోవటమే వారుచేసిన తప్పు. అఖిల న్యూఢిల్లీ బూట్‌పాలిష్ పనివారి ఫెడరేషను అంటూ ఒకటి ఏర్పాటుచేసుకుంటే మంచిదిగా కనిపిస్తోంది. తరవాత పనిలేని లాయర్నో, పార్లమెంటు సభ్యుణ్ణో అధ్యక్షుడుగా ఎన్నుకోవాలి. ఆ పిమ్మట ఇంకో ఫెడరేషనుకు దీనితో అనుబంధం చేసుకుని కాన్ ఫెడరేషన్ - ఏర్పాటు చేసుకోవాలి.

అప్పుడు పార్లమెంటు వీధిలో పార్లమెంటు సమావేశమవుతున్న రోజుల్లో ప్రతిరోజూ నినాదాలు చేస్తూ ఊరేగింపులు, ప్రదర్శనలు జరపాలి. వాళ్ళడక్కుండానే పార్లమెంటు సభ్యుడు ఒకరు బయటికవచ్చి మీకే సహాయం కావలసినా చేస్తానని ఉపన్యాసం ఇస్తారు. అలా జరగకపోతే ఏ మంత్రినో ఆహ్వానించి సత్కార సభ జరపాలి. ఆయనకి ధనంకూడా బహూకరించవచ్చు. క్వీన్స్‌వేలో దుకాణదారులు ఇలాంటి ఉపాయాలనుసరించే నెగ్గుకొచ్చారు వాళ్ళని ఆ దుకాణాలనుంచి బ్రహ్మరుద్రులైనా ఇక తొలగించలేరు. ఇండియా గేటు మురికిప్రాంతం నుంచి వండిన పదార్థాలమ్మేవారినీ అలాగే ఎవరూ తొలగించలేరు. సంఘటితం కాకుండా, చట్టంప్రకారం నడుచుకునే వారికే భారతదేశంలో శిక్ష పడుతుంది. బూట్ పాలిష్‌వారుకూడా సంఘంగా ఏర్పడి గొడవ లేవదీయాలి. అప్పుడు వారిని అంతా గౌరవిస్తారు. అప్పుడు వారు కేంద్ర సచివాలయం లోపలే కూర్చుని తమ వృత్తి సాగించుకోవచ్చు. 



పాతకొత్తల కలయిక:
మునిముని మనమరాలు పహానాతో ఈవాజోవ్.



రోజూవచ్చే పత్రికలు, ఉత్తరాలు అందుకుంటున్న తరతరాల మనిషి ఈవాజోవ్.

అది నెపోలియన్ చక్రవర్తి యూరపును పాదాక్రాంతం చేసుకున్న రోజులు. జార్ చక్రవర్తులు కైజారు పరిపాలనం సాగిస్తున్న రోజులు. ఆరోజుల్లో పుట్టినవాడు మఖ్మూద్ ఈవాజోవ్. ఒకటిన్నర శతాబ్దాల సంక్షుభిత చరిత్రకు సాక్షిగా ఇతడు నేటికీ జీవించి ఉన్నాడు. సోవియెట్ యూనియన్‌లోని అజర్‌బైజన్ రాష్ట్రపు పర్వతల్లో 'పిరసురా' అనే గ్రామంలో ఇతడు నివసిస్తున్నాడు. 'పిరసురా' అంటే వృద్ధుల గ్రామం అని అర్థం. ఈ ఊరు సముద్రపు మట్టానికి 6500 అడుగులకు పైన ఉన్నది. ఊళ్ళో ఉన్న వృద్ధులందరికీ వృద్ధుడు ఈవాజోవ్. కొద్దిరోజుల్లో ఇతనికి 150 ఏళ్ళు నిండుతాయి.

ఇంత వృద్ధుడైనా ఈవాజోవ్ ఇంకా దృఢంగా, ఉత్సాహంగా, చురుకుగా ఉన్నాడు. కాస్సేపు ఊరకే ఉండడు. ఎప్పుడూ పొలాల్లోనో, సమష్టి వ్యవసాయక్షేత్రం ఆఫీసులోనో, కొత్తగా కడుతున్న పాఠశాల స్థలందగ్గిరో, పండ్లతోటలోనో తోటివారికి చేదోడు, వాదోడుగా ఏదో పనిచేస్తూ కనిపిస్తాడు. ఒకటిన్నర శతాబ్దాల వయస్సుగల ఇతని సలహాను కాదనగల సాహసం ఎవరికుంటుంది?

ఆల్పైన్ పచ్చికబీళ్ళకు సమష్టిక్షేత్ర పశుగణాలను తోలుకుపోవటానికి ముందు గొర్రెలకాపరులు ఈవాజోవ్ వద్దకువచ్చి సలహా అడుగుతారు. మంచి పచ్చిక ఎక్కడ దొరుకుతుందో, అక్కడికి దగ్గిరదారి ఏదో ఇతడు చక్కగా చెప్పగలడు. ఇతని దీర్ఘాయువుకు కారణమేమిటా అని అందరూ ఆశ్చర్యపడుతూ ఉంటారు. అతని క్షేమసమాచారాలు అడుగుతూ ఉత్తరాలు రాస్తూ ఉంటారు.

—'టాస్' సౌజన్యంతో] ★



సమష్టిక్షేత్రం పొలాలకు వెడుతున్న వృద్ధపార్వతీయుడు ఈవాజోవ్.

# అమరా నిర్జరా దేవా...

"ఇదిగో"

విన్నే...

విన్నేనమ్మాయ్...

అమ్మయ్యా, వచ్చావా. మూడో పిలుపయినా వినబడిందికదా. ధన్యుడను. ధన్యుడను. అయితే అమ్మాయ్...అయిదో నెల వెళ్ళి ఆరో మాసం ప్రారంభిస్తున్నది కదా, కాపురం ఆరంభించీ...ఏవిటీ...ఏది ఒక్క సారి మొహం పైకెత్తి...ఏది...అందుకే మరీ...మరి నాకు కోపంవచ్చిందంటే నా.... వచ్చేస్తోంది...వచ్చేస్తోంది...అదిగో వచ్చేసింది, నీ అందమైన ముఖంలోకి అలకపాన్పు మీది చిలకనవ్వు...ఒక్క క్షణం అలా ఆ చిరునవ్వు వెన్నెలలువిరజిమ్ముతూ నిలబడు... మళ్ళీ తల దించేస్తుందేమిటోయ్... అబ్బో కొత్త పెళ్ళికూతురు లక్షణాలు పోడసూపుతున్నాయే అత్తయ్యగారి కోడలమ్మాయికి. చాల్లేలే ఎవరన్నా చూస్తే నేనూ నీకు శృంగార రసాభినయంలో తరిఫీదిస్తున్నానని భ్రమపడగలరు కానీ...కానీ...ఒసే... అమ్మడూ...అదిగదిగో ఆ చిలకనవ్వే నన్ను పులకించి పులకించి గిలిగింతలుపెట్టి మొగ్గుణ్ణి చేసింది జ్ఞాపకం ఉందా...

హమ్మో! ఎంత నాటకం!-ఎంత నాటకం! ఏదో కాస్తంత మంచి మర్యాదా తెలిసిన పెద్దమనిషి కనక కాళిదాసు శకుంతల పాదానికి చిన్న దర్భముల్లు తగిలించి వంకర ఓరచూపులతో దుష్యంతుని గుండెలో ఆమె హృదయానికి స్థానం కల్పించాడు. మరి నువ్వో...మా అక్కయ్య గారింటికి ఊసుపోకవచ్చి కూర్చుని మా బావతో సరిదాగా కాలక్షేపంచేసి పోదామని వచ్చిన నాకు ఎదురుగా కిటికీ తెర సందుల్లో కన్నులుంచి ఎంత నాటకం ఆడేదానివి!

పాపురే...

ఆనాడు నీ కన్నుల్లో ఎంత అమాయకత్వం తొణికిసలాడేదనీ... వేసవికాలపు సాయం సంధ్యలలో తలంటి పోసుకుని అప్పుడే తిరిగిన చల్లగాలికి ఎగిరే జుట్టు మునివేళ్ళతో వెనక్కు నెడుతూ జడలో మల్లెల చెండుతో ఎంత వయ్యారంగా మా ప్రక్కనుంచి పొయ్యేదానివే. ఆ సమయాలలో మల్లె చెండు జార్చటానికి ఎంత నైపుణ్యం ప్రదర్శించావు. జారిన మల్లిపూల దండకోసం వెనుదిరిగిన నీ చూపులు లక్ష మల్లెల కాంతులతో నా హృదయాన్ని ఉక్కిరి బిక్కిరి చేసేవి కాదుటే పిల్లా...

నా కందుకే మరి కోపం... నువ్వు నేను మాట్లాడుతూండగా వెళ్ళిపోవద్దని ఎన్నిసార్లు చెప్పానే... ఏమిటో...జీవితంలో మరువలేని మధుర స్మృతుల అమృతక్షణాలు ఆపాటిఅయినా లేకపోతే మోడువారి పోదూ బ్రతుకంతా?

ఔన్లే...కాపరానికొచ్చి ఆరునెలలేనా నిండని పిల్ల ముందు ఇంతఇదిగా మాట్లాడితే ప్రప్రథమంలో నువ్వు నాకేసి చూసిన చూపులవిసుర్లు ఉక్కిరిబిక్కిరి చేసినట్లే, నువ్వూ ఉక్కిరిబిక్కిరవుతావు. అయినా కానీ చూడు పిల్లా ... అంతో యింతో సంగీతం చెప్పుకున్న బుల్లివీ...మరేమోనూ... మరేమో రుక్మిణీకళ్యాణంలో సగంపైగా నువ్వు చెప్పుకోవడమేగాక, వో సిసింద్రీ చెల్లికి చెప్పినదానివేగదా... అట్లాంటి... ఏది?...'

ఏతంవిధ విశిష్టగుణాభ్యుదయ పరంపరలతో అభివృద్ధిచెందిన నారీశిరోమణివి గదా...మరి నామాటకేం నీకు అర్థంకావటం లేదంటే నమ్మగలను? అది సరేకానీ... సంక్రాంతికి పుట్టింటికివెళ్ళిన ఏ ఆడపిల్లయినా...అంటే పెళ్ళిచేసుకున్న పిల్ల—ఏ అమ్మాయిఅయినా, తొలిపురుడుకివెళ్ళినట్టు అన్నాళ్ళుండిపోతార్లే. అబ్బా ... ఎంత సిగ్గే...చిన్నారీ...గాలివిసురుకివచ్చే పూల వాసనలా పారిపోయావేమే ... సరేలే... ఈసారి తా చెపుతా..." ★

[వచ్చేవారం ఇంకోటి.]

# ఆంధ్ర సచిత్ర వారపత్రిక
# బాలల సంఘం

ఆంధ్ర సచిత్ర వారపత్రికలో 1958 జులై 1-వ తేదీ నుంచి 'బాలలసంఘం' స్థాపించాము. జులై 1-వ తేదీ నాటికి 15 సంవత్సరాల వయస్సు నిండని, ఐదేళ్ళ వయస్సుకు తక్కువ గాని ప్రతి తెలుగుబాలుడూ, బాలికా సభ్యత్వం పొందవచ్చు. సభ్యత్వానికి రుసుమేమీ చెల్లించవలసిన పనిలేదు. తెలుగు బాలబాలికలందరూ వెంటనే సభ్యులుగా చేరి సచిత్ర వారపత్రిక అప్పుడప్పుడు నిర్వహించే చిన్న చిన్న పోటీలలో పాల్గొని "సంఘం" ఆశయాలను జయప్రదం చేయడానికి సహాయపడతారని ఆశిస్తున్నాము.

## గమనిక

పదకొండు మొదలు 15 సంవత్సరాలవరకూ వయస్సుగలవారిని 'A' వర్గంగానూ, ఆరు మొదలు 10 సంవత్సరాల వయస్సువరకూ గల వారిని 'B' వర్గంగానూ విభజించడం జరుగుతుంది.

## ముఖ్య విషయాలు

సభ్యులుగా చేరదలచిన బాలబాలికలు చేయవలసిం దొకటే. దీనితోపాటు ఒక సభ్యత్వపు దరఖాస్తును ముద్రిస్తున్నాము. అందులోని ఖాళీస్థలాలను మీ వివరాలతో జాగ్రత్తగా నింపి (కొట్టివేతలు, దిద్దుపులు వుండకూడదు.) ఆ అచ్చు దరఖాస్తును తిన్నగా కత్తిరించి కవరులో:

సంపాదకుడు,

ఆంధ్ర పత్రిక సచిత్రవారపత్రిక,
తంబుచెట్టివీథి, మద్రాసు-1.

అనే చిరునామాకు పంపాలి. కవరుమీద వెనకవైపు "సచిత్ర వారపత్రిక బాలల సంఘం" అని స్పష్టంగా వ్రాయాలి. మామూలు కాగితాలమీద వ్రాసిపంపే దరఖాస్తులను స్వీకరించము.

ఒక్కొక్క దరఖాస్తుమీదా ఒక్కొక సభ్యుని, లేదా, సభ్యురాలి పేరుమాత్రమే వుండాలి. సభ్యత్వపు దరఖాస్తును సచిత్ర వారపత్రికలో సాధ్యమైనంతవరకు వారం వారం ప్రచురిస్తుంటాము.

సభ్యులుగా చేర్పుకున్నట్లు ఒక్కొకరి పేరా విడివిడిగా ఒక్కొక సభ్యత్వపు కార్డును పంపుతాము. ఆ కార్డుమీద సభ్యత్వ క్రమాన్ని సూచించే ఒక సంఖ్య వుంటుంది. ముందు ముందు సభ్యులుగాని, సంఘంగాని జరిపే ఉత్తర ప్రత్యుత్తరాలలో ఆసంఖ్యను ఉదహరిస్తూండడం జరుగుతుంది.

పదిహేనేళ్ళ వయస్సుపది పూర్తికాగానే, ఆతేదీతో బాలల సంఘంలో సభ్యత్వం దానంతటదే రద్దయిపోతుంది.

## లక్ష్యాలు

(1) సభ్యులుగాచేరే బాలబాలికలను ఆరుమొదలు పదేళ్ళవరకూ ఒక వర్గంగానూ (B), పదకొండు మొదలు పదిహేనేళ్ళ వరకూమరొకవర్గంగానూ (A), విభజించిఉభయ వర్గాలకూ విడివిడిగా అప్పుడప్పుడు రెండురకాల పోటీలు నిర్వహించి ప్రథమశ్రేణిలో నెగ్గేవారికి మాకుతోచిన బహుమతుల నివ్వడం. (ఈ విషయంలో పోటీనిర్వహణకర్తలదే తుదినిర్ణయం)

(2) సభ్యులలో వారివయస్సుకు తగినట్లుగా రచనాశక్తినీ, పఠనాశక్తినీ, కళాభిమానాన్నీ యథాశక్తి పెంపొందచేయడం.

(3) చిత్రలేఖనం, నృత్యం, అభినయం, గాత్రం వీణ, వయొలిన్ మొదలయిన లలిత కళలలోనూ, వ్యాయామక్రీడలలోనూ ప్రత్యేక అభిరుచీ, ప్రవేశం కనబరిచే బాలబాలికలను బహుమతులద్వారానూ, తదితరవిధంగానూ ప్రోత్సహించడం.

(4) ఏ ప్రాంతంలో నివసిస్తున్నవారైనప్పటికీ తెలుగు బాలబాలిక లందరిమధ్యా స్నేహ సమైక్యభావాలను పెంపొందజేయడం

(5) ఉన్నత పాఠశాలలలో చదివే విద్యార్థులకు ఉచిత విద్యార్థివేతనాలను బహూకరించడం. (దీనికి సంబంధించిన వివరాలను ముందుముందు ప్రకటిస్తాము ) ★

---

ఆంధ్ర సచిత్ర వారపత్రిక
బాలల సంఘం
[సభ్యత్వపు దరఖాస్తు]

GROUP
A లేక B

సభ్యుని (సభ్యురాలి) పూర్తిపేరు (విడివిడి అక్షరాలలో) ....

పుట్టినతేదీ, నెల, సంవత్సరం : జులై 1 నాటికి వయస్సు: సం॥ : నెలలు :

....

తండ్రి, లేక, సంరక్షకుని పూర్తి పేరు : ....

ఊరిపేరు, జిల్లా, తాలూకా, పోస్టు [వీథి: నెంబరు] ....

* చదువుతున్న తరగతి, లేక, ఫారము : ....

పాఠశాల పేరు : ....

ప్రధానోపాధ్యాయునిపేరు (తెలిస్తే) :

అర్యా :

ఆంధ్ర సచిత్ర వారపత్రిక బాలల సంఘములో నన్ను సభ్యునిగా/సభ్యురాలుగా చేర్పుకొనప్రార్థన. పైన వ్రాసిన విషయాలన్నీ యదార్థములు.

ఇట్లు

[తేదీ : -1958]

(సంతకము)

* షరా : ఏ పాఠశాలలోనూగాక ఇంటివద్దనే ట్యూషన్ చెప్పించుకొనే బాలబాలికలు కూడా సభ్యులుగా చేరవచ్చు. 'చదువుతున్న తరగతి' అనే విషయానికి ఎదురుగా 'ప్రైవేట్ స్టడీ' అని వ్రాయాలి.

సంచిక: 30-7-58 | ఈ దరఖాస్తు 2-8-58 నాటికి మాకు చేరాలి

# ★ కొందరు సభ్యుల పేర్లు ★

[ఆంధ్రసచిత్రవారపత్రిక బాలలసంఘంలో సభ్యులుగా చేరినవారిలో మరికొందరి పేర్లను ఇక్కడ ప్రచురిస్తున్నాము.]

1. కే. రామమోహన్ (సికింద్రాబాదు) 2. కందిమళ్ళ శారదాంబ (చిలకలూరిపేట) 3. తూమాటి చాణక్య కుమార్ (బెల్లంకొండ, గుంటూరుజిల్లా) 4. ఇమ్మనేని వెంకటకృష్ణసాయి (బళ్ళారి) 5. వల్లూరి వెంకటశేషగిరి (దక్షిణవిజయపురి, పల్నాడు తాలూకా) 6. వలివేటి పార్వతి (చిత్తూరు) 7. డి. సూర్యప్రకాశరావు (హైదరాబాదు) 8. పుల్లెల భద్రాద్రిరాంరావు (హనుమకొండ, వరంగల్లుజిల్లా) 9. అన్నంరాజు లక్ష్మీనారాయణమూర్తి (గుంటూరు) 10. కవగవరపు రవికుమార్ (తెనుకు) 11. ద్రోణంరాజు సీతారావు (లంకలకోడేరు, ప. గో. జిల్లా) 12. ఈశ్వర రామకృష్ణ (విశాఖపట్నం) 13. కే. వి. శేషశయన (విజయవాడ) 14. జి. సత్యవెంకటరామం (పెద్దాపురం) 15. పి. పి. రంగాబాయి (కాకినాడ) 16 కే శ్రీకృష్ణ (మక్కర్ నగర్, నిజామాబాద్ జిల్లా) 17. రావూరి రాజారావు (రాజమండ్రీ) 18 బి. ఫణిమోహన్‌కృష్ణ (హైదరాబాదు) 19 ఎస్. రవీంద్రనాథ్ (విజయవాడ) 20 తెలిదేవర సింహాద్రి అప్పారావు (పాతబొబ్బిలి, శ్రీకాకుళంజిల్లా.)

21. సుమ్మలూరు శ్రీ సర్వేశ్వరి (కరోల్ బాగ్, న్యూఢిల్లీ) 22. అబ్బిరు భాస్కరరావు పట్నాయక్ (బిట్రగుంట, నెల్లూరు జిల్లా) 23. రాళ్ళపల్లి జగన్మోహిని (విశాఖపట్నం) 24. సత్యవాడ సుబ్బాయమ్మ (ఆత్రేయపురం, తూ॥ గో) 25. వణుకూరి రఘురామిరెడ్డి (అంకిరెడ్డిపాలెం, గుంటూరు జిల్లా) 26. బృందావనం వెంకటశేష స్వరాజ్యలక్ష్మి (భైరీపురం, శ్రీకాకుళం జిల్లా) 27. వలభనేని శారద (పామర్రు, కృష్ణాజిల్లా) 28. జానశంకరరావు (మోరి, తూ॥ గో॥) 29. పుల్లెల భాస్కరరావు (ఇచ్ఛాపురం, శ్రీకాకుళంజిల్లా) 30. నిశంకరావు హరిప్రసాదరావు (చీరాల) 31. అమరవాది వేంకట ఆనందస్వరూప్ (విజయవాడ) 32 జమ్మి శ్రీనివాసరావు (పర్లాకిమిడి, గంజాంజిల్లా) 33. వరాశరం గోపికుమారి (చేబ్రోలు, గుంటూరుజిల్లా) 34. దేవులపల్లి జయదేవ్ (ఆగిరపల్లి, కృష్ణాజిల్లా) 35. ఆర్. వి. వి. రామారావు (ఇంద్రపాలెం, తూ॥ గో॥) 36 జే. భీమశంకరమూర్తి (విజయవాడ) 37. అయ్యగారి సత్యనారాయణ (కాకినాడ) 38 భాగానగరపు లలితకుమారి (కాకినాడ) 39 గంగానరభట్ల వెంకటేశ్వర ప్రసాద్ (విజయనగరం) 40. కే. విశ్వేశ్వరరావు, బందరు.)

41. మిక్కిలినేని సుభాస్‌చంద్రబోసు (పామర్రు, కృష్ణాజిల్లా) 42 నిశుముక్కల సాంబశివరావు (పాతగుంటూరు) 43. పొక్షునూరి వెంకటేశ్వరరావు (విజయనగరం) 44. ఆచంట సుబ్రహ్మణ్యేశ్వర శర్మ (మాడుగుల, విశాఖజిల్లా) 45. దంటు వెంకటహరినాథ్ (చిత్తూరు) 46. దోనవల్లి వెంకటశివరామప్రసాద్ (మొగల్‌రాజపురం విజయవాడ) 47. కే నరశింగరావు (ఉరవకొండ, అనంతపురం జిలా) 48. కే. శ్యామసుందర్ (కర్నూలు) 49 కే. విజయలక్ష్మి (కర్నూలు) 50 కొత్తపల్లి రాధాదేవి (చినగంజాం) 51. సూరిరమణ (గుంటూరు) 52 ముసునూరి శారద (విజయవాడ), 53. కొత్త లక్ష్మి (రాజమండ్రీ) 54. పులిపాటి ఆంజనేయులు (అనంతపురం) 55. ఈదర విద్యాసాగర్ (నాగాయలంక, కృష్ణాజిల్లా) 56. అయాచితుల కస్తూరిదేవి (కాకినాడ) 57. కాలనాథభట్ల వెంకట అచ్యుతరామ శాస్త్రి (కూటాల, ప॥గో) 58. మేడా సత్యనారాయణ (చినతిప్ప సముద్రం, చిత్తూరుజిల్లా) 59 తాడ్నూరి వీర్రాజు (పెద్దాపురం) 60. గూడూరు రేణుకాదేవి (గూడూరు)

61. విజయవర్ధన్ (న్యూఢిల్లీ) 62. అడపా సత్యనారాయణ బాబ్జీ (తెనుకు) 63. కొకరపర్తి వెంకటసూర్యప్రభావతి (ఈంగుటూరు, గుంటూరుజిల్లా) 63. బెల్లంకొండ ఊర్మిళాదేవి (గోవాడ) 64. పురిగండ్ల శ్రీనివాసరావు (రాజమండ్రీ) 65. గాయత్రి వెంకటశివశాస్త్రి (గాయత్రీపురం, కృష్ణా జిల్లా) 66. బోడి వెంకట హనుమంతరావు (గుంటూరు) 67. రామడుగు శ్రీనివాస్ (ఏలూరు) 68. దండివాడ మాధవరావు, (విజయవాడ) 69. కుందుర్తి శ్రీ మహావిష్ణువు (చీరాల) 70. దేవరాజు జనార్దనరావు (విజయపురి సౌత్, పల్నాడు తాలూకా), 71. ఏళ్ళ శారదాదేవి (పెద్దాపురం) 72. కొత్తూరు కనక దుర్గాదేవి (గుడివాడ) 73. యల్లాప్రగడ పార్థసారథి (శిరిపూడి, గుంటూరుజిల్లా) 74. దశిక విజయరాఘవరావు (రామచంద్రపురం, తూ॥ గో॥) 75. తణుకు రామకృష్ణజనార్దనరావు(కొత్తపేట, తూ॥ గో॥) 76. లక్కరాజు లక్ష్మి సత్యవాణి (నరసారావుపేట) 77. కేదారిశెట్టి శ్యామప్రసాద్ (అమలాపురం) 78. కొమరవోలు రామకృష్ణప్రసాద్ బాబు(వుయ్యూరు) 79. రావినూతల జానప్రసూనాంబ (కోవూరు, నెలూరుజిలా) 80. గబ్బిట వేదవల్లి (రామఘడ్, బళ్ళారిజిల్లా).

81. కొప్పరపు వెంకట కామేశ్వర శివప్రసాద్ (మాద్రాసు) 82 కనకాల దేవదాస్ (యానాం) 83. వేంద్ర పద్మావతి (కోడేరు, ప॥ గో) 84. కామిశెట్టి వెంకటరమణయ్య (మాచవరం, తూ॥ గో॥) 85. వి. దయానంద కుమార్ (నెల్లూరు) 86. అవసరాల ప్రతాప్ కుమార్ (ఏలూరు) 87. కే సి. నారాయణ (నెల్లూరు) 88. డబ్ల్యు గోపాల్ (విశాఖపట్నం 89 జానంశెట్టి కోటేశ్వరరావు (వడపల్లి, వత్తెనపల్లి పోస్టు) 90. చింతలపాటి సుబ్రహ్మణ్యశాస్త్రి (ఎనమదల, గుంటూరుజిల్లా) 91. చెన్నారెడ్డి ప్రమీలమ్మ (గూడూరు) 92. అయ్యగారి పద్మసుందరి (మామిడిపల్లి, తూ॥ గో॥) 93. ఏ. సీతామహాలక్ష్మి (హైదరాబాదు) 94. సూరిశెట్టి శంకరనారాయణ (ఝరియా, ధన్‌బాద్, బీహారు) 95. కళానిధిలక్ష్మీవరసమ్మ (బందరు) 96 ఆదుర్తి సత్యవెంకటభాస్కర్ (జామి,విశాఖజిల్లా) 97. అరిటాకుల సుశీలాదేవి (విజయనగరం) 98 జి. వి. జవహార్ (హైదరాబాదు) 99. ఎస్. బి. జగన్నాథం (సికింద్రాబాదు) 100. దిల్ షాద్ (నరసన్నపేట, శ్రీకాకుళంజిల్లా).

101. ఏ. చంద్రశేఖరప్ప (జడ్చర్ల, మహబూబ్‌నగరం) 102. విప్పర్తిఆదిమూర్తి (రాజమండ్రీ) 103. రాచకొండ లలితకుమారి (విశాఖపట్నం) 104 మంచాళ జోగులమ్మ (హైదరాబాదు) 105. ఏ. జి. శకుంతల (కైకలూరు) 106. ద్రోణంరాజు జగన్నాథరావు (శాసనపల్లి గూడెం) 107. అవుల జయశ్రీ (తెనాలి) 108. కొండ్రు సుజాత (చినకొండేపూడి, తూ॥ గో) 109. చెన్నారెడ్డి సౌందర్యమ్మ (గూడూరు) 110. అమరవాది వెంకట శివకుమార్ (విజయవాడ) 111. కే. రాఘవేంద్రరావు (కడప) 112. సుంకర వాసుదేవరావు (జరజాపుపేట, విశాఖజిల్లా) 112. నందూరు విజయలక్ష్మి (అల్లాపురం, కృష్ణా జిల్లా) 113. వేదము లక్ష్మీనారాయణ (మదరాసు) 114. శెట్టిపల్లి సామ్రాజ్యమ్మ (నెల్లూరు) 115. బి. అమృత (కొండుర్గు, మహబూబ్‌నగరంజిల్లా) 116 జగన్‌మోహన్‌రావు (బాదేపల్లి, మహబూబ్‌నగరంజిల్లా)

# కొందరు సభ్యుల పేర్లు

117. మంగులూరు శ్రీనివాసరావు (శ్రీకాకుళం) 118. తెన్నేటి సుధాకుమారి (కిషన్ పూరా, హనుమకొండ) 119 దళిక సోమేశ్వరరావు (విశాఖపట్నం) 120. యనమండ్ర సత్యనారాయణమూర్తి (హైదరాబాదు)

121. చెర్వు సత్యనారాయణమూర్తి (గుంటూరు) 122. తిల్లాప్రగడ రూపమీనాక్షి (రాజోలు) 123. చివుకుల రామకృష్ణమూర్తి, (తాడేపల్లిగూడెం) 124. ఉప్పులూరి లక్ష్మి అనూరాధ (విజయవాడ) 125. తాడికొండ జగన్మోహనరావు (పెడన, కృష్ణాజిల్లా) 126. మానుగ్రర విజయలక్ష్మి (నిడదవోలు) 127. వారణాసి సుభద్ర (పెద్దాపురం) 128. మలపాక పాండురంగ (యండగంటి, ప॥ గో॥ జిల్లా) 129. పిలకా భాస్కరరావు (కదమా, ఫార్మ్ఏరియా, జంషడ్పూరు) 130. శెట్టి వెంకటనాగభూషణరావు (విశాఖపట్నం) 131. పాకల సీతారామమూర్తి (చోడవరం, విశాఖజిల్లా) 132. పొట్లూరి కనకదుర్గ (నర్సాపురం, ప॥ గో॥ జిల్లా) 133 పళ్ళ జైరామ్ (పెద్దాపురం) 134 ముసునూరి ఉమాదేవి (విజయవాడ) 135. పాకల శ్రీలక్ష్మి (ఛత్రపురం, గంజాం జిల్లా) 136. మామిడిపూడి వెంకటరామమోహన్ (సికింద్రాబాదు) 137. సోంభొట్ల వివేకానందమూర్తి (విజయవాడ) 138. కంతేటి యతిరాజవల్లి తాయారు (బందరు) 139 యలమాటి సుగుణమణి (ధర్మవరం, ప॥ గో॥ జిల్లా) 140. అల్లాడ జయభారతి (కాకినాడ.)

141 కోకా హరిహరరంగారావు (విజయవాడ) 142. చిట్టూరు శ్రీరామమూర్తి (అనకాపల్లి, విశాఖజిల్లా) 143. పోణంగి వెంకటసుబ్రహ్మణ్య శివప్రసాద్ (రాజమండ్రీ) 144. ప్రయాగ రామకుమార్ (రాజమండ్రీ) 145. కొమ్మిని భూపాల్ చౌదరి (నశింపల్లె, చిత్తూరుజిల్లా) 146. పి. సంతోష్‌రమణారావు (కాకినాడ) 147. మల్లెల లక్ష్మీప్రసాదరావు (రాయపర్తి, వరంగల్లు జిల్లా) 148 అయినంపూడి సుబ్బారావు (తెనాలి) 149. విస్సా వర్ధమాన్ (గుంటూరు) 150. కర్పూరం పాల్ సుందర్ రాజా (రెంటచింతల, గుంటూరుజిల్లా) 151. కూచిమంచి సౌభాగ్యవతి (అమలాపురం) 152. యలమర్తి బాబూరావు (కూచిపూడి, గుంటూరుజిల్లా) 153. జయన లక్ష్మీనరసమ్మ (చర్ల, తూ. గో.) 154. కాశీరాజు నూరి బాబు (కడప) 155. జోన్స్ రవి (వీరవాసరం, ప. గో.) 156. మానూరు రామకృష్ణ (బాపట్ల) 157. బి. సుబ్రహ్మణ్యం (హోస్పేట, బళ్ళారి) 158. దారా లక్ష్మణ్ (విజయనగరం) 159. గంగ్రేటు గురుమూర్తి (బాయిరిపల్లి, శ్రీకాకుళంజిల్లా) 160. చావలి సుభద్ర (విశాఖపట్నం.)

161. పుల్లాభొట్ల రామచంద్రమూర్తి (గునుపూడి, ప. గో.) 162. ఇంజేటి సీతారామ్ (బొబ్బిలి, శ్రీకాకుళం) 163. కట్టమూడి వెంకట దుర్గాశేష రామలక్ష్మి (జుత్తిగ, ప. గో), 164. కొత్త శ్రీనివాసరావు, (బరంపురం గంజాంజిల్లా) 165. రాయవరపు జగన్నాథరావు (కాకినాడ) 166 నేత్రకంటి శారద (కాకినాడ) 167. కే. దయానందరావు (సదాశివుపేట, మెదక్ జిల్లా) 168 వంగూరి హరిహరప్రసాద్ (తణుకు) 169. మల్యాల జగన్నాథశర్మ (పిఠాపురం) 170 పోలుపర్తి, జగన్నాధరావు (విశాఖపట్నం) 171. శీతంరాజు సీతాలక్ష్మి (ఏలూరు) 172 బి. రఘుపతి (మలంగూర్, కరీంనగరంజిల్లా) 173. రాపర్ల జగన్నాథ్ (రాజమండ్రీ) 174. వాసిరాజు రంగారావు (ఒంగోలు) 175. కే. ఆనందరావు (పర్లాకిమిడి, గంజాంజిల్లా) 176. ఎం. రంగారావు (పాలూరు, శ్రీకాకుళంజిల్లా) 177. పెండ్యాల శ్యామప్రసాద్ (చిలకలూరుపేట) 178 వింజమూరి ఆండాళ్లు (హైదరాబాదు) 179. రాంపల్లి సూర్య రాజ్యలక్ష్మి (ఏలూరు) 180. చలువాది వెంకటరమణమూర్తి (ఒంగోలు)

181 తిప్పిరెడ్డి జనార్దన్ రెడ్డి (ముత్తగూడెం, ఖమ్మంమెట్టుజిల్లా) 182. కోట మురళీకృష్ణరావు (నెల్లిమర్ల, విశాఖజిల్లా) 183 నలాని చక్రవర్తుల రంగనాయకమ్మ (మంగళగిరి) 184 అడవికొలను శ్రీరామారావు (పెద్దాపురం) 185. ఎం. మనోరమ (దేవరకొండ, నల్గొండజిల్లా) 186. తుమ్మల గోపాలకృష్ణ (మధిరపాడు, కృష్ణాజిలా)

---

### గమనిక

జూలై 16-వ తేదీన ప్రచురించిన బాలల సంఘం సభ్యుల జాబితాలో 88వ పేరు డి. ఇంద్రమోహన్‌వర్మ అని గమనించాలి. ఇంద్రమోహన్‌శర్మ కాదు. ★



వ్యథితహృదయ

చిత్రకారుడు: వీరిశెట్టి అచ్యుతరావు—పుల్లేటికుర్రు.]

# లోభి

భగవాన్లు భోజనం చేసి, భుక్తాయాసం తీర్చుకు నేందుకు గాను, పెరట్లో మల్లి పందిరివద్ద మడతకుర్చీ వాల్చుకుని సుఖాసీను డయ్యాడు. మల్లిపందిరి మీదుగా వీచే మలయ పవనం సుగంధం విరజిమ్ముతూ హాయి చేకూరుస్తోంది. వినీలాకాశంలో శరత్కాలమేఘాలు దూదిపింజెలకు మల్లే తేలి పోతున్నై. మబ్బుకన్నెలతో నిండు చంద్రుడు దోబూచులాడుతున్నాడు. కౌముది కౌగిలింతలో ప్రకృతికాంతవినూత్న కాంతులు విరజిమ్ముతోంది. ప్రకృతి సౌందర్యాన్ని తిలకిస్తూ తన్మయుడవుతున్న భగవాన్లు, భార్య తమలపాకు చిలకనోటి కందించేప్పటికి, మళ్లీ యీలోకంలో పడి మంద హాసంతో ఆమెవంక చూచాడు.

ఆమె ధరించిన తెల్లని జార్జెట్ చీర, ఎర్రని జాకెట్టు, తుమ్మెద రెక్కలాంటి నల్లటి కురులలో తురిమిన మల్లెలు వెన్నెల వెలుగుల్లో వింతసోయగం చేకూరుస్తున్నై. నుదుటిమీద ముద్దులవర్షం కురిపిస్తున్న ముంగురుల్ని, అద్దంలా తళతళా మెరుస్తున్న నును పాటి చెక్కిళ్లనూ చూస్తూ అజంతా శిల్పాలు యిలానే వుంటాయి కాబోలు అనుకున్నాడు. అతనల్లా కన్నార్పకుండా తన వంక చూస్తుంటే పద్మిని బుగ్గలు సిగ్గుతో ఎరుపెక్కాయి. ముసిముసినవ్వులు నవ్వుతూ "అదేమిటండీ...మరీ యిదిగా, కొత్తవాళ్లను చూసినట్లు చూస్తున్నారు?" అంది.

"ఇవ్వాళ నిజంగా నువ్వు నాకళ్లకు కొత్తగానే కనిపిస్తున్నావ్ పద్మినీ" అన్నాడు భగవాన్లు.

"మరీ చిన్నపిల్లలవుతున్నారు..." అంటూ ఆఖరి చిలక అతనినోటి కందించి, తను వేసుకోటానికి ఉపక్రమించింది.

కొనిమిషం యిరువురి మధ్యా నిశ్శబ్దం ఆవరించింది. తన మనసులోని కోరికను బయట పెడదామా—వద్దా, అని కొన్ని క్షణాలు తటపటాయించి, చివరికి—

"ఏమండీ..." అంది నెమ్మదిగా.

"ఏమిటె, విశేషం?"

"మరేంలేదు...రేపు ఫస్టుతారీఖు జీతాలు అందుతాయి గనుక, రేపు సాయంకాలం ఆఫీసునుండి వొచ్చేప్పుడు ఓ క్రేపు సిల్కు చీర తీసుకురండి...క్రేపుసిల్కు చీర కొనుక్కోవాలని ఎన్నాళ్లనుంచో ముచ్చటగా వుంది."

"నాకూ వుంది ఓవులెన్ సూటు కుట్టించుకోవాలని. ఎన్నాళ్ళ నుంచో ...... ఏం లాభం?"

"పోనిద్దురూ—మరీ సన్నాడించటానికి కాకపోతే, ఓ యిరవై రూపాయల్లో వచ్చే క్రేపుసిల్కు చీర, వులెన్ సూటు, ఒకటే నేమిటి?

"ఇరవై రూపాయలు నీ దృష్టిలో స్వల్పమొత్తమే కావచ్చు...అయినా, పండుగ-పబ్బం ఏమీ లేకుండా, తీరికూచుని మనకు వొచ్చే ఎంభైరూపాయల్లోనూ ఇరవై కేవలం చీరకే పెడితే మిగిలిన అరవై రూపాయల్లోనూ నెలవెళ్లమారేదెట్లా?—ఎంత యిద్దరు మనుష్యులం అయినాను."

"ఎనభై అంటారేమిటండీ, మీ జీతం నూరయితేను."

"నిజమేఅనుకో, కాని, ప్రతి నెలా ఇరవై రూపాయలు సేవింగ్సుబ్యాంకులో వేసి,

## "కోమలి"

తగిమ్మా సొమ్ము వాడుకోవటంకదా మన అలవాటు!"

"పోనీ యీ ఒక్కనెలా బ్యాంకులో వెయ్యటం మానివేసి నా ముద్దు చెల్లించరాదుటండీ."

"అదేం లాభంలేదు. ఓ నియమం అంటూ ఏర్పరచుకున్నాక ఆ ప్రకారం నడుచుకోవాల్సిందే. ఈ ఒక్కనెలేకదా అని మెత్తబడితే, ప్రతినెలా యిటువంటి అవసరాలు కలగటానికి కొండంత అవకాశంవుంటుంది. అయినా, క్రేపుసిల్కు చీరమీద నీకు అంత మోజుగావుంటే ఈమారు పండక్కు తీసుకుందువుగానిలే."

"మీ లోభత్వం తెల్సివుండికూడా అడగటం నాదేతప్పు" — మూతి బుంగలా పెట్టింది.

"నువ్వేకాదు పద్మినీ—ఏవేవో అవసరాలంటూ చెప్పి సేవింగ్సుబ్యాంకులోని డబ్బు తీసి అప్పుగాయిమ్మని ప్రాధేయపడి విఫలురైన తోటి గుమాస్తాలుగూడా నన్ను చాలమంది 'నువ్వు ఒట్టి లోభివి' అన్నారు. వాళ్ళలా అన్నారని నేనెప్పుడూ బాధపడలేదు. వీలున్నచోటల్లా అప్పుచేసి రూపాయల్ని చిల్లపెంకుల్లా ఖర్చుచేసేవాళ్ళకేం తెలుస్తుంది—డబ్బువిలువ...ఈ సొమ్మంతా యిలా జాగ్రత్తచేస్తున్నానంటే ఎవరికోసం?...మనకోసమేకదా! నీకూ, నాకూ గూడ పెద్దలిచ్చిన అని సెంటు భూమికూ, లేదు. అంచేత యిప్పటినుంచీ తెగనాడ పటమో జాగ్రత్తచేసుకుంటేనే సర్వీసు లోంచి రిటైరయినతర్వాత, రోజులు నిశ్చింతగా గడిచేది."

"లాకత్వం, డాక్కొమ్మ పెట్టడానికి యింతపెద్ద ఉపన్యాసం ఎందుకు?"—ముక్కుపుటా లెగరవేసుకుంటూ లోపలికి పోయింది పద్మిని.

ఆనాడు యిరువురూ ఉత్తర దక్షిణ ధ్రువాలుగా మారారని వేరే చెప్పనవసరం లేదు.

* * *

జీతం అందుకుని ఐ గంటలకు ఆఫీసు వదిలిన భగవాన్లుకి క్రితంరాత్రి తనకూ—భార్యకూ మధ్య క్రేపుసిల్కు చీర గురించి జరిగిన వాదోపవాదాలు జ్ఞాపకంవొచ్చేయి. కొనటమా, మానటమా అని ఆలోచించుకుంటూ మెయిన్‌రోడ్డుమీద నడుస్తున్న భగవాన్లకి దారిపొడుగునా పెద్ద పెద్ద బోర్డులు కట్టివున్న "సిల్కు ఎంపోరియం"లు చిరునవ్వుతో ఆహ్వానిస్తున్నట్లే తోచింది. ఎంత ఆలోచించినా భార్య కోరిన ఆమాత్రం చిన్నకోరిక తీర్చటమే సబబుగా తోచింది. పైపెచ్చు భార్యదృష్టిలోగూడా తను లోభిగా చెలామణి కావటం యిష్టంలేక బూత్‌చంద్ షాపులో పాదంమోపాడు.

తను ఇంటికి చేరుకునేప్పటికి కోపగృహంలో వుంటుందని అంచనా వేసుకున్న భగవాను, ఎప్పటికిమల్లే సింగారించుకుని చిరునవ్వుతో తనకు స్వాగతం యిచ్చిన భార్యను చూచి కొంచెం విస్మయం చెందిన మాట నిజం. కాని బయటకు తేలకుండా గుంభనగా వుండిపోయాడు.

వేడి వేడి వుప్మాతిని కాఫీ చప్పరిస్తున్న భర్తముందు, చిరునవ్వు చిలకరిస్తూ

"నాకు రాత్రి భయంకరమైన కల వచ్చింది," అన్నాడొకడు.

"ఏమిటది?" రెండోవాడు.

"నేను ఒకఓడలో ప్రయాణం చేస్తూండగా ఓడ మునిగి పోయి, నేనూ మరో ముగ్గురు అందమైన యువతులూ ఒక నిర్జన ద్వీపానికి కొట్టుకు వెళ్ళామట. అదీ కల."

"ఇందులో భయంకరం ఏముంది?"

"చెప్పడం మరిచిపోయాను. నేను కూడా యువతినేనట."

గులాబిరంగు క్రేపుసిల్కు చీర, వుంచింది పద్మిని. చీరవంక, ఆమెవంకా ఆశ్చర్యంగా చూస్తూ,

"ఎక్కడిదిది?" అన్నాడు భగవాన్లు.

"ఈ వీధిలో అందరూ వాడికగా బట్టలు తీసుకునే అతనివద్ద, రెండుదఫాలుగా తీర్చే పద్ధతిని తీసుకున్నాను లెండి"—గొప్పగా చెప్పుకుంది.

"నన్నడక్కుండా ఎందుకు తీసుకున్నావ్?—కోపం పట్టలేకపోయాడు.

"ఏం చెయ్యమంటారు?......అంతా బట్టలు తీసుకుంటూంటే ఊరికే చూతామని పక్కింటి సుబ్బమ్మగారింటికి వెళ్ళేను. అలా వెళ్ళటంవే చిక్కొచ్చింది. ఈ చీర గడివిప్పి నాఒంటిమీద వేస్తూ 'నీ ఒంటికి యిదెంత బాగా నప్పిందనుకున్నావు?'

'తీసుకో' అంటే 'తీసుకో' అని అక్కడున్న వాళ్ళంతా బలవంతం చేశారు. అక్కడికి నేను ఒద్దనే అన్నాను. కాని వాళ్ళూరుకుంటేనా,

"నీకు పిల్లా—పీచా, ఏంఖర్చు?...... అంతగా మీవారు దెబ్బలాడితే చీరడబ్బు నేనిచ్చుకుంటాలే. తీసుకువెళ్ళు" అని సుబ్బమ్మగారు మరీ యిదవుతూంటే మరి మొహమాటపడక తప్పలేదు......అయినా మీరు నాకేమీ ప్రత్యేకం దీనికోసం డబ్బివ్వనవసరంలేదు లెండి. ఇంటి ఖర్చుల కోసం యిచ్చేడబ్బులో నేనే ఎలాగో సర్దుబాటు చేసుకుంటాను" అంటూ మూతి మూడువంకర్లు తిప్పింది.

"గడసరితనం అంటే అలావుండాలి మరి. రెండుచీరలు సంపాయించికూడా యింకా యీ మూతివిరుపు లెందుకు?"

"రెండెక్కడండీ మహాప్రభో! నేను తీసుకున్నది ఒకటేగా!"

"ఇదిగో నేనొకటి తెచ్చేను" అంటూ అంతసేపూ ఆఫీసు ఫైళ్ళతో సహా టేబిల్ మీద ఉంచిన సంచిలోనుంచి ఓ ప్యాకట్ తీసి ఆమెచేతిలో పెట్టేడు. ప్యాకట్టువిప్పి, ఆకుపచ్చరంగు క్రేపుసిల్కు చీర చూచేప్పటికి ఆమె మొఖం విప్పారింది.

"పోన్లెండి. ఇద్దరం ఒకరికి తెలియకుండా ఒకరకం కొన్నాం, వేర్వేరు రంగుల్లో తీసుకున్నాం."

"నువ్వడిగినప్పుడే కొంటానని మాట యివ్వకపోవటం నాదే పొరపాటు."

"ఇప్పుడైనా తెలుసుకున్నారా?...... ఇహాముందు నేనే దడిగినా 'లేదు-కాదు' అనకండి. అయినా సామెతలు ఊరికే పుట్టవు. లోభికి ఖర్చెక్కువట!"—వీలు చిక్కింది కదా అని తనను ఉడికిస్తున్న భార్యవంక చిన్నపిల్లాడిలా బుంగమూతి పెట్టి చూశాడు భగవాన్లు. ★

వెంకటరంగం మద్రాసులో తెలుగు పిల్లలకి ప్రైవేటు చెప్పుకుంటూ — ఎలా లేదన్నా నెలకు నూటయాభై రూపాయలదాకా సంపాయించుకున్నాడు. ఉదయమే మాంబళంలో బయలుదేరి - గీతా కేఫ్‌లో పసందుగా మూడిడ్లీ సాంబారును నెయ్యితో సహా ఆరగించి - హాయిగా టాంజూరు డిగ్రీ కాఫీ పొట్టలో పోసుకుని - తదనంతరం పొగయిల్‌తో తమలపాకు సేవించి కాళ్లు చిక్కనంతవఱకు నటరాజా సర్వీసులోనో - తప్పకపోతే ట్రాంగీ బస్సు ప్రయాణాలతోనో - చెదిరివున్న మద్రాసు నగరం ట్యూషనన్నీ పూర్తిచేసుకుని సాయంత్రానికి రూముకి చేరుకునేవాడు. ఎవరిచ్చారో కాని-మంచి సం:హోమీద - హింద్ సైకిలుని యీమధ్య కొని - సైకిలు విహారంతో ట్యూషనులన్నీ ముగించుకుంటున్నాడు - వెంకటరంగం వెంకటరంగాన్ని - రంగయ్య - రంగన్న - రంగప్పా అంటూంటారు. వెంకటరంగం రాయసవీరిదవాడేమీ కాదు. వలసైనా ఎగేస్తుంటాయి. గోదావరి జిల్లాలో ఏదో వూరన్నాడు. యూనవర్సిటీ డిగ్రీలు పేకాటలో పోగొట్టుకున్నాడు. పెళ్ళామూ లేక బిడ్డలూ లేక చివరికి నా అన్నవాళ్లూ లేక ఏ సినిమాలోనైనా దొరుకుతుందని కొన్నాళ్లు మద్రాసు అయితేనే క్షేత్రం వచ్చాడు. అన్ని కంపెనీలకీ పోయాడు. అందరు ప్రొడ్యూసర్లనీ చూశాడు. సినిమా స్టూడియోలన్నీ గాలించాడు. తిరగా - తిరగా రంగానికి వైరాగ్యం పుట్టింది. ఆదరించే దాత లేనప్పుడు యీ సినిమా ఛాన్సు లభ్యం కాదని తీర్మానించుకున్నాడు. పైగా — పాండీబజారులో మంచాలు పరకాయిస్తే యీ సినిమా మేనియాతో మతులేక తిరుగుతున్న వారిని చూసి ప్రపంచ జ్ఞానం చాలా సంపాయించుకున్నాడు రంగప్ప.

ఈ తీర్మానంతోనే ఉస్మాన్‌రోడ్డులో ఒకగది తీసుకున్నాడు. అందులో సహం అద్దె భరించడానికి మరో తెలుగు కుర్రాడిని కుదుర్చుకున్నాడు.

ఏ మాటకి ఆ మాట అనుకోవాలి బడుదాయి కుర్రకుంకల్ని మరామత్తు చెయ్యాలంటే ఆ ఖ్యాతి రంగప్పదే. పాతకాలం పక్కీలను నాగరకపక్కీలను రెంటినీ మిళాయించి—రంగప్ప పిల్లల్ని బాగా తరిఫీదు చేసే సమర్థుడని—మద్రాసు తెలుగువాళ్ళకి ఆనోటా యీనోటా బాగాపాకింది. అంచేత నిక్కచ్చిగా ఒకటో తారీఖు నాడు జీతం బాకీ పెట్టని పెద్ద కుటుంబాలలోనే మన రంగప్ప ట్యూషను సాగిస్తున్నాడు.

ఆడంబరం మర్యాదలంటే రంగప్పకి చాలా అసహ్యం. అలాగని వూరుకుంటాడా మేష్టారని—విద్యార్థులు కాఫీ తెచ్చినా-పళ్ళెమయినా యిచ్చినా బ్రహ్మానందపడి పుచ్చుకుంటాడు. అతని దృష్టి మీ యింటికొచ్చాం మాకేం పెడతావ్-మా యింటికొచ్చావ్ మాకేం తెచ్చావ్ అనేది.

అనుభవంవల్ల రంగప్ప డబ్బును ఇంక వృథాచేయకూడదని తీర్మానించుకున్నాడు. అనవసరంగా ఖర్చు చేయకూడదని నిర్ణయించుకున్నాడు. అంతో యింతో మిగిల్చే పద్ధతి అలవాటు చేసుకున్నాడు. మూడు రూపాయలతో అతను పోస్టల్ సేవింగ్సు బ్యాంకులో ప్రారంభించిన ఎకౌంటు యీనాడు వెయ్యి వరకూ పెరిగిందంటే రంగప్ప ఎంత పొదుపరి అయ్యాడో! అనిపిస్తుంది.

## అయ్యగారి విశ్వేశ్వరరావు

డబ్బును నిలవెయ్యాలి అని అందరికీ వుండదు. కాని నిలవెయ్యడం ఆరంభించిదానిని విజయవంతం చేయాలి అనే దీక్ష చాలా మందికి వున్నా క్రియాలోపం కనిపిస్తూంటుంది. ఈ లోపానికి పెద్ద కారణం అవసరాలు. రంగప్ప అవసరాలను కూడా తగ్గించుకుని పైకం నిలవేయాలి అనే ఇనప తీర్మానం చాలా బలంగా సాగుతూంది.

ఆవేళ సెలజ్ఞాపకం లేదు కాని—ఒకటో తేదీ దాటి మర్నాడు. రంగప్పకి హుషారయిన రోజు. శిష్యవర్గాలనుంచి జీతాలు వసూలుచేసుకొనే నెలసరి పండగ ఆనాడు. మైలాపూరు పాలాతోపులో ఓ చోట ట్యూషన్ చెప్పి లజ్ కార్నర్ వైపు రంగప్ప సైకిలు నడిపించుకుంటూ పోతున్నాడు తేనాంపేట పోవడానికి. ఆవేళ ఆదివారం చాలా సందడిగా వుంది.

"ఏరా—రంగప్పా—కులాసాయేనా?" అంటూ నరసింహం రంగప్పని సమీపించి కుశల ప్రశ్నలు వేశాడు.

అదే సమయంలో రంగప్ప జేబు రూపాయల నోట్లతో నిండివుందేమో—తన సంపాదనకి వరవృద్ధి కలుగుతుందేమో అని జేబు రుమాలుతో మూసేశాడు.

అయినప్పటికీ—అంతా చూస్తూనే వున్నాడు నరసింహం. నరసింహానికి ఏదో బ్యాంకులో బ్రహ్మాండమైన ఉద్యోగమయినా చాలా ఖర్చుమనిషి. అతని వ్యసనం గుర్రం పందాలు. ఎంతో డబ్బు గుప్పేడు నరసింహం—గుర్రం పందాలకి, ఎన్ని సంవత్సరాలనించి యిలా ఖర్చు పెడుతున్నాడో ఎవరికి తెలుసు. ఏ నెలా నిండుజీతం యింటికి లేదు. బాకీలు బాకీలు లాగే వుంటాయి. వెండి బంగారాలు మూడు గాదు ఎంత పెడితే ఏం లాభం. అన్నీ అంగళ్ళకు అమ్ముడయాయి. పట్టుచీరలు-పట్టుతాపితాలు కూడా తెగనమ్మి తన గుర్రాల సరదా తీర్చుకున్నాడు. ఎంత తీర్చినా అతని సరదా తీరితేగా, ఇల్లుగుల్లయినా-ఇల్లాలు వెంగటిల్లినా - పిల్లలున్నవాడైనా-చదువుకున్నవాడయినా-ఏంలాభం-ఆ సరదా అంతులేని సరదాగా అతని జనజీవాలన్నింటినీ నానాటికీ కబళించేస్తోంది.

ఇది ఆదివారం, రెండో తారీఖుకే పర్సు కళాస్, రెండో తారీఖునాడే అప్పు అడిగితే అందరూ నవ్వుతారు. అయినా-అప్పు పుచ్చేది తీర్చేవాళ్ళకి అప్పుతీసికొని మరిచిపోయేవాళ్ళకీ - తీర్చనివాళ్ళకీ ఎవ్వరైనా తిరిస్తారు అప్పు. అంచేత ఆలోచిస్తూ ఆలోచిస్తూ నరసింహం లజ్ కార్నరువైపు పోతూంటే మన రంగప్ప కనిపించాడు.

# ★ మేలు చేసిన ముఖారి ★

చూసే యేముంది-జేబునిండా కిక్కిరిసి వున్నాయి రూపాయలనోట్లు. నరసింహానికి ఆశ్చర్యం ఎంతో ఆనందాన్ని యిచ్చింది. చాలా హుషారుగా నరసింహం రంగప్పను కుశలప్రశ్నలు వేశాడు.

రంగప్పకి నరసింహం సంగతి అంతగా తెలియదు, తెలిసిన తెలుగువాడు, దూర దేశంలో వున్న తెలుగువాళ్ళు మాట్లాడుకుంటే—అందులోనూ ఎన్నాళ్ళకో ఓస్సారి కలుసుకుని మాట్లాడుకుంటూంటే బెంగలన్నీ మరచిపోయినట్లుంటుంది నిజంగా.

నరసింహం—అలా ఆదరణతో కుశల ప్రశ్నలు వేస్తూంటే రంగప్పకి-'వెధవచుట్టాలెందుకు—యీయన ముందు, నా ఆస్తి దొంగ పేకాటలో కాజేశారు వాజ్ఞాలులే,' అంటూ తనవాళ్ళు తనకి తడిగుడ్డ పెట్టి మెత్తనికత్తితో గొంతుక కోశారని—లోలోపల వాళ్ళని తిట్టుకుంటూ-నరసింహం తీరూ—తెన్నూ చూసి ఎంతో ముచ్చటపడాడు. అంతేకాదు అయిదువందల రూపాయల అధికారి—అలా ట్యూషనులు చెప్పుకొనే తనతో అంత ఆలనతో—లాలనతో మాట్లాడటం కేవలం అలభ్య యోగం అనుకున్నాడు రంగప్ప.

"రావోయ్ రంగప్పా—కాస్త కాఫీ త్రాగి పోదువుగాని—చాలా కాలం అయింది మనం కలుసుకుని" అన్నాడు తీవిగా నరసింహం.

'ఇలా పిలిచింది—యీ యిండియాలో ఎవరు? ఉన్నారు ఇంటిపేరు వాళ్లు—ఎందుకు—బంగాళాఖాతంలో చచ్చేదాకా ముంచినా పాపం లేదు. ఈ పెద్దమనిషి ఎంత మర్యాదస్తుడు. ఎంత గౌరవనుడు. కేవలం తెలుగు సంబంధం మినహాయిస్తే ఒక వూరు వాళ్ళమా? ఒక జిల్లా వాళ్ళమా—' అనుకుని రంగప్ప— "మాటవరసకి — ఇప్పుడేనండి కాఫీ తీసుకుంట—" అన్నాడు. ఈమాట అంటూనే ఎక్కడ సెకిలుమీద ఎక్కి వుడాయిస్తాడోనని రంగప్పని నరసింహం బలవంతాన మర్యాదచేయడం ఆరంభించాడు.

"రంగప్పా—అదిగో అదే హోటలు, కొత్తగా పెట్టారు. తాగితే అక్కడే కాఫీ తాగాలి. ఇహ—యిడ్లీవుంది చూశావ్. యీ ఘళ్ళల్లో అక్కడే తినితీరాలి వద్దూ ఏమంత కొంప మునిగింది—" అన్నాడు నరసింహం.

'ఇంతగా నన్ను రమ్మంటున్నాడుగదా-బిల్లు మనచేతిలో పెట్టి పలాయనం సాగించడు కదా—' అని రంగప్ప ఆలోచిస్తూండగానే—నరసింహం అంటున్నాడు. "డబ్బులు తేవనుకుంటున్నావా—ఫరవాలేదయ్యా—నువ్వు యివాళ నా గెస్టువి. రా—ఏమిటి రంగప్పా—యీ మాత్రం దానికి యింత గొడవ పెంచుతావ్—వస్తావా—నేపోనా" అని నిక్కచ్చిగా అడిగాడు నరసింహం.

"అహాఁ ఎంతమాట! నేనేమీ అనడం డానే ఇంత తొందరపడుతున్నారే మీరు?" అంటూ చిరునవ్వులతో—సెకిలుతో—నరసింహంగారేదో చెబుతూంటే వూకొడుతూ—స్టేట్సు హోటలులో ప్రవేశించడం జరిగింది.

"ఇడ్లీ సాంబారు యింత బాగుంటుందనుకోలేదు సుమండీం" అన్నాడు రంగప్ప. "నీకేం తెలుసు యీ హోటలుమజా. ఈ హోటలులో అధమపక్షం అరడజను సార్లయినా కాఫీతాగకపోతే నాకు తలనొప్పి తగదు—నమ్మరంగప్పా," అన్నాడు నరసింహం.

"అల్లాగయితే—నాకు తలనొప్పివస్తే యీ హోటలుకు వచ్చి కాఫీ తాగితేనే కాని తగ్గదేమిటండీ" అన్నాడు రంగప్ప. "ఫరవాలేదులే. నీ అలవాటు బాల్యదశలో నే వుంది," ఇలా అంటూండగానే నరసింహం గొంతుక మార్చి—"రంగప్పా—ఏమిటోయ్ ఆ కుడివైపు—ఆడాళ్ళకి మల్లే అంతఎత్తుగా వుంది?" అన్నాడు.

"ఛా! ఛా! జేబుసార్-ఇదిగో జేబండి! ఆడవాళ్ళంటారేమిటి?" అన్నాడు రంగప్ప.

"జేబయితే అంత కిక్కిరిసి వుంకేం—అన్నాడు నరసింహం. "ఏమీ లేదుసార్-అదీ-యిదీ- అన్నీ జేబులోనే వుంచడంవల్ల యీ జేబు యింతయి యిలావుంది సార్" అన్నాడు, రంగప్ప.

"సార్-సార్- అని చంపకు. నేనేమీ నీ ఆఫీసర్ని కాదు. మనం మనం ఒకటి రంగప్పా—" అన్నాడు నరసింహం.

"ఎంతమాట—మీరు అయిదువందల సంపాయించుకొనే ఆఫీసర్లు— నేనో—ప్రైవేటు మేష్టర్ని. ఎంతమాట శెలవిచ్చారు. ఇదంతా మీ అభిమానం—ఆదరణ" అంటూ నవ్వు నటిస్తున్నాడు రంగప్ప.

"అయితే రంగప్పా—ఒక్కమాట చెబుతావిను. నాకు అయిదువందల రూపాయల జీతం అయితేం—ఖర్చుజాస్తి. నమ్ముతావో లేదోకాని—ఒక్క నయాపైసకూడా మిగలదనుకో. నీజేబులో అన్ని రూపాయల నోట్లు ఇంకా వున్నాయంటే—స్వల్ప జీతగాడవయినా—నాకంటే నువ్వే మేలు. రంగప్పా—ఏమాత్రం వుందోయ్ నీజేబులో—" అన్నాడు నరసింహం.

అలా అంటూనే చేతులు కడుక్కోడానికి పోయాడు నరసింహం.

రంగప్పకి నరసింహం వరస చూసేసరికి_ఇదేదో చేబదులు వ్యవహారంగా మారుతుందేమోనని భయం వేస్తూంది. రంగప్పకి ఎవరికయినా చేబదులీయడం అంటే ప్రాణసంకటం. నరసింహం యిన్నాళ్ళేంటు కాదు. పెద్దమనిషి, అయిదువందల రూపాయల జీతగాడు, ఇబ్బందిపడుతున్నాడు. ఇతడు అప్పు అడిగితే ఏమనాలి? అడ్వాన్సుగా ఆయన ఇప్పించిన ఇడ్లీ సాంబారు-కాఫీ యింకా అరగలేదే. ఏం చేయడమో తెలియక తికమకపడుతున్నాడు రంగప్ప.

ఇంతలోనే నరసింహం చక్కావచ్చి-సీరియస్‌గా చెప్పతున్నాడు రంగప్పకి. "నీ జేబులో ఎంతుంటే అంత ఈయక తప్పదు, నీకు ఒకటో తేదీనాడు యిచ్చేస్తా. ఏమీ అనుకోకు. ఈ మాత్రానికే తెలబోతావేమిటి రంగప్పా—"అన్నాడు నరసింహం.

రంగప్పకి అయోమయంగా వుంది.

"ఇలా చూడు రంగప్పా. నీ జేబులో

ఎంత వుందంటావ్ చూడనీ. నాకు చాలినంత అయితేనే తీసుకుంటా. తక్కిన పైకం నాకు వద్దులే" అంటూ నరసింహం అడుగుతూంటే అప్రయత్నంగా రంగప్ప జేబులోంచి రూపాయల నోట్లు తీసి బల్ల మీద పెట్టడమే తరవాయి-నరసింహం చరచరా లెక్కించి-"శభాష్ రంగప్పా-యాభై రూపాయలున్నాయి-చాలు-యివాళకి యివి చాలు-రాపోదాం ఏది బిలు" అంటూ నరసింహం బిలు ఇవ్వడానికి పోయాడు. ఇంతలోనే దేవుడులాగ రంగప్ప ప్రాణస్నేహితుడింకో ఆయన వచ్చి ఏదో తారక మంత్రం రంగప్ప చెవిలో వూదేశాడు. రంగప్పకి. ఆ అల్లాగా అనే సందేహం జనించింది.

"నరసింహంగారూ-మాట-" అన్నాడు రంగప్ప.

"ఏం—ఇక్కడెందుకు బయటకుపోయి మాట్లాడుకుందాం" అంటాడు నరసింహం.

"కాదు—ఇక్కడే మాట్లాడుకుందాం" అన్నాడు రంగప్ప.

"ఏమిటో మాట—చెప్పు—తొందరగా పోవాలి" అంటాడు నరసింహం.

"నాయందు దయవుంచి—నా డబ్బు నాకియ్యండి—నాకు చాలా అవసరం—మీరింకోలాగ అనుకోవద్దు" అన్నాడు రంగప్ప దిక్కుమొహంతో.

"నామాట విని ఒకటో తారీఖున రా మాయింటికి—తప్పక నీ యాభై కాకుండా-రూపాయికి అణా వడ్డీతో లెక్కించి నీ పైకం నీకిస్తా" అన్నాడు నరసింహం.

"వడ్డీ వద్దు—ఏమీ వద్దు—మీకు పుణ్యం వుంటుంది—నా పైకం నాకియ్యండి-నాకు చాలా అవసరం వుంది" అన్నాడు రంగప్ప.

"ఎందుకయ్యా? రంగప్పా! యింత కంగారు పడతావ్—యివ్వనని బెదురుతున్నావా? ఏమిటి నీ అనుమానం" అన్నాడు నరసింహం.

ఎంత ప్రతిమాలినా నరసింహం డబ్బు యిచ్చేటట్టు లేడు. నరసింహం చేతిలో పడిన డబ్బు — సింహం నోటిలోని మేకలాంటిదే-మళ్లీ రాదని-ఆ స్నేహితుడు చెప్పేశాడు.

ఇంకేలాగ - అప్పుడే - అక్కడే డబ్బు లాగడం. రంగప్పకి మరేమీ ఆలోచన తట్టలేదు. వాళ్లిదరూ ఇలా అనుకున్నారు.

"నరసింహంగారూ నా పైకం యిస్తారా-ఇవ్వరా చెప్పండి."

"రంగప్పా - ఒకటో తారీఖున యిస్తానుగా!"

"వద్దు - ఇప్పుడే కావాలి - మీకు నేను అప్పు యిచ్చుకోలేను స్వామీ - నా పైకం నాకివ్వండి."

"మరోలా అనుకోకు రంగప్పా - నేనస్తా. ఒకటో తారీఖున కనిపించు" అంటూ నరసింహం హోటలు గడప దాటుతూంటే రంగప్ప వెన్నంటి బేరుమని ఏడిచాడు.

నలభై నాలుగేళ్ల వాడు చంటిపిల్లాడి లాగ ఎందుకిలా ఏడుస్తున్నాడని అంతా గుమిగూడారు. ఏవిటన్నారు — అందరూ, అంతా తెలిశాక - అందరూ నరసింహాన్ని అన్నారు— "ఎందుకయ్యా ఆయన్ని ఏడిపించడం - పారేయ కూడదా ఆయన డబ్బు - బలవంతంగా పీడించి నువ్వు యిలా దుఃఖపెట్టడం నీతి కాదన్నారు. ఇంత విషమిస్తుందని నరసింహం ఎన్నడూ అనుకోలేదు. వచ్చినట్టు - యాభై రూపాయలూ నరసింహం రంగప్పకి ఇచ్చాడు. "వెళ్లవయ్యా - ఇంటికి - నీ దగ్గర డబ్బున్నట్టు ఎవరికీ చెప్పకోకు" అని అంతా మందలిస్తే కన్నీరు తుడుచుకొని సైకిలుమీద రంగప్ప చరచరా పోయాడు.

వృధాగా కాఫీఖర్చు - పైపెచ్చు యీ రభస - ఏం ప్రారబ్ధమో అనుకుంటూ నరసింహం వారఫలాలు చూసుకోవాలనుకుంటూ పోయాడు.

'ముఖారి రాగం - మోసంనుంచి తప్పించిందే!' అన్నారు అక్కడ తీర్పులుతీర్చిన మధ్యవర్తులు.

ఇంటికివచ్చి - యినంతా ఆలోచించి - యీ ఏడుపే కనక రాకపోతే యీ యాభై రూపాయలు ఏమయేవో అనుకున్నాడు రంగప్ప

ఎలా పాకిందో తెలియదుకాని సాయంత్రానికే పానగలు పార్కులో రంగప్పగారి ముఖారి రాగమహిమ అందరి నోళ్లలోనూ తాండవమాడుతూంది. ★

# తెలియనిది

అతని పేరు నా కిప్పటికీకూడా తెలీదు.

అతడంత రూపవంతుడూ కాదు, అలా అని కురూపీ కాడు. నల్లగా వుండడూ, తెల్లగాను వుండడూ. పొడూగా కడ్డీలా వుంటాడు. మనిషిని చూస్తే యేమీ విశేషం కనిపించదు. అతన్ని ఇట్టే మరిచిపోవచ్చు, వెలిపోయిన రైలుస్టేషన్‌లా.

కాని నేను మరిచిపోలేకుండా వున్నా. ఇప్పటికీ కూడా సంజపడ్డాకా సముద్రపొడ్డుకు వెడుతూంటే సందు మొదల్లో పోలయ్య కిల్లీ దుకాణందగ్గరకు రాగానే గుండె ఝల్లుమంటుంది, అతడెదురు పడతాడేమో అని.

మే మిద్దరం మొట్టమొదట ఓనాడు సాయంత్రం సముద్రపొడ్డున కలిశాం.

'చూశారూ, మాయిల్లు గలాయన యేం చేస్తున్నాడో.....' అన్నాడు సిగరెట్టు పొగ రైలింజన్‌లా గుప్పున వొదులూ. ఏం చేశాడని నే నడగలేదు. కాని అతడే తిరిగి అన్నాడు:

ముసలాడికి చచ్చేకాలం వొచ్చింది. ఇప్పుడు దురాశ పట్టుకుంది. మనవూళ్లో యూనీఫారంతో తిరుగుతూ చాలామంది వున్నారుకదూ అచ్చువిడిచిన ఆంబోతుల్లా ...ఇహ వీధివక్కలకి కూడా లోపంలేదు'

## అంగర వెంకటకృష్ణారావు

అంచేత తనయిల్లు వొక 'నైట్ క్లబ్' క్రింద మార్చి డబ్బు మూటకట్టుకుందామని ఆశ. ముసిలి నక్క! ఇలు ఖాళీ చెయ్యాలి....'

పాపం అతడామాట యీసడింపుగానే అన్నాడు గాని దాని అర్థంమాత్రం వేరు. నే నేమీ జవాబిచ్చే పరిస్థితిలో లేను ఎంచేతంటే అతడు నిజంగా చిక్కులో వున్నాడు.

'క్రిందటినెల అద్దె పుచ్చుకోలేదు.... ఏం చెయ్యాలో తెలీదు. ఎక్కడికి వెడతాను....'

ఆ ప్రశ్నకికూడా అర్థం అదికాదు. నే నన్నాను:

'అద్దె మనియార్డరు చెయ్యండి...'

'శబాస్. మంచి సలహాయిచ్చారు...' చిటిక వేసి అరిచాడు. గుప్పున సిగరెట్ పొగ వచ్చింది.

అతడు ఆంగ్లోయిండియన్. అతనిలాగే చాలామంది ఆదయ్యాలకొంపల్లో, పొగచూరిన గదుల్లో బుజువులధాటికి తట్టుకొంటూ గడుపుకొస్తున్నారు.

అతడూ నేనూ సుమారు ప్రతీరో కలిసేవాళ్ళం. కాని మాట్లాడుకోడం అరుదు. అతడు నవ్వేవాడు. నేనూ నవ్వేవాడిని. అంతే. మాస్నేహం నదికి యివతలిగట్టు అవతలిగట్టు. మమ్మల్ని కలిపే వంతెన కిల్లీ దుకాణం పోలయ్య.

పోలయ్య చదువుకున్నవాడు, పెద్దమనిషి. కాకి నల్లగావుంటుందని, పాలు తెల్లగా వుంటాయని చెప్పడానికి జంకడు.

నా ఆంగ్లోయిండియన్ మిత్రుడు చవకబారు సిగరెట్లు తెగ కాలుస్తాడు. అస్తమానం తలనొప్పిట; మాత్రలు తెగమింగుతాడు. కాని యెన్నడూ దగ్గలేదు, జబ్బున చీదలేదు.

'ఆయన యుద్ధంలో పని చేశారు బాబూ...' పోలయ్య.

'ఇప్పుడేం చేస్తున్నాడు...'

'ఏం లేదు బాబూ. ఆయనకి రానిపనిలేదు, అబద్ధం ఆడడం మోసం చెయ్యడంతప్ప...'

'మరెలా గడుస్తుందోయ్...?'

'ఏంబాబూ...అక్కడా అక్కడా పని చేస్తారు. ఇప్పుడు మీయింట్లో యే డ్రైనా వ్రడంగి పనుందనుకోండి, రమ్మంటే ఒచ్చి చేస్తారు. మీరేమిస్తే అదేపుచ్చుకొంటారు. ఆయన చేతిపనికి తిరుగులేదు...'

'ఎక్కడా నౌఖరీకెందుకు కుదురుకోలేదు.'

'ఏం చెప్పడం...ఆయన తల్లి ముసిల్ది. ఎప్పుడూ చచ్చిపోతున్నట్టేవుంటుంది. కాని యెప్పుడూచావదు. ఒక చెల్లెలుంది. పిచ్చిది. ఆవిడ యెప్పుడు యెవ్వరితోనూ మాట్లాడదు. కాని మాటాడితే అదే వాగుడు. ఒక్కొక్కప్పుడు యెటో పారిపోతుంది. ఆవిడను వెతు



"ఫొటోగ్రాఫర్ లేకపోతే ఈ ఫంక్షన్‌కు నేను అధ్యక్షత వహించను!"

క్కుంటూ యీాయన చెట్లంటూ గట్లంటూ అదే తిరుగుతాడు. ఇరుగు పొరుగుతో, వీధిలో వాళ్ళతో వల్లమాలిన జట్టీలు తెస్తుంది. ఆవిడ 'బ్లడీ బ్లడీ బ్లడీ' అని తిట్లు తిగులుతుంటే యెవ్వరూ ఆపలేరు. ఇతడు విసిగిపోతే చాకిరేవు పెట్టేసాడు. తరవాత యేడుస్తాడు...'

నేననుకొన్నా-అతడు చాలా బాధపడుతున్నాడని. కాని ఆ బాధ యెప్పుడూ అగుపించేది కాదు. ఓనాడు రాత్రి పోలయ్య దుకాణానికి లేటుగా వెళ్ళా. పదౌతూంది. బహుళపక్షు దినాలు. చంద్రుడు కూడా లేటుగా వచ్చాడు.

'ఆయన వుద్యోగం అయింది బాబూ' పోలయ్య.

'ఎక్కడకి?'

'అదేదో వర్కుషాపులో. 500 యిస్తారట. రేపటినించీ వెళతారట...'

మాటలోనే వచ్చాడు మిత్రుడు. నేను గుడీవెనింగ్ చెప్పి అభినందించా. అతడు నవ్వాడు.

'అయితే మీరు త్వరలో పెళ్ళిచేసుకొంటారన్నమాట...'

'పెళ్ళి! ఇంక అదే తక్కువ'...మూడు ప్యాకెట్లు చవకబారు సిగరెట్లు, మూడు ప్యాకెట్ల తలనొప్పిమాత్రలు తీసుకొన్నాడు. తళతళా మెరుస్తున్న సముద్రంవెంపు పడిపోయాడు.

మర్నాడురాత్రి తిరిగిపోలయ్యదగర తెలుసుకున్నా ఆయన వుద్యోగానికి రాజీనామా యిచ్చేడని. ఉద్యోగంలో ప్రవేశించిన కొద్ది గంటలకే తల్లికి తీవ్రపరిస్థితి వచ్చింది. అతడు పెద్ద ఇంజనీరుతో చెప్పకుండా యింటికి వెళ్ళిపోయాడు. సాయంత్రం నాలుగింటికి తిరిగి వెళ్ళగానే పెద్దఇంజనీరేదో అన్నాడు. ఉద్యోగానికి రాజీనామాయిచ్చి యింటికి వచ్చేడు. తల్లిమాత్రం కోలుకుంది.

తిరిగి తన ఆకాశజీవితం ఆరంభించేడు. ఒకమూల యిల్లు ఖాళీచెయ్యమని యజమాని గొడవ జోరవుతూంది. కాని అతనెప్పుడు విచారంగా వున్నట్టునాకు అవుపించలేదు.

ఆవేళమాత్రం నేనన్నా దానికి వ్యతిరేకంగా వుంది. లైట్‌హవుస్ పక్క పిట్టగోడమీద కాలేసి నిలబడి సిగరెట్ కాలుస్తున్నాడు. పడమట సూర్యుడు కాంతి లేకుండా అప్పడంలా వేళ్ళాడుతున్నాడు.

'ఏమలావున్నారు?' అతడు నిట్టూర్చాడు.

'ఆ...ఏంలేదు...నిన్నరాత్రి జరిగిన గొడవకి మనసింకా కుదురుపడలేదు.

'ఏం జరిగింది?'

'మా పిచ్చిచెల్లెలుందికదూ...అది కిటికీ దగ్గర నిలబడి పాటలుపాడుతూంది. ఇద్దరు యూనిఫారంవాళ్ళు వచ్చి యింట్లో జొరబడ్డారు. బాగా తాగేరేమో...తూలుతున్నారు.

మా 'మమ్మీ' పక్కనుంచి లేవలేదు. నేనింటికొస్తూంటే గుమ్మంముందు జనం గుంపుగా వున్నారు. ఏదో జరిగివుంటుందని గబగబ వెళ్ళిచూస్తే యింకేముంది. ఆ వెధవలిద్దరూ యింకా అక్కడే వున్నారు. ఇద్దర్నీ చావగొట్టి చెవులుమూసిపంపా...ఆ కోపంలో మా చెల్లెల్నికూడా చితకతన్నా...తరవాత నా గుండె పగిలింది. మతి స్థిరంలేనిది...అమాయకురాలు...ఊరికే నా చేతదెబ్బలుతింది. ముసిల్ది చూస్తూనే వుంది... అతడి కళ్లలో నీళ్లు తిరిగేయి.

'మీరు వివాహం చేసుకొంటేగాని మీకీ గొడవలు తీరవు. మీ రొక్కరూ ఈ బరువు మొయ్యలేరు...'

అతడి మొహం జేవురించింది. సిగరెట్టు దమ్ముపీల్చి పొగవదిలి మెడమీద చెమట తుడుచుకొని గొంతు సవరించుకొని తక్కువ స్థాయిలో అన్నాడు.

'మిసర్. నా బాధ నీకు తెలీదు. నేను జీవితంలో నిర్వర్తించవలసిన వొక విధివుంది. అదేమిటంటే, నా ముసిలితల్లిని గోరీలో పూడ్చిపెట్టడం, నా వెర్రి చెల్లిని బాగుచేసి పెళ్ళిచేసుకొనే యేర్పాటు చెయ్యడం...'

అతడాగిపోయి తిరిగి మెడమీద చెమట తుడుచుకొన్నాడు.

నిజమే. ప్రతిమనిషికీ జీవితంలో వొక ధ్యేయం వుంటుంది. అది నెరవేరే దాకా అతడికి విశ్రాంతిలేదు. అలా స్థిరచిత్తంతో కృషిచేస్తే వాళ్ళకి దేవుడు తోడ్పడతాడు అని నేనొక సిద్ధాంతం చెయ్యటంలేదు. అనుకుంటున్నా నాలో నేనే.

ఆ ఆశతోనే వారాలు గడుస్తున్నాయి. ఏడాది తిరిగింది. ఓనాడు రాత్రి పోలయ్య దుకాణందగరే కిల్లీ వేసుకోబోతున్నా అతడు జ్ఞాపకం వచ్చాడు. అతడీమధ్య అగుపించడంలేదేమని అడిగా. అసలతడు పోలయ్యకు గుర్తొచ్చేసరికి కొంత ఆలస్యం అయిందికి గురురాగానే చెప్పేడు.

'పాపం ఆ దొరగారు చనిపోయారండీ'

'ఆ!' నాగుండె ఆగిపోయినట్టయింది.

'ఆర్నెల్లవుతుంది బాబూ.........అతి సుళువుగా అరగంటలో యెగిరిపోయేరు... తలలో నరం యేదో పగిలిపోయిందిట... తపీమని చచ్చిపోయేరు.

'తల్లి, చెల్లెలో?'

'వాళ్ళలాగే వున్నారు నానా బాధలూ పడుతూ...'

అప్పుడు నేననుకున్నా - 'మనిషికి తెలిసింది చాలావుంది. కాని తెలీంది యింకా చాలా వుంది...'






## 43

ఎండవేళ వచ్చిన నీలి, పిల్లలను పెట్టుకొని సెషన్సుకోర్టు యెదురుగానున్న చెట్టు క్రింద కూర్చొని వుంది. ప్రొద్దు తిరిగినా ఇంకా పిలవలేదు.

ఆకలి పీడిస్తోంది. పిల్ల ఏడుస్తోంది. వీళ్ళని యేమిపెట్టి పోషించేది దేముడా అన్న బాధ ఆమెను పీక్కుతింటోంది. ఇలాంటి సమయములో పనిచేయలేదని ఆయింటి యజమానురాలు పంపించివేసింది. పురుడు పోసుకున్నాక రమ్మంది. ఈలోగా యెలాగ జరుగుతుంది? కొడుకైనా చేతికి అందివచ్చాడు కాదని నొచ్చుకుంది. నిన్న రాత్రినుంచీ ఆమెకు బెంగ బెంగగావుంది. రాత్రి ఇన్ని మంచినీళ్ళు త్రాగి నిద్రపోయింది. ఏ పని చెయ్యడానికీ శక్తి లేదు. అగిఅగి కష్టపడి యెలాగో కోర్టుకు వచ్చింది. కళ్లు తిరిగిపోతున్నట్టున్నాయ్.

ఈ సమయాన్నే ముద్దాయిలను కోర్టులో హాజరుపర్చారు. జడ్జీ ఇంకా ప్రశ్నవెయ్యకుండానే పుల్లయ్య యిలా అన్నాడు: "బాబూ! నాను నిజం సెప్పుతాను. పెభువులు కటాక్షించి నాకోరిక తీర్చండి. అదేమీ మాపెద్దది కాదు. అడిగో నా నాయన మల్లు బయట సెట్టుక్రింద వున్నాడు. ఆడిని ఒక్కపారి యీ చేతులతో యెత్తుకొని ముద్దులాడనివ్వండి బాబూ! మీకు దేముడు బాగా సూస్తాడు!"

జడ్జి అందుకు అంగీకరించి తను చెప్పదలచుకున్నది చెప్పమన్నాడు. పుల్లయ్య ఇంకో సమయంలో అయితే తను పడ్డ బాధ, తనకు జరిగిన అన్యాయాలు, దగాలు అన్నీ చెప్పుకొనేవాడే! కానీ తన కొడుకును ఎత్తుకొని ముద్దులాడతాననే ఆతృత నిజాన్ని నాలుగు ముక్కల్లో చెప్పనిచ్చింది.

"గొట్టం పట్టుకొని సివరనానే ఆ బాబు మేడెక్కాను. ఆ బాబు సేతిలో తుపాకి వున్నాది ఆలయేపు పేల్చేస్తున్నాడు. ఆలిద్దరూ సచ్చిపోతారు. ఆ గాబరాలో నాకేంతో సినాది కాదు. అక్కడేవున్న బల్ల ఎవకనించి ఆ బుర్రమీద యెత్తేసినాను. ఇంతలో యీదంతా గోల—దొరికిపోనామని, బిరుకుతో దొంగతనం సెయ్యకండా యెల్లిపోనాను."

"నీతో వున్నవాళ్లిద్దరూ వీళ్ళేనా?" అని జడ్జి ప్రశ్నించాడు

పుల్లయ్య జవాబు చెప్పలేదు.

జడ్జి మళ్ళీ రెట్టించి ప్రశ్నించాడు.

"బాబూ! సెమించండి అది నాకు అడగకండి!"

"నిజం చెప్తేకదా నీ కోరిక తీర్చటం అవుతుంది!"

పుల్లయ్య తల దించేశాడు. మనస్సు చిన్నబోయింది. ఇంతలో అన్న నోరు వినిపించింది.

"మరెందుకు బాబూ? నిజం యేనాటికైనా తెలిసిపోదా? యీ ముగురమే బాబూ చేసాం!"

పుల్లయ్యకు అన్నమీద యెడతెగని అభిమానం కలిగి తలెత్తిచూశాడు. ఆ అమాయకమయిన మనిషి యిదివరకు పడ్డ కష్టనష్టాలు, చేర్పిన నీరులు అన్నీ ఒక్కపారి జ్ఞప్తికి వచ్చాయి

పోలీసు ఇన్‌స్పెక్టరు మల్లుకు కోర్టులోకి తీసుకు వెళ్ళగానే, అయ్యను చూసి కెవ్వన కేక వేసి ముందుకు వురికాడు. చేతులుచాచిన అయ్యమీదకు యెగిరి గట్టిగా కౌగలించుకుని "అయ్యా!..." అంటూ ఒకటే సంతోషం. ఆ సంతోషంలో యేడుపు...వుత్సాహం.

అయ్య కొడుకును మనసారా ముద్దులాడుతున్నాడు. వలవల యేడ్చేస్తున్నాడు. "నాయనా...నా తండ్రీ...పేరు నిలిపినావు..." యేడుపుతో మాట సరిగా రావటం లేదు. ఎన్నో బుద్ధులు చెప్తామనుకున్నాడు. ఎన్నెన్నో...ఎంతగానో చెప్పకుందా మనుకున్నాడు. కానీ యేడుపుతప్ప ఒక్కమాటా సరిగా రాలేదు. ఆ దృశ్యం చూసినవాళ్ల మనసులుకూడా ద్రవించిపోయినయ్.

ఇక మల్లుని విడిచిపెట్టాలి. వీల్లేదు...విడిపిస్తుంటే మల్లు గట్టిగా యేడుస్తున్నాడు... ఆ కేకలు విని నీలి ఆతృతగా అటువేపు రాగానే యేడుస్తున్న మొగుడు ముఖం అగపడింది. ఆ ముఖం అలా చూడగానే ఆమెలో యేదో సంతోషం పొంగిపోయింది.

# ★ దగాపడిన తమ్ముడు ★

ఆ ముఖం నిజంగా...తొలి రోజుల అమాయకముఖం...పోయిన కళకాంతులు తిరిగి వచ్చినాయ్...ఆ ముఖం వేపు చూస్తుంటే ఆమె ఆకలిఅంతా మరచిపోయింది...అప్రయత్నంగా ఆమెకళ్ల వెంట నీళ్ళు కారాయ్. ఆ గడచిపోయిన రోజులు ఒక్కసారి పెనవేసుకొని జ్ఞప్తికి వచ్చాయ్...ఆ తొలినాటి రాత్రిపంతం. ఈ పెళ్లిబాసలపిల్ల ఆనాడు ఆ గిరజాల్లో చేతులు పెట్టి...ఒక్కొక్క మాటా రాలిసే ఆ ముఖంయెంత అమాయకంగా వుంది! ఆ నాడు కొడుకు పుట్టిన్నాడు ఆ ముఖంలో తేజస్సు మళ్ళీ యెంత కాలానికి అలాంటి మెరుగుల్ని చూసింది....

మల్లును బైటకు తెచ్చిన యినస్పెక్టరు నీలికి అప్పజెప్తూ "నిజం చెప్పేవాడు. ఇంకనివ్వయిలా తిరగక్కరలేదులే" అన్నాడు.

ఆ చూలాలు దీనంగా "బాబూ..." ఏదో అడగబోయి మరచిపోయినట్లుగా వూరుకుంటే గ్రహించుకున్నట్లుగా ఇనస్పెక్టరు అన్నాడు. "వీడు నాలుగేళ్లయినా శిక్ష తప్పదు!" ఓ క్షణం అలా నిల్చుండిపోయింది.

ఆమె అక్కడనుంచి మెల్లగా కదలబోయింది. మల్లు గోల ఇంకా తగ్గలేదు. మెల్లగా కోర్టుదాటి రోడ్డుమీదపడి "అమ్మా! అయ్యని తీసుకపోతున్నారే..." అని అరుస్తున్నాడు రోడ్డుమీద నడుస్తున్న వాళ్ళు వింతగా ఈ పిల్లవానివేపు చూస్తున్నారు.

నాలుగడుగులు వేసాక, ఆమెకి నీరసమయ్యింది. సంతోషంతో నిండిన కడుపు మళ్ళీ యిప్పుడు ఖాళీ అయిపోయింది. ఆకలి-బ్రహ్మాండంగా వుంది. కాళ్లు తేలిపోతున్నయ్. కళ్ళుమండుకుపోతూ నీటితో నిండిపోతున్నట్లున్నయ్. మళ్లీ ప్రయత్నించి ముందుకు అడుగులు వెయ్యబోయింది. మనిషి తూలిపోతోంది...తన యిల్లు యింకెంతో దూరం...తన యిల్లా అది...! వెళ్లగానే అద్దె యివ్వలేదని ఆమె యెన్ని మాటలు అడుతుందో! - బయటకు గెంటివెయ్యదూ? తాళం వేసుకొని వుంటుంది-మరి రానివ్వదేమో!

సాయంత్రం! రోడ్డుమీద ప్రజకదులుతున్నారు. బండ్లు, బస్సులూ, రిక్షాలు వెళ్ళిపోతున్నాయ్. కానీ ఆమె ముందుకు కదలలేక పోయింది! తనకే కాదు ఆకలి—పిల్లలకి...కడుపులోనున్న కండకూడాను కొండంత ఆకలే!

ఎలాగో కష్టపడి మరికొంత దూరం నడిచింది. అదిగో శివాలయం అగుపిస్తోంది.

శివాలయంముందు బారులుతీరి ముష్టివాళ్లు కూర్చున్నారు. దుకాణాలు అగుపిస్తున్నాయ్. అరటిపళ్ల గెలలు—నాలుగుపళ్ళు తింటే కడుపు శాంతించును....ఎలాగో స్తాది...! శివాలయానికి యెందరో భక్తులు పట్టుచీరలు కట్టుకొని, కార్లమీదకూడా వస్తున్నవాళ్ళున్నారు. చాల రద్దీగా వున్నది. రోడ్డుమీద నడుస్తూ తల తిరిగినట్లున్నందువల్ల కూర్చుండిపోయింది. ప్రక్కనేవున్న ముష్టివాడు ఇంకొకరె చేరిందని యేవగించుకున్నాడు. యెదురుగావున్న ఇంకో ముష్టిది కొఱకొరా చూసింది.

లేవలేని నీరి నిరాశతో పిల్లలవేపు చూసింది. మల్లుకు ఇంకా దుఃఖం పోలేదు. కడుపులో పిల్ల "అమ్మా ఆకలే..." అని గగ్గోలు పెడుతున్నట్లుగా తిరిగిపోతోంది.

ఈ అపకూతురు కన్నవారింటో కడుపుకు కష్టాలుపడింది. కానీ, చెయ్యి కట్టకోలేదు. యౌవనంతో వంగుతూ నాటుతూ వయ్యారంగా తిరుగుతూ, పాడుతూ మురిసిపోయింది. పెళ్లిఘడియలో యేమీ తెలియని అమాయకురాలిమల్లే సిగ్గుతో ముడుచుకుపోయింది. పెళ్లైపంతంపట్టిన మొగుడు కళ్ళు విప్పింది. ఇల్లాలై యింటిని నిలిపింది. ఒకనాడూ ఆమె ఒకరికి చెయ్యిచాపలేదు. లేనినాడుకూడా ఒకరికి యిచ్చింది. ఈ మె చెయ్యి ఒకనాడు యిచ్చినవేపే తిరిగిందిగానీ పుచ్చుకున్న వేపు తిరగలేదు. అలాంటి పవిత్రమైన చెయ్యి...ఈ నాడు... ఈ నిముషంలో...అడుగుతున్న వేపు తిరుగుతుంటే...ఆమె చెయ్యి గజగజ వణక నారంభించింది. ఎంత ప్రయత్నిస్తున్నా ఆ చెయ్యి మళ్ళీ క్రిందికి వెళ్ళిపోతోంది...చివరకు అతి ప్రయత్నంతో ఆ చేతిని పైకెత్తి అడుక్కొనేటట్లు తిప్పగానే...ఆ చేతిమీద... ఆమె రెండు కళ్ళనుంచీ...రెండే రెండు కన్నీటి బొట్లు రాలాయి!!. ★

(అయిపోయింది)

# తోడికోడళ్లు

యన్. శ్రీకృష్ణారావు



"ఊరంతా మార్మోగుతోంది. మీ అన్నయ్యగారి అమ్మాయి పెళ్లి, అబ్బాయి ఒడుగూను" అంది శ్యామల ఎత్తి పొడుస్తున్నట్లు.

ఏదో పుస్తకం చదవటంలో లీనమైన భర్త రాఘవరావు తలకదపకుండానే, "అవును" అన్నాడు.

'అవునుమరి. ఊళ్ళో చాలా పెద్దమనిషాయె!'

'ఉమ్!'

'ఆఫీసర్లు, వ్యాపారస్థులు, భాగ్యవంతులు—ఒకళ్లేమిటి? డబ్బున్నవాళ్లందరూ వస్తారు. వాళ్లేకదా వాళ్లకి కావలసిన వాళ్లు?'

"సర్లే. నువ్వుకొంచెం నోరుమూసుకో."

'ఏం? మీ అన్నగారిని ఏమైనాఅంటే మీకు కోపం ముంచుకొస్తోంది కాబోలు!'

'అనవసరంగా నన్నెందుకు దెప్పిపొడుస్తావు?'

'ఏం? అన్నగారిమీద అంత ప్రేమగా వుంటే వెళ్లండి. నేనేం వద్దన్నానా?'

'నువ్వూ, వదినా వున్న లక్షణానికే మేము యిల్లావున్నాం!'

శ్యామలకు చటుక్కున ఏడుపొచ్చేసింది.

"ఏమైనప్పటికి అన్నా తమ్ములు ఇద్దరూ ఒక్కటే. మధ్య పరాయిదాన్ని నేనే కదూ? వెళ్లి వాళ్ళనే అంటిపెట్టుకొని వుండండి. నాకేం పట్టింపులేదు. కాని నేను మాత్రం వాళ్లతో వుండను. నా పిల్లాణ్ని ఆవిడగారు అన్నమాటలు నేను మర్చిపోతానా? మీరు మర్చిపోయారేమో మరి?"

రాఘవరావు తనచేతిలోవున్న పుస్తకాన్ని 'సీరియస్'గా బల్లమీదకు గిరవాటు వేశాడు.

'మొదలెట్టావా మళ్లీ? వదిన అన్నమాటలకు నాకుమాత్రం బాధగాలేదా? ఆ తర్వాత నేకదా ఆ ధనగర్వితులతో బంధుత్వాన్ని తెంపేసుకొన్నాను? అన్నీ తెలిసికూడా యింకా దెప్పుతావెందుకు?' అన్నాడు.

శ్యామల ఆలోచనలో మునిగింది...

"తను ఒక పెద్ద కంపెనీకి సొంతదారుడై పోయాడు. తనకళ్లకి నేను తమ్ముడిలా కనిపించటంలేదు. ఒక సాధారణ గుమాస్తాగా నే కనిపిస్తున్నాను. నన్ను అంత హీనంగా చూసే తను నాకు అన్నయ్య అయితే నాకెందుకు! మరొకరైతే నాకెందుకు? తనకూ నాకూ వున్న బంధుత్వం ఏనాడో తెగిపోయింది. లేకపోతే ఈ సమయంలో నేను వెళకుండా వుంటానా?"

"మీ అన్నగారికి కావలసినవాళ్లు..."

"డబ్బున్నవాళ్ళు! నాకు తెలుసు. లక్షాధికారులతోనూ, కోటీశ్వరులతోనూ తనకి బంధుత్వం వున్నప్పుడు ఈతమ్ముడు తన కెందుకు?"

'ఆ మహాతల్లి – మీ వదిన – చిన్నపిల్లాడనేనా ఆలోచించకుండా నోటికొచ్చినట్లల్లా మాట్లాడేసిందే!"

మూడేళ్ళకిందట జరిగిన ఆ సంఘటన శ్యామల మర్చిపోలేదు. మొదటి నుంచి శ్యామల మనస్సు ఆమె తోడికోడలు చంచల విషయంలో గురగుర లాడుతూనే వుంది. చంచల రెండు వందలు విలువ ఖరీదు చేసే సిల్కు చీరకట్టుకొని శ్యామల ఎదురుగా తిరుగుతూ కావాలనే ఆర్భాటం చేసినప్పుడు, శ్యామల కట్టుకొన్న యాభయి రూపాయల చీర ఆమెకు అదొక అవమాన చిహ్నంగానే తోచేది! చంచల వజ్రాలతో పొదిగిన నగలు మెడనిండా పెట్టుకొని తిరుగుతూంటే, శ్యామల దుఃఖంతో కృంగిపోయేది. ఒకసారి డెబ్భై రూపాయలచీర కట్టుకొంది శ్యామల. అప్పుడు చంచల శాంతంగా "మా దాసీదానికి ఇటువంటి చీరే కొన్నాను నిన్న" అంది! ఆ మాటలు శ్యామల మనస్సులో ఈటెలా గుచ్చుకు పోయాయి! ఇటువంటి చిన్న చిన్న విషయాల్లో తోడికోడళ్ళలో కలిగే మనస్పర్థలకు బాధపడి అన్నదమ్ములు ఇద్దరూ విడిపోయారు. అప్పటికి వారు విడిపోయి అయిదుసంవత్సరాలు దాటింది.

శ్యామలకొడుకు రామానికి అప్పుడు నాలుగేళ్ళు. ఒక పండగరోజున అన్నగారి బలవంతంమీద రాఘవరావు, భార్యాపుత్రులతో సహితంగా భోజనానికి అన్నగారింటికి వెళ్ళాడు. ఆడవాళ్ళు, మగవాళ్ళు పిల్లలూ అందరూ ఒకేపంక్తిని భోజనానికి కూర్చున్నారు. వంటవాడు పదార్థాలన్నీ వడ్డిస్తూ అందరితోపాటు శ్యామల కొడుకుకి కూడా ఒక లడ్డూ వేశాడు. వెంటనే కోపం తెచ్చుకొన్న చంచల "ఇప్పుడు వీడికెందుకు ఈ లడ్డూ? ఇందాక తిన్నాడుగా? అస్తమానూ తింటే జబ్బుచేస్తుంది" అంటూ చటుక్కున ఆ విస్తట్లోవున్న లడ్డూని తీసేసి ఆమెకూతురి విస్తట్లో వేసేసింది.

ఆ సమయంలో తోడికోడలుమీద శ్యామలకు వచ్చినకోపం వర్ణించ సాధ్యం కాదు. మాటమీద మాటలు పెరిగాయి. చటుక్కున ఆమె కూర్చున్న విస్తరి ముందు నుంచిలేచి, ఆమె కొడుకుని చంకన వేసుకొని, భర్తవైపు తీక్షణంగా చూసి ఇంటిదారి పట్టింది శ్యామల. భార్య వెనకాలే రాఘవరావుకూడా లేచి వెళ్ళిపోయాడు.

"మనం అంతా బీదవాళ్లం అన్నమాట! ఒకలడ్డూకి కూడా గతిలేని వాళ్ళం" అంది శ్యామల ఇంటికి తిరిగి వచ్చేశాక, భర్తను ఎత్తిపొడుస్తున్నట్లు.

"వాళ్లకి మనం కావలసిన వాళ్లంకాము. భాగ్యవంతులే వాళ్లకి బంధువులు, స్నేహితులు" అన్నాడు జవాబుగా రాఘవరావు.

"ఇటువంటి అఘాయిత్యం ఏదో ఒకటి ఆవిడగారు చేస్తుందని నాకుముందే తెలుసు. అంగుకనే నేను అక్కడికి రానన్నాను. బలవంతాన తీసికెళ్లారు–ఇంగుకే!"

వారందరూ ఒకేఇంటో కలసివున్న రోజుల్లో నిత్యమూ చంచల ఎత్తిపొడుపుల్లో శ్యామల దుఃఖంతో కృంగిపోయేది. తత్ఫలితంగా వారు విడిపోయారు. ఆ చిన్న చిన్న విషయాలకన్నా ఆపండగనాడు చంచల అన్నమాటలు శ్యామలను విపరీతమైన వేదనకు గురిచేశాయి. అదంతా ఆమె మర్చిపోలేదు.

తోడికోడళ్లు మాటి మాటికీ ఏదోఒక విషయంలో తగవులాడు కొంటూనే వుంటారు. ఇది అందరి ఇళ్లలోనూ వుండేదే. అటువంటివన్నీ మనసులో పెట్టుకోకు. వీలైనప్పుడల్లా వస్తూపోతూ వుండు' అని అన్నగారైన సోమయాజులు ఎన్నిసార్లు చెప్పినా, రాఘవరావు మళ్ళీ వాళ్లింటికి వెళ్లలేదు.

"ఇంకా అన్నతమ్ములేమిటి? ఆబంధం ఆనాడే తెగిపోయింది. నే నెవరో? తనెవరో!" అని గొణుక్కున్నాడు రాఘవరావు.

వంటింటోకి వెళ్ళి భర్తకు భోజనం వడ్డిస్తున్న శ్యామల భర్తను ఎత్తిపొడిచింది. మళ్ళీ "అంత బాధగావుంటే ఇప్పుడు మించిపోయిందేమీ లేదు. వెళ్లరండి మీ విస్తట్లో కూడా నాలడ్డూలు పెటకుండా వుంటారు?"

"గోరుచుట్టుమీద రోకటిపోటులా దెప్పిపొడవటంలో ఈ ఆడవాళ్ళకి ఎందుకో ఇంత సంబరం?" అనుకొంటూనే వంటింట్లోకి వచ్చిన రాఘవరావు "ఏం వండావు?" అన్నాడు కోపంగా.

"మనింట్లో ఏం వండుకొంటాం? చింతపండు పచ్చడి; చారునీళ్ళూ; కావాలంటే మీ అన్నగారి యింట్లోనుంచి......"

"నోర్ముయ్!"

మౌనంగా భోజనం సాగించాడు రాఘవరావు.

"నిన్నటి విందు చాలా గొప్పగా జరిగిందిట."

రాఘవరావు మాట్లాడలేదు.

"విన్నారా?"

"అంతా విన్నాను"

"మీకు మాత్రం ఏమీ లేదు!"

రాఘవరావు మాట్లాడలేదు.

"నాలుగు కూరలుట! నాలుగు పచ్చళ్లుట! నాలుగు పిండివంటలట! అది...యిది...ఓ...ఎవళ్ళూ కూడా అన్నీ తినలేక, ఎవళ్ళిష్టం వచ్చినట్టు వాళ్ళు పారేశారుట. మిగిలిపోయినవన్నీ గోతిలో పారబోశారుట చేతకానితనం! ఛ!" అంది శ్యామల వేపకాయ తిని ఉమ్మివేస్తున్నట్లు.

"మజ్జిగ," అన్నాడు రాఘవరావు.

"పెళ్ళిలోనే కొడుకు ఒడుగు కూడా— తొమ్మిదో ఏటే చెయ్యటం ఆచారమట. ఇదేం గురుకులం అనుకొంటున్నారు కాబోలు"

"ఏడో ఏట ఒడుగు చెయ్యటం ఆచారం. శాస్త్రసమ్మతం"

"అయితే మన రామానికి కూడా ఒడుగు చెయ్యాల్సిన వయస్సే నన్నమాట. మనం వాళ్ళమాదిరిగా కాకుండా ఈ సంవత్సరంలోనే ఒడుగు చేసే బాగుంటుందిగా?"

"అన్నీ బాగుండివుంటే, వాడితోపాటే వీడికి కూడా ఈ ముహూర్తానికే ఒడుగు చేసేవాళ్ళం."

శ్యామలకు కోపం ముంచుకొచ్చేసింది.

'ఏం వాళ్ళ దయాదాక్షిణ్యాలలో మనం బతకాలా? ఆ మహాతల్లి రేపట్నుంచి 'బీదవాళ్ళు మా యింటికివచ్చి డబ్బు ఖర్చు లేకుండా పిల్లాడికి ఒడుగుచేసేసుకొన్నారు' అని నన్ను దెప్పిపొడవటానికా? నా పిల్లాడు దిక్కూ మొక్కూ లేని అనాథ యేం కాదు.'

'నేను మజ్జిగ అడిగాను'

'వాళ్ళు డబ్బున్నవాళ్ళు అయితే ఊరంతా వాళ్ల చెప్పుచేతల్లో నే వుండాలనా?'

'మజ్జిగ పొయ్యమని చెప్పి అరగంట అయింది.'

'అరెరె...కోప్పడకండి' అంటూ మజ్జిగ పోసింది శ్యామల.

మర్నాడు తెల్లవారకట్టే మూడు గంటలకే లేచింది శ్యామల, 'ఈ పాటికి చంచల లేచివుంటుంది. వంటవాళ్ళు ఒక పక్క కూరలూ అవీ తరుగుతూ, మరొకపక్క కాఫీ ఫలహారాలూ తయారుచేస్తూవుంటారు. పెళ్ళికూతురుకూడా లేచేవుంటుంది. అసలు దాని

సర్కస్ మొదలుపెట్టిన కొంతసేపటికి ఒక లావుపాటి లక్ష్మయ్య చీకట్లో సీటుకోసం తడుముకుంటూవచ్చాడు. ఒకాయన కాలుతొక్కేసి "అయ్యా, క్షమించాలి. మీ కాలు నేను తొక్కినట్లున్నాను," అన్నాడు.

"అవును మీరే తొక్కుంటారు. ఇంకా ఏనుగుల్ని రంగంలోకి తీసుకురాలేదుగా" అన్నాడు రెండో ఆయన.



# తోడికోడళ్లు



(౧)

నిద్రపడుతుందా...దాని తమ్ముడు యింకా నిద్రపోతూనే వుంటాడు. ఒడుకు పెళ్ళికొడుకుని అప్పుడే లేపటమెందుకని చంచలకూడా మాట్లాడకుండా. అటూ ఇటూ తిరుగుతూ హడావుడి చేస్తూవుంటుంది...'

ఆరుగంటలయేసరికి నిద్రమంచం మీద నుంచి లేచింది శ్యామల. భర్తకు కాఫీ ఇస్తూ పెళ్ళివారింటి ప్రసంగం మళ్ళీ తీసుకొచ్చింది.

"ఇవాళ అక్కడ చాలా హడావుడిగా వుంటుంది."

రాఘవరావు మాటాడలేదు.

"ఎవరెవరు వచ్చారో? ఏమేం తెచ్చారో? కొన్ని విషయాలు అబద్ధమేమో?"

కాఫీ తాగుతున్న రాఘవరావు భార్యను ఆశ్చర్యంగా చూశాడు. "ఏమిటీ ఎత్తు? అక్కడికి వెళ్ళాలనివుందా నీకు?"

"వెళ్లిచూస్తే తమాషాగా వుంటుందిగా. గొప్పవాళ్ల ఆడంబరం ఎల్లావుందో కొంచెం చూడవచ్చు. మనల్ని హీనంచేసేవాళ్ళు ఏవిధంగా గొప్పవాళ్ళో చూడచ్చు."

రాఘవరావుకి కోపం వచ్చింది.

"మనం డబ్బులేనివాళ్లమని నీకు తెలీదూ? అక్కడికివెళ్తే అవమానపడాల్సి వుంటుంది."

"మనకి శుభలేఖ పంపారే?"

"మన వీధిచివర ఓ సన్యాసి వున్నాడు తెలుసా? వాడికి కూడా శుభలేఖ పంపారు. శుభలేఖ పంపారుట! శుభలేఖ! ఈవిడగారికి వెళ్లాలని వుందిట!"

"వాళ్లగర్వమంతా మనకు తెలిసినదే. అయినప్పటికీ......"

"ఓహో! నీకు వెళ్లాలనివుంటే వెళ్లి ఆ పందిట్లో గంతులేసి నాట్యం చెయ్యి!"

"ఊళ్లో వాళ్లంతా ఏమనుకొంటారు?"

"నీ మనసులోది దాచటానికి ఊళ్లో వాళ్లని అడ్డంపెట్టుకొంటా వెందుకు? నేను తన తమ్ముణ్ణి కాదన్నట్లు నన్ను తోసేశాడు. తనకీ నాకూ ఏ సంబంధమూ లేదు. ఊళ్లోవాళ్లకి భయపడి ఆ యింటి నీడ తొక్కటంకూడా నాకు ఇష్టంలేదు."

శ్యామల చాలాసేపు దీర్ఘాలోచనలో పడింది. కాని తనమనస్సును కట్టుబాటుచేసుకొలేకపోయింది. గబగబా తనకున్న చీరల్లో మంచి చీర నొకదాన్ని కట్టుకొని ముస్తుముస్తుగా ముసాబైంది. పెళ్లివారింటికి వెళ్లింది ఒంటరిగానే, భర్త ఇష్టానికి వ్యతిరేకంగా!

"ఎంత పెద్ద పందిరి! మూడు వేల మంది దాకా కూర్చోవచ్చు. ఎక్కడచూసినా ఒకటే హడావుడి! గొప్పగొప్ప వాళ్లంతా ఎవరెవరో వస్తూనేవున్నారు. పెట్టిపుట్టిన వాళ్లు" అనుకొంటూ పెద్ద నిట్టూర్పు విడిచింది శ్యామల.

శ్యామల లోపలికి వెళ్లింది. చంచల ఎదురైంది. తోడికోడళ్లు ఇద్దరూ తమలో రగులుతున్న పగను చిరునవ్వుతో కప్పివేశారు.

"చాలా హడావుడిగా వుందే అక్కా! ఊళ్ళోవాళ్లంతా ఇవాళ ఇక్కడే వున్నట్లున్నారు?"

"అవును మరి. ఎవరిని వదిలిపెట్టగలం చెప్పు? అందరూ కావలసినవాళ్ళేనాయె."

"నిజమే మరి. డబ్బున్నవాళ్లకదా? బీద వాళ్లయితే తోబుట్టువులయినా వదిలి వేయవచ్చు!"

"బీదవాళ్లుమాత్రం తక్కువవాళ్ళేమిటి? గొప్పవాళ్లా డబ్బుంటే, వాళ్లకు నోరుంది."

"పోనీ దాని సెనా మనకెందుకులే అని వదిలేస్తారా గొప్పవాళ్లు? డబ్బున్నవాళ్లు ఆ విషయంలో కూడా డబ్బున్నవాళ్ళే."

"భలే దానివే నువ్వు! దానికేం గాని ఈ నెక్లెస్ ఎల్లావుందో చూడు. మంచి నెక్లెస్ ఒకటి కొనమని మీ బావగారితో చెప్పాను. చాలా బాగా రెండు వేలకి కొన్నారు యిది. బాగుందికదూ?"

దెబ్బ బాగా ఘాటుగాతగిలింది. శ్యామల తలవంచుకొని నిలబడిపోయింది. పందిట్లోనూ, కనిపించే ఐశ్వర్య చిహ్నాలు ఆమె మనస్సును వేదనకు గురిచేశాయి. చంచల తల్లిని చూసి 'మనవరాలికి పెళ్లివారు ఏమేం చేయించారండీ" అంటూ పలకరించింది శ్యామల.

"కాఫీ తాగావా?" అని అడుగుతూనే లోపలికి వెళ్లిపోయింది చంచల.

చంచల తలి కట్నం కానుకలను గురించి పెద్ద లెక్చర్‌లా వర్ణించేసింది. ఇంట్లో జరిగే కోలాహలం, గొప్పవారికి జరుగుతున్న మర్యాదలు చూసి శ్యామల నిట్టూర్చింది.

సోమయాజులు శ్యామలను చూసి పలకరించాడు. "ఏమ్మా! శ్యామలా! నువ్వు ఒక్కర్తివే వచ్చావా? తమ్ముడు రాలేదా?"

"ఆయన రావటానికి సందర్భం కుదరలేదు."

"చిన్నకూడా వాడు రాలేదు. వాడు ఇంత పెంకివాడుగా మారిపోతాడని నేను అనుకోలేదు."

శ్యామల తన రోషాన్ని ఆపుకోలేకపోయింది.

"మనస్సులు వేరయిన తరువాత అల్లాగే వుంటుంది."

"వాడిమనస్సే వేరుపడింది. నాకేం? అందరితోనూ నేను తనకి అన్నయ్యను కాదని చెప్పుకొంటున్నాడు. నేనేం చెయ్యను?"

"ఇప్పుడెందుకు ఈ మాటలన్నీ? ముహూర్తసమయం కావచ్చింది. త్వరపడండి," అని భర్తను హెచ్చరించింది చంచల.

"ఇదుగో వచ్చేస్తున్నాను. ఒక్క నిముషం. శ్యామలా! తాశిల్దారుగారి భార్యా, పిల్లలూ వచ్చారు. వాళ్లని మర్యాద చెయ్యమ్మా!" అంటూ మేడమీదకు వెళ్లాడు సోమయాజులు.

"నేను పందిట్లోకివెళ్లి కూర్చుంటాను అక్కా! మీ ఇంటికివచ్చే ఆఫీసర్లని, భాగ్యవంతులని ఎల్లా గౌరవించాలో నాకేం తెలుసుచెప్పు?" అంటూ శ్యామల పెళ్ళి పందిరివైపు వెళ్ళింది.

కొన్నిక్షణాల్లోనే "అయ్యయ్యో!", "అమ్మో" అంటూ వినిపించిన కేకలు శ్యామల ఆలోచనలకు 'సడన్‌బ్రేక్" వేశాయి. శ్యామల లోపలకి వచ్చింది. అప్పటికే మేడ మెట్లదగ్గర ఒక గుంపు పోగయింది.

చంచల గరించింది, "మేడమెట్లమీద అరటి తొక్కలు పారేసిన వెధవ ఎవడు?"

ఏకధాటిగా మోగుతున్న సన్నాయి, బ్యాండు వాయిద్యాలు అకస్మాత్తుగా ఆగిపోయాయి. మేడమెట్లదగ్గర చేరిన గుంపులు యిద్దరు ముగ్గురు కలసి, సోమయాజుల్ని ఒక మంచంమీదకు చేర్చారు. నిముషాలమీద డాక్టరు పరిగెత్తుకొచ్చాడు. మేడమెట్లమీద కాలుజారి దొర్లికిందపడిన సోమయాజులు, తగిలిన దెబ్బలవల్ల కలిగే బాధను భరించలేక గట్టిగా మూలుగుతూ పడివున్నాడు మంచంమీద.

గబగబా ఏదో మందులువేసి కట్లుకట్టాడు డాక్టరు.

"దెబ్బలు చాలా ఎక్కువగా తగిలాయి. చిన్నపిల్లల విషయంఅయితే వేరు. వయస్సు ముదిరినవారుకదా. రెండు మూడు నెలల దాకా కాలు కింద పెట్టటానికి వీల్లేదు" అన్నాడు డాక్టరు.

డాక్టరు మాటలు విని అక్కడ చేరిన వాళ్ళంతా నిశ్చేష్టులైపోయారు.

"ఈ ఒడుగూ, పెళ్ళి ఎవరు చేస్తారు ఇప్పుడు? ఆగిపోవల్సిందేనా?" అని అంతా గుసగుసలాడుకొన్నారు. ఒక డబ్బుగలాయన ఆ మాట బయటికే అనేశాడు.

"నా పిల్లలమీద ఏ మహాతల్లి కన్ను పడిందో! దాని నోట్లో దుమ్ముపడ!" అంటూ తిట్టుకొంది చంచల, శ్యామలవైపు చూస్తూ.

ఈ సంఘటనవల్ల శ్యామలకు కొంచెం తృప్తి కలిగింది. "వీళ్ళ గర్వానికి తగినట్లే జరిగింది. మళ్లీ ఇంకోసారి పందిరి వేయించి ఇంకో పదివేలు ఖర్చు చేయనీ!" అనుకొంది.

బాధతో మూలుగుతున్న సోమయాజులు "నేను పడిపోతే మాత్రం ఇప్పుడు వచ్చిన నష్టం ఏముంది? నా తమ్ముణ్ణి పిల్చుకొని రండి. వాడూ, శ్యామలా పీటలమీద కూర్చుంటారు. తొందరగా వెళ్లి వాణ్ణి పిల్చుకొని రండి" అన్నాడు.

ఈ మాటలు విన్న తోడికోడళ్లు ఇద్దరూ ఉలిక్కిపడ్డారు! ఇద్దరు ముగ్గురు స్నేహితులు రాఘవరావుకోసం పరిగెత్తారు.

శ్యామల తనలోనే మెల్లిగా నవ్వుకొంది. ఈవిధంగానైనా వారిని కొంచెం గౌరవించినందుకు ఆమెకు కొంచెం తృప్తి కలిగింది

"ఇప్పుడు కావలసివచ్చాడు ఈ బీద తమ్ముడు! ఇప్పుడు కనిపించింది బంధుత్వం! పని జరగటం ప్రధానం కాబట్టి తమ్ముడు బీదవాడయినా ఇప్పుడు పుట్టుకొస్తోంది ప్రేమ! ...ఆయన రాకుండావుంటే బాగుండును... చూడటానికే రానన్న ఆయన ఈ శుభకార్యాలు జరిపించటానికి వస్తారా?...ఒకవేళ ఆయన వెంటనే వచ్చేస్తారేమో?... ఉహూ! ఒప్పుకోరు! నాకూ తనకీ బంధుత్వమే లేదన్న ఆయన వస్తారా? రారు! ఒక్క నాటికీ రారు......"

"టైమెంతయింది చంచలా?" అని భార్యను అడిగాడు సోమయాజులు.

"ఎనిమిది కావస్తోంది."

"అయ్యయ్యో! వాడు ఇంకా రాలేదా? ముహూర్తం మించిపోతుందేమో?"

"పోనిలెండి ఏంచేస్తాం? మీకు ఆరోగ్యం చేకూరాక మళ్ళీ ముహూర్తం పెట్టుకోవచ్చు" అంది చంచల, శ్యామలవైపు కోపంగా చూస్తూ.

"నోర్ముయ్! ఈ ముహూర్తం దాటటానికి వీల్లేదు, తమ్ముడు వుండగా నాకేం బాధ?"

"అవునవును. రాముడూ భరతుడూను అన్నతమ్ములు ఇద్దరూ"

శ్యామలకు కోపం ముంచుకొచ్చింది. "ఒకరు రాముడయితే, మరొకరు భరతుడే అవుతారు."

'చంచలా!' కోపంగా గట్టిగా అరిచాడు సోమయాజులు "మీయిద్దరూ దెబ్బలాడుకోదల్చుకుంటే ఎక్కడికేనాపోయి దెబ్బలాడుకోండి. ఇక్కడ ఆట్టే గొడవ చెయ్యకండి."

తోడికోడళ్ళు ఇద్దరూ బుసకొడ్తున్నట్లు మౌనంగా ఒకళ్ళనొకళ్లని చూస్తున్నారు. వాళ్ళగుండెలు పరిగెత్తే రైలుచక్రాల వేగానికి అదిరే రైలుపట్టాలలా దడదడ అదిరాయి. రాఘవరావు అక్కడికి రాకుండా వుండాలనేదే వారిద్దరి ఆలోచన.

మరొక పావుగంట గడిచింది. సోమయాజులు కళ్ళు తెరచి చూశాడు. చంచల తన ఉక్రోషాన్ని వెళ్ళగక్కింది.

"ఆయనగారెందుకు వస్తాడు? ఎప్పుడైనా మంచీ, మర్యాద అనేది వుంది గనకనా?"

శ్యామలమాత్రం తక్కువదా? "మర్యాదయిచ్చి మర్యాద పుచ్చుకోవాలి ఎవరయితేనేం?" అంది.

"అంతా నువ్వు నేర్పినదే!"

"అవును. నీవు నేర్పిన విద్యయే నీరజాక్ష అని ఊరికే అన్నారా మరి?"

"ఇప్పుడే నోరు ఇల్లా బయటపడుతోందే! ఇంకా బాగా డబ్బుకూడా వుందంటే..."

"డబ్బున్నవాళ్ళు అందరూ గుడ్డివాళ్ళు కారు."

"మీరిద్దరూ మర్యాదగా నోరుమూసుకొని కూర్చుంటారా లేదా?" అని కేకలేశాడు, కోపంగా సోమయాజులు.

తానొకటి తలచ దైవమింకొకటి తలచాడన్నట్లు తోడికోడళ్ల ఆలోచనలకు విరుద్ధంగానే జరిగింది. ప్రేమలో కలవని అన్నతమ్ములు తోడికోడళ్ల పగలో కలిశారు! సోమయాజులు ముఖంలో కనిపించిన కోపం మాయమయి సంతోషం తాండవమాడింది. అతని ఎదురుగా అతని తమ్ముడు రాఘవరావు నవ్వుముఖంతో నిలబడ్డాడు. ఇద్దరూ ఒకరినొకరు చూసుకుని తన్మయత్వం చెందారు. ఆ సంఘటన చూసిన తోడికోడళ్ళు ఇద్దరూ తెల్లబోయారు!

రాఘవరావుని పిలవటానికి వచ్చిన అతని అన్నగారి స్నేహితులైన భాగ్యవంతులు అతనిదగ్గరకు వచ్చినపుడు అతను ఒక నిజాన్ని తెలుసుకొన్నాడు; అర్థం చేసుకొన్నాడు; వెంటనే బయల్దేరి వచ్చేశాడు."

అతని అన్నగారు లక్షాధిపతి. అతను బీదవాడు. కాని అన్నగారు చెయ్యవలసిన పని ఒకటి దురదృష్టవశాత్తూ ఆగిపోయింది. ఆ స్థానంలో నిలబడి ఆ కార్యాన్ని పూర్తి చేయించగల హక్కు మరెవ్వరికీ లేదు! అతనికి ఒక్కడికే ఆ హక్కు వుంది. భగవంతుడు ఇచ్చిన హక్కు! ఐశ్వర్యంగాని, అధికారంగాని, తోడికోడళ్ల పగగాని అడ్డు పెట్టటానికి వీలేని హక్కు! ప్రకృతి సిద్ధమైన హక్కు! వాళ్లిద్దరూ ఒక్కటే. ఒకరిస్థానంలో మరొకరు నిలబడి ఆ కార్యం పూర్తిచేయించగల హక్కు వారికి మాత్రమే వుంది. రక్త సంబంధంవల్ల, పుట్టుకవల్ల వచ్చేహక్కు! అదే బంధుత్వం.

"తనకూ నాకూ సంబంధమేలేదని అనుకోవటం ఎంత మూర్ఖత్వం! ఎంత అవివేకం! మాటలతో తోసివేయగల బంధుత్వమా ఇది: తోడికోడళ్లు ఎన్నివిధాల తగవులాడుకొన్నా తోసివేయగల బంధుత్వమా ఇది?" అని విచారించిన రాఘవరావు వెంటనే అన్నగారింటికి పరిగెత్తుకొచ్చాడు.

"ఎల్లా వుందన్నయ్యా?" అని ప్రియంగా అడిగాడు రాఘవరావు.

"నాకేం ఫరవాలేదురా, బెంగ పెట్టుకోకు. నువ్వూ శ్యామలా పీటలమీద కూర్చుని ఒడుగూ పెళ్లీ లక్షణంగా పూర్తి చేయించండి. ఈ ముహూర్తానికే రామానికి కూడా ఒడుగుచెయ్యండి. తొందరగా స్నానంచేసి బట్టలు మార్చుకో-వెళ్లు" సోమయాజులు చాలా సహజ ధోరణిలోనే మాట్లాడాడు.

అన్నగారి మాటలువిన్న రాఘవరావు తన్మయత్వం చెందాడు. తోడికోడళ్లు ఒకరినొకరు చూసుకొని సిగ్గుపడి పోయారు. సంవత్సరాల తరబడి విడిపోయివుంటున్న అన్నదమ్ములు అకస్మాత్తుగా కలిసిపోయేసరికి వాళ్లలో రగిలిన పగమాయమయి ఆనంద బాష్పాలు రాలాయి!

ఇంక తర్వాత చెప్పేందుకేముంది? ★




[ఆ ది ప ర్వ ము — తృ తీ యా శ్వా స ము]

వ. పురూరవుండును రాజ్యగర్వంబున నమ్మునులకు దర్శనం బీనొల్లక యవహసించిన నలిగి వారలు వాని నున్మత్తుంగా శపియించిన వాఁడు గంధర్వలోకంబున నూర్వశీసహితుండై యుండెనట్టిపురూరవునకు నూర్వశికి నాయువు ధీమంతుండు నమావసువు దృఢాయువు వనాయువు శతాయువు ననునార్వురు గొడుకులు పుట్టి రందాయువునకు స్వర్భానవి యను దానికి నహుష వృద్ధశర్మగయానేనసు లనంగా నలువురు పుట్టిరి వారియందు నహుషుండు రాజ్యాభిషిక్తుం డై.

మ. చతురంభోధిపరీతభూవలయముం సద్వీపసారణ్యాన
క్షితిభృత్కం బగువాని భూరిభుజశక్తిం జేసి పాలించుచుం
గ్రతువుల్ నూ ఱొనరించి కీర్తి వెలయం గా దిక్కులం నిర్జితా
హితుండై యానహుషుండు దాఁ బడసె దేవేంద్రత్వముం బేర్మితోన్.

వ అట్టి నహుషునకుఁ బ్రియంవద యనుదానికి యతి యయాతి సంయాత్యాయాత్యయతి ధ్రువు లనంగా నార్వురు పుట్టి రందు యయాతి రాజై యనేక యాగంబులు సేసి శుక్రపుత్త్రియయినదేవయానియందు యదు తుర్వసు లను నిద్దఱు గొడుకులం బడసె వృషపర్వపుత్త్రి యయినశర్మిష్ఠయందు ద్రుహ్యానుపూరు లనంగా ముగ్వురుగొడుకులం బడసి రాజ్యంబు సేయుచు శుక్రశాపంబున జరాభారపీడితుం డై కొడుకుల నందఱం బిలిచి యిట్లనియె.

సీ. విషయోపభోగాభిలషణ మింకను నాకు, వదలక పెరుఁగుచు న్నదియుఁ గాన
నందనులార మీ యం దొక్కరుండు నా, దగు జరాభారంబు దగిలి తాల్చి
తనజవ్వనంబు నా కొనరంగ నెవ్వఁ డీ, నోపు నాతండ నద్వీపసకల
ధారుణీసామ్రాజ్య భారయోగ్యుం డగు, నని యడిగిన నగ్ర తనయుఁ డయిన

ఆ. యదువుఁ దొట్టిసుతులు ముదిమికి నోపక, తలలు వాంచియున్న వెలయఁ దండ్రి
పనుపుఁ జేసిముదిమి గొనిజవ్వనంబిచ్చెఁ, బూరుఁ డనుసుతుండు భూరియశుఁడు.

వ. అనిన విని జనమేజయుండు వైశంపాయనున కిట్లనియె

## య యా తి మ హా రా జు చ రి త్ర ము

తే. వర్ణధర్మముల్ గాచుచు వసుధ యెల్ల, ననఘచరితుఁ డై యేలిన యయ్యయాతి
భూసురోత్తమ భార్గవ పుత్త్రి యైన, దేవయానిని దా నెట్లు దేవిఁ జేసె.

తే. విపులతేజంబునను దపోవీర్యమునను, జగదనుగ్రహనిగ్రహ శక్తియుక్తుఁ
డయినయట్టియయాతికి నలిగి యేమి, కారణంబున శాపంబు కావ్యుఁ డిచ్చె.

వ. మఱియు నస్మద్వంశకరుం డయిన యయాతిచరితంబు విన వలతుం జెప్పుమని యడిగిన వానికి వైశంపాయనుం డిట్లనియె.

క. మనుజాధిప వృషపర్వుం, డనుదానవపతికి శుక్రుఁ డాచార్యుం డై
యనిమిషవిరోధులకుఁ బ్రియ, మొనరించుచు వివిధవిధి న యోపాయములన్.

క. దేవాసురరణమున గత, జీవితు లగునసురవరులఁ జెచ్చెర మృతసం
జీవని యనువిద్యఁ బున,ర్జీవులఁ గాఁ బ్రతిదినంబు జేయుచునుండెన్.

వ. దాని నెఱింగి దేవతలెల్ల నతిభీతు లై యసురుల నోర్వనోపక శుక్రువలన మృతసంజీవని వడసి తేనోపునట్టి మహాసత్త్వుం డెవ్వండగునో యని విచారించి బృహస్పతి పుత్త్రుం డయిన కచునికడకుం జని యిట్లనిరి.

క. పోరను మృతసంజీవని, కారణమున నిహతు లయ్యుఁ గా రసురవరుల్
వారల నోర్వఁగ మన కతి, భారము దుర్వారవీర్య బలయుతు లగుటన్.

క. మనపక్షంబున వా రత్యద్దనుజులచే నిహతు లయ్యుఁ దగ మృతసంజీ
వని లేమిఁ జేసి యమసా,దనమున కరుగుదురు వీర్య దర్పితు లయ్యున్.

క. కావున మృతసంజీవనిఁ, దే వలయును శుక్రువలన ధృతిఁ బడసి తప
శ్శ్రీవిభవ దానిబలమునఁ, గావంగా వలయు సురని కాయబలంబున్.

క. బాలుండవు నియమవ్రత,శీలుండవు నిన్నుఁ బ్రీతిఁ జేకొని తద్వి
ద్యా లలనాదానముఁ గరుణాలయుఁ డై చేయు న మ్మహాముని నీకున్.

వ. దుహితృస్నేహంబునంజేసి యద్దేవయానిపలుకులు శుక్రుం డతిక్రమింపండు గావున నీనేర్పువిధంబున దానిచిత్తంబు వడసి శుక్రు నారాధించిన నీ కిష్టసిద్ధియగు నని దేవతలు ప్రార్థించి పంచినం గచుండును దేవహితార్థంబు వృషపర్వు పురంబునకుం జని యచ్చట వేదాధ్యయనశీలుం డయి సకలదానవగణోపాధ్యాయుం డయి యున్నశుక్రుం గని నమస్కరించి యిట్లనియె.

క. ఏను గచుం డనువాఁడ మ,హానియమసమన్వితుఁడ బృహస్పతిసుతుఁడన్
మానుగ వచ్చితి నీకును, భానునిభా శిష్యవృత్తిఁ బని సేయంగన్.

వ అనిన నమ్మునికుమారుని సుకుమారత్వంబును వినయప్రియవచన మృదుమధురత్వంబును ననవరతనియమవ్రత ప్రకాశిత ప్రశాంతత్వంబునుం జూచి శుక్రుం డతి స్నేహంబున వీనిం బూజించిన బృహస్పతిం బూజించిన యట్లయని యభ్యాగత పూజల వాని సంతుష్టుంగాఁ జేసి శిష్యుంగాఁ జేసికొని యున్నంత నక్కచుండు.

సీ. పని యేమి పంచిన బదపడి చేసెద, ననక తన్ బంచిన యాక్షణంబ
చేయుచు నిజగురు చిత్తవృత్తికిఁ గడు, ననుకూలుఁ డై విన యంబుతోడ
మనమునఁ జెయ్వుల మాటల భక్తి నే,కాకారుఁ డై మఱి యంతకంటె
దేవయానికి సువి ధేయుఁ డై ప్రియహిత,భాషణములఁ బుష్ప ఫలవిశేష

ఆ. దానములను నంత త ప్రీతిఁ జేయుచు, నివ్విధమునఁ బెక్కు లేండ్లు నిష్ఠ
గురుని గురుతనూజఁ గొలిచి యయ్యిరువుర, నెమ్మివడసెఁ దనదు నేర్పు పేర్మి.

వ. ఇట్లు గురుశుశ్రూషాకౌశలంబునఁ గచుండు శుక్రునకుం బ్రియశిష్యుం డై యున్న నెఱింగి దానవులు సహింప నోపక బృహస్పతితోడియలుక నక్కచు నొక్కనాఁడు హోమధేనువులంగాచుచువనంబున నేకతంబ యున్నవాని వధియించి విశాలసాలస్కంధంబున బంధించచని రంతనాదిత్యుం డస్తగిరిశిఖరగతుండగుడు మగిడి హోమధేనువు లింటికివచ్చిన వానితోడన కచుండు రాకున్నదేవయాని దనమనంబున మలమల మఱుగుచుం బోయి తండ్రి కి ట్లనియె.

ఉ. వాఁడిమయూఖముల్ గలుగు వాఁ డపరాంబుధిఁ గ్రుంకె ధేనువుల్
నేఁ డిట వచ్చె నేకతమ నిష్ఠమెయిన్ భవదగ్నిహోత్రముల్
వోఁడిగ వేల్వఁగాఁ బడియెఁ బ్రొద్దును బోయెఁ గచుండు నేనియున్
రాఁడు వనంబులోన మృగ రాక్షసపన్నగబాధ నొందెనో.

## కచుండు దానవహతుండై మృతసంజీవనిచే బ్రదుకుట

వ. అనిన విని శుక్రుండు దనదివ్యదృష్టి నసురవ్యాపాదితుం డైన కచుం గని వానిం దోడ్కొని తేర మృతసంజీవనిం బంచిన నదియును బ్రసాదం బని యతిత్వరితగతిం జని విగతజీవుం డయినకచునప్పుడ సంజీవితుం జేసి తోడ్కొని వచ్చినం జూచి శుక్రుండును దేవయానియు సంతసిల్లి యున్నంతఁ గొన్నిదినంబులకు వెండియు నొక్కనాఁడు.

క. అడవికిఁ బువ్వులు దేరఁగ, వడి నరిగినకచునిఁ జంపి వానిని దనుజుల్
పొడవు సెడఁ గాల్చి సురతోఁ, దడయక యబ్బూది శుక్రుఁ ద్రావించి రొగిన్.

వ. శుక్రుండును సురాపానమోహితుం డయి యున్నఁ దొల్లింటియట్ల దేవయాని గచుంగానక దుఃఖితయై నేఁడును గచుండు రాక మనలెనసురులచేత నిహితుం డయ్యెం గావలయు నని శోకించిన దానిం జూచి శుక్రుం డిట్లనియె.

క. వగవక సంజీవనిచెం, పగణితగర్వమున నసురు లాకచుతోడం
బగఁ గొని చంపెద రాతఁడు, సుగతికిఁ జను గాక యేల శోకింపంగన్.

వ. అనిన దెవయాని యి ట్లనియె.

మ. మతిలోకోత్తరుఁ డైన యంగిరసుమ న్మం డాశ్రితుం డాబృహ
స్పతికిం బుత్త్రుఁడు మీకు శిష్యుఁడు సురాపబ్రహ్మచర్యాశ్రమ
వ్రతసంపన్నుఁ డకారణంబ దనుజవ్యాపాదితుం డైన న
చ్యుత ధర్మజ్ఞ మహాత్మ యక్కచున కే శోకింప కె ట్లుండుదున్.

వ. వానిం జూచి కాని కుడువ నొల్లనని దేవయాని యేడ్చుచున్నఁ బెద్దయుం బ్రొద్దునకుఁ బ్రసన్నుండై శుక్రుండు దనయోగదృష్టిం జూచి లోకాలోకపర్యంత భువనాంతరంబునఁ గచుం గానక సురాసమ్మిశ్రభస్మమయుండై తన యుదరంబున నున్న యక్కచుం గని సుర సేసినదోషంబును నసురులవలననైన యపకారంబును నెఱింగి,

ఆ. మొదలి పెక్కుజన్మములఁ బుణ్యకర్మముల్, పరఁగఁ బెక్కు సేసి పడయఁబడిన
యట్టిమెఱుక జనుల కాక్షణమాత్రన, చెఱుచు మద్యసేవ సేయనగునె.

క. భూసురు లాదిగఁ గలజను, లీసుర సేవించి రేని యిది మొదలుగఁ బా
పానక్తిఁ బతితు లగుదురు, చేసితి మర్యాద దీనిఁ జేకొనుఁడు జనుల్.

వ. అని శుక్రుండు సురాపానంబు మహాపాతకంబుగా శపియించి తనయుదరంబున నున్న కచు నప్పుడ సంజీవితుం జేసిన నంద యుండి కచుండు శుక్రున కిట్లనియె.

క. తనువును జీవము సత్త్వం,బును బడసితి నీప్రసాదమున నీయుదరం
బనఘా వెలువడుమార్గం, బొనరింపుము నాకు భూసురోత్తమ దయతోన్.

వ. అనిన నాయుదరంబు భేదిల్లినం గాని యిమ్ముని కుమారుండు వెలువడ నేరం డుదర భేదనంబున మూర్ఛితుండ నయిన నన్ను సంజీవితుం జేయవలయునని శుక్రుండు కచునకు సంజీవని నుపదేశించిన.

క. ఉదరభిదాముఖమున న, భ్యుదితుం డై నిర్గమించె బుధసుతుఁడు కచుం
డుదయాద్రిదరీముఖమున, నుదితుం డగుపూర్ణహిమమయూఖుఁడుపోలెన్.

వ. అంత.

తే. విగతజీవుఁ డై పడియున్న వేదమూర్తి, యతనిచేత సంజీవితుఁ డై వెలింగె
దనుజమంత్రి యుచ్చారణదక్షుచేత, నభిహితం బగుశబ్దంబు నట్లపోలె.

వ. ఇట్లతిప్రయత్నంబునఁ గచుండు శుక్రువలన సంజీవని వడసి పెద్దకాలంబుండి యొక్కనాఁడు శుక్రుచేత ననుజ్ఞాతుం డయి దేవలోకంబునకుం బోవుచుండి దేవయాని కతిప్రియపూర్వకంబుగాఁ జెప్పిన నదియును దద్వియోగదుఃఖితయై కచున కిట్లనియె.

ఉ. నీవును బ్రహ్మచారివి వినీతుఁడ నేనును గన్యకన్ మహీ
దేవకులావతంస రవితేజ వివాహము నీకు నాకు ము
న్భావజశక్తి నైనయది పన్నగ నన్నుఁ బరిగ్రహింపు సం
జీవనితోడ శుక్రుదయఁ జేయుము నాకుఁ బ్రియంబు నావుడున్.

క. ఆకచుఁ డత్యంతవిపా, దాకులుఁ డై లోకనింద్య మగునర్థము నీ
వాకునకు దెచ్చు టుచితమె, నాకు సహోదరివి నీవు నా చిత్తమునన్.

క. గురులకు శిష్యులు పుత్త్రులు, పరమార్థమ లోకధర్మపథ మది దీనిం
బరికింపక యీపలుకులు, తరుణీ గురుపుత్త్రి నీకుఁ దగునే పలుకన్.

## దేవయానియుఁ గచుండు నొకరి నొకరు శపియించుకొనుట

వ. అనిన నాకచునకు దేవయాని కరం బలిగి నీవు నామనోరథంబును విఫలంబుగాఁ జేసినవాఁడవు నీకు సంజీవని పని సేయకుండెడు మని శాపం బిచ్చినఁ గచుండేను ధర్మపథంబు దప్పనివాఁడను నీవచనంబున నాకు సంజీవనిపని సేయ దయ్యేనేని నాచేత నుపదేశంబు గొన్నవారికిఁ బనిసేయుంగాక మఱి నీవు ధర్మవిరోధంబు దలంచితివి కావునఁ నిన్ను బ్రాహ్మణుండు వివాహంబు గాకుండెడు మని దేవయానికిఁ బ్రతిశాపం బిచ్చి తత్క్షణంబ,

క. దేవగురునందనుం డమ,రావాసంబునకు నరిగి యమరులకును సం
జీవని యుపదేశించి సు,ధీవిభుఁ డొనరించు చుండె దేవహితంబుల్.

వ. ఇట వృషపర్వుకూఁతురు శర్మిష్ఠ యను కన్యక యొక్కనాఁడు కన్యకాసహస్రపరివృతయయి దేవయానీసహితంబు వనంబునకుం జని యొక్క సరోవరతీరంబునఁ దమతమ పరిధానంబులు పెట్టి జలక్రీడ లాడుచున్న నవి సురకరువలిచేతం బ్రేరితంబు లయి కలసిన నొండొరులం గడవఁ గొలను వెలువడు సంభ్రమంబున నక్కన్యక లన్యోన్యపరిధానంబులు వీడ్వడం గొని కట్టునెడ దేవయానిపుట్టంబు శర్మిష్ఠ గట్టికొనిన మఱి దానిపరిధానంబు దేవయాని పుచ్చుకొనక రోసి శర్మిష్ఠం జూచి యి ట్లనియె.

క. లోకోత్తర చరితుం డగు,నా కావ్యతనూజ నీకు నారాధ్యను నేఁ
బ్రాకటభూసురకన్యక, నీకట్టినమైల గట్ట నేర్తునె యనినన్.

వ. శర్మిష్ఠ యి ట్లనియె.

క. మాయయ్యకుఁ బాయక పని, సేయుచు దీవించి ప్రియము సేయుచునుండున్
మీయయ్య వెండి మహిమలు, నాయొద్దన పలుక నీకు నానయు లేదే.

వ నాకట్టినపుట్టంబు నీకుం గట్టం గాదు గాకేమి యని గర్వంబున నెగ్గులాడి దేవయాని నొక్కనూతం ద్రోచి శర్మిష్ఠ కన్యకాసహస్రపరివృత యయి క్రమ్మఱివచ్చి నిజనివాసంబున నుండె నంత.

## యయాతి నూతం బడినదేవయాని నుద్ధరించుట

ఉ. ఆనహుషాత్మజుం డగుయయాతి యధిజ్యధనుస్సహాయుఁ డై
యానతశాత్రవుండు మృగయారసలోలనిబద్ధబుద్ధిఁ ద
త్కానన మెల్లఁ గ్రుమ్మరి నికామపిపాసితుఁ డేఁగుదెంచె నం
దానలినాక్షి యున్నవిపినాంతరకూపతటంబుపొద్దకున్.

సీ. చనుదెంచి యమ్మహాజనపతి జల మపేక్షించి యచ్చో విశ్రమించి చూచి
తత్కూపమున విలసత్కూలఘనవల్లి యన్నిష్టనఖ నూఁది యున్నదాని
గురుకుచయుగముపైఁ బరువడిఁ దొరఁగెడు, కన్నీరు పూరించుచున్నదాని
దనసమీపమునకు జనులరాగమనంబు, పన్నుగాఁ గోరుచు నున్నదాని

ఆ. వరుణదేవుతోడఁ గర మల్గి జలనివా,సంబు విడిచి భూస్థలంబువలని
కరుగుదేర నున్న వరుణేంద్రుదేవియ, పోనిదాని దేవయానిఁ గనియె.

వ. కని నీ వెవ్వరిదాన వి ట్లేల యేకతంబ యివ్విపినాంతరకూపంబున నున్నదానవనిన విని దేవయాని యెప్పుడుం దమ విహరించుచున్న యవ్వనంబునకు మృగయావినోదార్థంబు యయాతి వచ్చుటంజేసి తొల్లియుఁ జూచినది గావున నాతని నెఱింగి యి ట్లనియె.

తరలము. అమరసన్నిభ యేను ఘోరసురాసురాహవభూమి న
య్యమరవీరులచేత మర్దితు లైనదానవులన్ గత
ప్రభములంగాఁ దనవిద్యపెంపునఁ బ్రాప్తజీవులఁ జేసి య
త్యమితశక్తిమెయిన్ వెలింగిన యట్టి భార్గవుకూఁతురన్.

వ. దేవయాని యనుదానఁ బ్రమాదవశంబున నిన్నూతం బడి వెలువడనేరకున్నదానను న న్నుద్ధరించి రక్షింపు మనిన నవ్విప్రకన్యకయందుఁ దద్దయు దయాళుం డై.

చ. జలధివిలోలవీచివిలసత్కలకాంచనమంచితావనీ
తలవహనక్షమం బయిన దక్షిణహస్తమునం దదున్నమ
ద్గళదురుఘర్మవారికణ క్రమకరాబ్జము వట్టి నూతిలో
వెలువడఁ గోమలిం దిగిచె విశ్రుతకీర్తి యయాతి ప్రీతితోన్.

వ. ఇట్లు దేవయాని నుద్ధరించి యయాతి నిజపురంబున కరిగె నిట దేవయానియు శర్మిష్ఠ సేసినయెగ్గువలన విముక్తయయి తన్ను రోయుచువచ్చుదాని ఘూర్ణికయను పరిచారికం గని యేను వృషపర్వుపురంబు సొర నొల్ల శర్మిష్ఠచేతనాపడిన యవమానంబు మదీయజనకున కెఱింగింపు మని పంచిననదియును నతిత్వరితగతిం జని తద్వృత్తాంతం బంతయు శుక్రునకుం జెప్పిన శుక్రుండును నాక్షణంబ కోపఘూర్ణిత బాష్పపూరితనయన యై యున్న దేవయానిం గని యిట్లనియె.





# ఏకాంకిక: ★ హితశ్రీ ★

పాత్రలు. జయరాం, ప్రొఫెసర్ నారాయణరావు, జనరల్ మేనేజర్ రావు, మూర్తి, వెయిటర్.

(ఒక పెద్దహోటల్లో లాడ్జింగ్ రూమ్ వెనక భాగంలో ఒక బెడ్ గదిమధ్యన చిన్న టేబుల్, దానిమీద ఒక ఫోను, టేబుల్ లైటూ, టేబుల్ కి అటూ, ఇటూ—రంగస్థలానికి కుడివైపూ ఎడమవైపూ—రెండు సోఫాలు ఉంటాయి గదికి ఒకటేద్వారం ద్వారానికీ, టేబుల్ కీ సమాన దూరంలో రంగస్థలం వెనక భాగంలో ఒక కోట్ స్టాండ్, దానిమీద ఓ ఖరీదైన కోటు, హాట్, స్టాండ్ పక్కన బూట్లు ఉంటాయి స్టాండ్ కి కొంచెందగ్గరలో ఓ చిన్న సూట్ కేసు ఉంటుంది

సంజచీకట్లు అలముకొనే సమయం టేబిల్ లైట్ వెలుగుతూంటుంది. తెర తెచే సరికి ప్రొఫెసర్ నారాయణరావు చిరాగ్గా అటూ ఇటూ తిరుగుతూ, మధ్య మధ్య కళ్లు నులుముకొని తేరిపార చూస్తూ ఉంటాడు. నడివయసు మనిషి. ఇన్ షర్టులో ఉంటాడు. కాళ్లకి బూట్లుండవు తరుచు బుర్ర గోక్కుంటూ ఆలోచనగా పైకి చూస్తూండటం ఇతని కలవాటు పరధ్యానం మనిషి. ట్రేలో కాఫీ పాట్ తో వెయిటర్ ప్రవేశం. ఎప్పుడూ పెదవులమీద చిరునవ్వు చిందులాడుతుంది సరదాగా మాట్లాడే స్వభావం కలవాడు. మాటల్లో కొంత అమాయకత వెల్లడవుతుంది)

వె (ట్రే బల్లమీద పెడుతూ) కాఫీ తెచ్చానుసార్

నా ఇప్పుడు కాఫీ ఎందుకోయ్.

వె తెమ్మని ఆర్డర్ చేశారుగదా సార్!

నా చేశానా? ఓ! అవును. ఇలాఇవ్వు.

వె (కాఫీ కప్పులో పోస్తూ) తమరు పరాగ్గా ఉన్నారుసార్.

నా పరాకా? ఓ, అవును బ్రహ్మాండమైన ఒక ప్రాబ్లెమ్ సాల్వ్ చేస్తున్నానోయ్.

వె: ఏమి ప్రాబ్లెమ్ సార్.

నా యూనివర్సిటీలో అణుశక్తిని గురించి ఉపన్యాసాలివ్వటానికే గదూ నేను వచ్చింది పొద్దున ఉపన్యాసంలో అనుకోకుండా ఓ సమస్య ఎదురైంది ఎవరో ఓ ప్రశ్న అడిగారు ఏదో చెప్పాననుకో కాని నాకే అంత తృప్తిగా లేదు సరైన సమాధానం అంది అందకుండా బాధ పెడుతోందోయ్.

వె: తమరు అంత బడా ప్రొఫెసర్ గదా సార్! తమరికే సమస్యలా?

నా (నవ్వి) ఎవరికైనా ఆలోచించిన కొద్ది సమస్యలే.

వె: తమరు ఎప్పుడూ ఆలోచిస్తూనే ఉంటారు సార్

నా ఉద్యోగమే అది. ఏదీ కాఫీ? (తడుముకుంటూ ముందుకి వస్తాడు)

వె (అందిస్తూ) ఇక్కడసార్.

నా: (అందుకోటానికి తడుముతూ సోఫాతో ఢీకొంటాడు)

వె (లేవదీస్తూ) ఏమిసార్, కంట్లో బాగో లేదా? అట్లా తూలిపడిపోయారేం సార్?

నా (కళ్లు నులుముకుంటూ) కళ్లు సరిగా కనిపించటం లేదోయ్

వె అదేం సార్?

నా ఏమో? ఇప్పుడే నిద్రలేచాను నిద్ర లేచినప్పటినుంచీ ఇలాగేఉంది. కాఫీ తాగితే తగుతుందేమోనని నిన్ను పిలిచాను.

వె (అతనివైపు పరకాయించి చూసి ఏదో జ్ఞాపకం వచ్చినట్టుగా) కళ్లకి జోడు లేదుసార్! మరేమో ననుకున్నాను.

నా జోడా! ఓ, అవును. నా కళ్లజోడేది?

వె (బెడ్ మీద వెతికి కళ్లజోడు తెచ్చిస్తూ) ఇక్కడ సార్.

నా (జోడు పెట్టుకుని) ఓ థాంక్స్ జోడు సంగతి మర్చిపోను, వెయిటర్ ఎందుకో కళ్లు మసకలుగా ఉన్నాయనుకున్నాను (నవ్వుతాడు)

వె (చిరునవ్వు ఆపుకుంటూ) తమకి పరధ్యాన్నెసార్. కాఫీ తీసుకోండిసార్ (నారాయణరావు కాఫీ అందుకుని తాగుతూంటాడు) సార్ (నసుగుతూ) తమరు ఈ సాయంత్రమే గది ఖాళీ చేస్తారుగదా సార్?

నా ఈ సాయంత్రమా?

వె అవును, సార్. తమరు మొదట అట్లానే చెప్పారు సార్

నా: చెప్పానా? ఓ, అవును నా ఉపన్యాసాలు ఇవాళతో ఆఖరేగదూ నా పనైపోయింది. గది ఖాళీ చేసేస్తానోయ్, వెయిటర్.

వె. సార్. మేనేజర్ గారు మనవి చెయ్యమన్నారు సార్ అందుకని

నా: ఏ విషయం?

వె ఇదేసార్ ఒక వేళ తమకి గది ఇంకా కావాలిసిఉంటే పక్కగది ఖాళీగానే ఉంది సార్

నా: అక్కర్లేదులే అయినా ఉండదలుచుకుంటే ఈ గదికేం?

వె ఈ సాయంత్రం నించీ ఇది బుక్ అయిపోయింది సార్

నా: అప్పుడే

వె: అవునుసార్. ఇది రిజర్వ్ డ్ రూమ్ సార్ ప్రతినెలా ఇదే తారీకు సాయంత్రం నించీ మూడురోజులు రావ్ అండ్ రావ్ కంపెనీ జనరల్ మేనేజర్ గారు ఈ గదిలోనే బసచేస్తారు సార్.

నా ఎవరూ?

వె రావ్ అండ్ రావ్ కంపెనీ జనరల్ మేనేజర్ తమరు ఎరుగున్నారా సార్.

నా లేదులే. పేరువిన్నాను. పెద్ద కంపెనీ కదూ?

వె అవునుసార్.

నా (గడియారం చూసుకుంటూ) ఆయన ఎన్నిగంటలకి వస్తాడు?

వె: ఇదే టైంసార్

నా: సరే ఆయనవస్తే ఈ గదిలోనే బసచెయ్యొచ్చని చెప్పు నాకు కొంచెం బజారు పనిఉంది మళ్ళీ ఇప్పుడే వచ్చేస్తాను, రాగానే ఖాళీచేసి వెళ్ళిపోతాను.

వె: అలాగేసార్.

(నారాయణరావు కోట్ స్టాండ్ దగ్గిరికి వెళ్ళి ముంజేతిమీద కోట్ వేసుకుని హాట్ పెట్టుకుని బయటికి వెళ్ళబోతూ ఉంటాడు. అతని కాళ్ళకి బూట్లు లేకపోవటం వెయిటర్ చూస్తాడు) సార్ ...బూట్లు...

నా: (పరధ్యానంగా) ఆఁ– బూట్లు? పాలిషా? అక్కర్లేదులేవోయ్, బాగానే ఉన్నాయి.

వె: (నవ్వు ఆపుకుంటూ) అది కాదు సార్... కాళ్ళకి బూట్లు వేసుకోటం మర్చిపోయారు సార్.

నా: (చూసుకుని చిరునవ్వునవ్వి) ఓ— థాంక్స్... ఏమిటో మర్చిపోయినట్టు అనుకుంటూనే ఉన్నాను. బూటూ! (స్టాండ్ దగ్గిరికి వెడతాడు.)

వె: వెలవుసార్. (ముసిముసి నవ్వులు నవ్వుకుంటూ ట్రే తీసుకుని నిష్క్రమిస్తాడు.)

(నారాయణరావు స్టాండ్ మీద కోటు వేసి, బూట్లు వేసుకుని మళ్ళీ కోట్ తీసుకోటం మర్చిపోయి అలాగే బయటికి వెళ్ళిపోతాడు. కొంచెంసేపటి తరవాత బెదురు బెదురుగా జయరాం ప్రవేశం. ముప్ఫయ్యేళ్ళ వయసు. సూటులో ఉంటాడు. అతని కోటురంగు ఇంచుమించు ప్రొఫెసర్ నారాయణరావు కోటురంగే. గదిలోకి రాగానే నాలుగు మూలలా కలయచూసి, అనుమానంగా వెనక్కిచూసి తలుపు దగ్గరగా వేసి కోట్ స్టాండ్ దగ్గిరికి వెళ్ళి కోటు జేబులు తడిమి పర్సు తీసి చూస్తాడు. మళ్ళీ చుట్టూ ఒకసారిచూసి చప్పున పర్సు కోట్ జేబులో వేసుకొని టేబుల్ దగ్గిరికి వస్తాడు. పర్సుతీసి పది వందరూపాయిలనోట్లు లెక్క పెడతాడు. అతని ముఖం వికసిస్తుంది. వొణికే చేతుల్తో ఆ నోట్లన్నీ మళ్ళీ పర్సులో పెట్టి జేబులో వేసుకుని భయం భయంగా తలుపుదగ్గిరికి వస్తూంటాడు. ఆ సమయంలో తటాలున మూర్తి ప్రవేశం. ముప్ఫయి అయిదేళ్ళవ్యక్తి. ధోవతీ, షర్టూ, కండువా వేసుకుంటాడు. దుస్తుల్లో బీదరికం వ్యక్తమవుతుంది. చేతిలో ఫైల్ ఉంటుంది.

మూర్తి: నమస్తేసార్.

జయరాం: (గాభరాతో వొణికిపోతూ యాంత్రికంగా) న...నమస్తే.

మూ: ఎక్కడికో వెడుతున్నట్టున్నారు.



# ★ విముక్తుడు ★

ఇబ్బంది కలిగిస్తే క్షమించండి. తమతో ఒక్క అయిదు నిమిషాలు మాట్లాడవచ్చా సార్?

జ: (రుమాలుతో చెమట తుడుచుకుంటూ) నా...నాతో నా?

మూ: అవును సార్. రావ్ అండ్ రావ్ కంపెనీ జనరల్ మేనేజర్ తమరేకదు సార్?

జ: జ...జనరల్ మేనేజర్...! (తప్పని పరిస్థితి గ్రహించి) ఆఁ...ఆఁ...అవును.

మూ: వాకబు చేస్తే తమరు ఈరోజే వస్తారనీ, ఈ హోటల్లో, ఈ రూమ్లో మకాం చేస్తారనీ తెలిసింది. ఆత్రాకొద్దీ మీరు వచ్చారో లేదో హోటల్ మేనేజర్ని కూడా అడక్కుండానే సరాసరి ఇలా వొచ్చాను సార్.

జ: (తెప్పరిల్లి) మీకేం కావాలి?

మూ: చెబుతాను సార్. ఒక్క అయిదు నిమిషాలు సావకాశంగా వింటే...

జ: క్షమించాలి. జరూరుగా వెళ్లాలి. తరవాత మాట్లాడదాం. (వెళ్ళబోతాడు)

మూ: (జాలిగా) తరవాత సమయం మించిపోతుందేమోనని భయం సార్. ఒక్క అయిదునిమిషాలు.

జ: (భయంగా, విసుగ్గా) అలా కూర్చోండి, ఇప్పుడే వొస్తాను. (వెళ్లబోతాడు)

మూ: (హతాశుడై) బయట ఎంతమందో కాచుకుని ఉంటారు సార్.

జ: ఎందుకోసం?

మూ: ఉద్యోగంకోసం.

జ: మీరు ఉద్యోగంకోసం వచ్చారా?

మూ: అవును సార్.

జ: సారీ... ఇప్పుడేం ఖాళీలు లేవు. నా టైం వేస్టు చెయ్యకండి (వెళ్ళబోతాడు.)

మూ: (అడ్డంవెళ్ళి) అలా అంటే కాదు సార్. నా పరిస్థితి మనవి చేసుకుంటాను. ఒక్క అయిదు నిముషాలు దయచేసివినండి. ఎంతో ఆశతో వచ్చాను....

జ: (భయంగా తలుపువైపు చూసి) హుంష్, నెమ్మదిగా మాట్లాడండి. నాకు చెముడు లేదు.

మూ: అలాగేనండి.

జ: ఊఁ, మీరు చెప్పేదేదో త్వరగా చెప్పెయ్యండి.

మూ: నిలబడే ఉన్నారు. అలా కుర్చీలో కూర్చోండి సార్.

జ: (నిట్టూర్చి) ప్చ్! అక్కర్లేదండీ ఊఁ- మొదలు పెట్టండి.

మూ: నన్ను మూర్తి అంటారండి. గొప్పకంపెనీగా పేరుపడ్డ నేషనల్ హోల్ సేల్ స్టోర్సు బ్రాంచి మేనేజర్ గా పని చేశానండి.

జ: ఇప్పుడెందుకు మానేశారు?

మూ: కాలంకర్మం కలిసిరాక ఆ కంపెనీ దివాలా తీసిన సంగతి మీకు తెలిసే ఉంటుంది.

జ: దివాలా తీసిందా?

మూ: (ఆశ్చర్యంగా) తమకి తెలియదా? అంత పేరుపడ్డ కంపెనీ...అందులో మీకు పోటీగా ఉండేది...!

జ: ఆఁ...అవును...అవును...అయితే ఉద్యోగం పోయిందన్నమాట.

మూ: అవునండి. ఈ రెండు నెలల్నుంచి నేనుపడేపాట్లు చెప్పటానికికూడా శక్యం కాదండి. తమరు నా అనుభవం గమనించి..

జ: మా దగ్గిర ఉద్యోగాలేవీ ఖాళీగా లేవండీ. అయాం సారీ.

మూ: అలా అంటారేం సార్? త్వరలో మీరు సిటీలో ఇంకో బ్రాంచి పెట్టబోతున్నారనీ, బ్రాంచి మేనేజర్ ఉద్యోగానికి దరఖాస్తులు పంపుకోవచ్చనీ ప్రకటించారు గదండీ.

జ: (తడబడి) ఊఁ—అయితే?

మూ: నా దరఖాస్తుకూడా పంపుకున్నానండీ.

జ: ఓహో.

మూ: నా విషయం తమరు దయతో పరిశీలించాలని ప్రార్థిస్తున్నాను సార్.

జ: సరే, ఆలోచిస్తానులెండి. తరవాత కలుసుకుందాం. (వెళ్లిపోతాడు.)

మూ: (చేతిలోని ఫైలు బల్లమీద పెట్టి అందులోంచి ఓ కాగితాలకట్ట తీసి ఇస్తూ) ఇవన్నీ నా టెస్టిమోనియల్స్. చూడండి సార్.

జ: ఆఫీసుకి పంపించండి, చూస్తాను.

మూ: క్షమించండి. కనీసం ఈ ఒక్కటే.. (ఒక కాగితం చేతికి ఇస్తాడు.) మిగతా కాగితాలన్నీ మళ్ళీ బల్లమీది ఫైల్లో పెట్టేస్తాడు.)

జ: (గబగబ చదివి) సరే, ఇక మీరు వెళ్ళొచ్చు.

మూ: (అసంతృప్తితో) వెళ్లమంటారా? వెడతానండి. కాని వెళ్ళేముందు రెండుమాటలు చెప్పనివ్వండి. కేవలం నా తృప్తికోసం ఈ ఒక్క విషయమూ వినండి. ఉద్యోగం పోయిన ఈ రెండు నెలల్నుంచీ కాళ్ళు బలపాలు కట్టేటట్టు తిరిగాను ఉద్యోగంకోసం. ఫలితం శూన్యం. ఆశలన్నీ ఈ ఉద్యోగంమీదే పెట్టుకున్నాను. ఇది దక్కకపోతే ఆత్మహత్యే శరణ్యం.

జ: (అదిరిపడి) ఆత్మహత్యా!

మూ: అవును సార్.

జ: బెదిరిస్తున్నారా?

మూ: లేదండి. నేను ఒక్కడినే అయితే ప్రాణంపోయేదాకా ఉపవాసాలు చెయ్యగలను. కాని నామీద ఆధారపడిన ఏడుగురు మనుషులు ఆకలితో అలమటించిపోతుంటే ఎన్నాళ్ళు చూస్తూ సహించగలను? వాళ్ళకోసమే అభిమానం చంపుకుని ప్రాధేయపడుతున్నాను.

జ: (కటువుగా) అలా ప్రాధేయపడటంకంటే గత్యంతరం ఏమీ లేదా?

మూ: సెంటు భూమి లేదు. దమ్మిడీ బ్యాంక్ బాలెన్సు లేదు. కాస్తంత పరపతి కూడా లేదు. వేరే గతేముంది?

జ: ప్రాధేయపడితే ఫలితం ఉంటుందనుకుంటున్నారా?

మూ: ఉన్నా లేకపోయినా నేను చెయ్యగలిగింది ఇంకేమీ లేదు.

జ: (ఆవేశంగా) దొంగతనం చెయ్యండి.

మూ: (ఆశ్చర్యంగా) దొంగతనమా!

జ: అవును. దొంగతనమే. అంటే బతకలేనివాడు బతకటానికి చేసేపని. జేబులు కొట్టండి. మోసగించి కాజెయ్యండి.

మూ: ఏమిటిసార్, ఇలా మాట్లాడుతున్నారు?

జ: బతకటానికి అందరికీ హక్కుంది. సవ్యంగా సంఘం బతకనివ్వకపోతే నీతి సూత్రాల్ని ఎందుకు శిరసావహించాలో నాకు తెలియదు.

మూ: కాని బొందిలో ప్రాణముండగా నేను దొంగతనం చెయ్యలేనండి.

జ: చెయ్యలేరూ?

మూ: (దృఢంగా) ఊఁహుఁ... ఎటువంటి పరిస్థితిలో కూడా చెయ్యలేను, చెయ్యను.

జ: తాగటానికి గంజికూడా లేక భార్య మంచి నీళ్ళతో కడుపు నింపుకుంటోందనుకోండి. పాలు లేక పసిపాప ఆవురావురని పొలపెడుతోందనుకోండి. మందునీళ్ళకి గతి లేక తల్లి జబ్బుతో పడిఉందనుకోండి. పిల్లలు అన్నానికి ముఖం వాచిపోయారనుకోండి. మూడు రోజుల్నుంచీ మీకు తిండి లేక కళ్లు తిరుగుతున్నాయనుకోండి. ఏం? ఇప్పుడు చెప్పండి, (హేళనగా) వీలైతే, చేతైతే దొంగతనం చెయ్యరూ?

మూ: ఇవన్నీ నేను అనుకోవాలిసిన అవసరం లేదు.

జ: లేదూ? మీ పరిస్థితి ఇంకా అంత వరకు రాలేదన్నమాట!

మూ: అంతకంటె ఘోరమైన పరిస్థితిలోనే ఉన్నాను. ఊహించుకోవలసిన అవసరం లేదంటున్నాను.

జ: అలాంటి స్థితిలో దొంగతనం చేస్తే ఏం? నేరమా, ఘోరమా, పాపమా?

మూ: నేరమూ, ఘోరమూ, పాపమూ. అందులో పిరికితనం ఉంది. నేనే మైనా కాగలను కాని దొంగను కాలేను నాలో అంత పిరికితనం లేదు.

జ: పిరికితనమా?

మూ: అవును. దొంగకంటె పిరికివాడు లేడు.

జ: (అర్ధ స్వగతంగా) పిరికివాడు!

మూ: పరిస్థితుల్ని ఎదుర్కో లేని పిరికివాడు దొంగ. దొంగతనం చేసేముందూ, చేసిం తర్వాత కూడా పిరికితనం దొంగని వెంట తిరుగుతుంది. దొంగైనవాడు తప్పుడు ధనంతో బాధపడుతూ నిర్భాగ్యుడై క్రమంగా ఎందుకూ కొరగాకుండా పోతాడు. ఆపని నేను చస్తే చెయ్యలేను.

జ: (బరువుగా నిశ్వసించి) అయితే ఎలా బతుకుతారు?

మూ: ఇప్పటి దాకా బ్రాంచి మేనేజర్ చేశాను. అవసరమైతే ఇహనించీ కూలీ పని చేస్తాను. మధ్య తరగతి అభిమానానికి స్వస్తి చెబుతాను. అవసరాన్ని మించిన అభిమానానికి పోను

జ: కూలీపని దొరక్కపోతే?

మూ: అడుక్కుంటాను.

జ. (కసిగా పెదవికొరికి కొన్ని క్షణాలాగి తటాలున పర్సుతీసి ఒక వంద రూపాయల నోటు ఇస్తూ) ఇదిగో ఉంచండి.

మూ: (తెల్లబోయి) థాంక్స్ సర్ ... ఎక్కడా కూలి పనికూడా దొరక్కపోతే తప్పకుండా మీదగ్గరికి మళ్ళీ వస్తాను. ఉంచండి సెలవు, సార్. (నోటుతీసుకోకుండా గబగబ నిష్క్రమిస్తాడు)

జ (నిర్ఘాంతబోయి) మూర్తిగారూ!

(అతను వెళ్లినవైపే చూస్తాడు. ముఖంలో ఆందోళన వ్యక్తమవుతుంది. బరువుగా నిట్టూర్చి చేతిలోని కాగితం వైపు ఒకసారి చూసి రెండడుగులు త్వరగా ముందుకు వేసి మళ్ళీ ఆలోచించి వెనక్కి వెళ్ళి బల్లమీది ఫైల్లో ఆకాగితం పెట్టేస్తాడు. జేబులోంచి పర్సుతీసి స్టాండుదాకా వెళ్ళి ప్రొఫెసర్ కోట్‌లో పర్సు పెట్టబోయి మళ్ళీ తటపటాయించి కృతనిశ్చయంతో తన జేబులో వేసుకుని తలుపు దగ్గిరికి వస్తూంటాడు. ఆసమయంలో వెయిటర్ ప్రవేశం)

వె: ఎవరు కావాలి సార్, ప్రొఫెసర్ గారేనా?

జ (తడబడి) ప్రొ...ప్రొఫెసర్ గారా! (సర్దుకుని) ఆఁ-ఆఁ-ప్రొఫెసర్ గారికోసమే వచ్చాను.. (అనుమానంగా) ఈ...ఈ గదిలో వుండేది వారేనా?

వె: అవును సార్. కూర్చోండి. ఇప్పుడే వొస్తారు.

జ: ఇప్పుడే వస్తారా?

వె: అవును సార్.

జ: సరే, మళ్లీ వస్తాను.

వె: ఎందుకు సార్? అలా కుర్చీలో కూర్చోండి సార్.

జ: ఇక్కడెందుకూ? గెస్ట్ రూమ్‌లో కూర్చుంటాలే.

వె: పరవాలేదు సార్. ప్రొఫెసర్ గారి కోసం వచ్చేవాళ్ళందరూ ఇక్కడే వెయిట్ చెయ్యాలని ఆరర్ సార్.

జ: (ముచ్చెమటలు పోస్తాయి. తప్పించుకు పోవాలని ప్రయత్నిస్తూ) అబ్బ... ఇక్కడ ఉక్కగా ఉంది వెయిటర్, మళ్ళీ వొస్తాలే

వె: ఉక్కగా ఉంటే ఫాన్ వేస్తాను సార్. అలా కుర్చీలో కూర్చోండి. రండి సార్ ...

జ: (తప్పనిసరిగా) సరే, కూర్చుంటాలే. నువ్వెళ్లు

(కుర్చీలో కూర్చోబోతాడు.)

వె: ఉండండి సార్. కోటు తీస్తాను. గాలి తగులుతుంది.

జ: (గాభరాగా) వొద్దు...వొద్దు... ఉండనీ.

వె: పరవాలేదు సార్.

(బలవంతంగా కోటు తీసి, టేబిల్ ఫాన్ స్విచ్ వేసి కోటు స్టాండుమీద తగిలించి వస్తాడు)

# ★ విముక్తుడు ★

అబ్బ. ప్రొఫెసర్ గారికి ఎంత మతిమరుపు సార్. కోటు వేసుకుని వెళ్లటం మర్చిపోయారు. ఎప్పుడూ ఆలోచనే సార్.

జ: (భయంగా చూసి) ఆఁ...ఆఁ... అలాగా!

వె: కళ్లకి జోడుందో లేదో, కాళ్లకి బూట్సున్నాయో లేవో కూడా తెలీదు సార్.

జ: ఆఁ! అలాగా!

వె: వారితో మీకు బాగా పరిచయం లేదా సార్?

జ: (తడబడి) ఎందుకు లేదూ. ఉంది, ఉంది. వారిని నేను బాగా ఎరుగుదును.

వె: అలాగా సార్. మరి వారి మతిమరుపు సంగతి మీకు తెలియదా సార్?

జ: ఎందుకు తెలియదూ? తెలుసు... తెలుసు.

వె: (కొద్దితృణాలు అతనివంక చూసి) తమ రేదో ఆలోచిస్తున్నారు సార్.

జ: ఆఁ...అవును...అవును...

వె: తమరు కూడా ప్రొఫెసరా సార్.

జ: ప్రొఫెసరా? ఆఁ- ఆఁ- అవును.

వె: (చిరునవ్వుతో) నాకు తెలుసు సార్.

జ: (అతనివైపు అనుమానంగా చూసి) తెలుసా?...ఎలా తెలుసు?

వె: ఆ మాటతీరు చూస్తే తెలియదా సార్? ఆలోచిస్తూ పరధ్యానంగా జవాబులు చెబుతున్నారు.

జ: ఓ...హో. పనిఉంటే చూసుకో వెయిటర్. నేనిక్కడే ఉంటాలే. (అదుర్దాగా అటూ ఇటూ చూస్తాడు.)

వె: అలాగే సార్. (వెళ్లిబోతూ ఆగి) తమరు ఎందులో సార్ ప్రొఫెసర్?

జ: (ఒళ్లుమండి నిగ్రహించుకోలేక) దొంగతనంలో!

వె: (తెల్లబోయి) ఏమి వేళాకోళం సార్?

జ: (సర్దుకుని) మరి లేకపోతే ఆ గొడవలన్నీ నీకెందుకు?

వె: ఎందుకు సార్, కోపం చేస్తారు? దొంగతనంలో ప్రొఫెసర్ అంటే జ్ఞాపకం వచ్చింది. అట్లాంటి బడా ప్రొఫెసర్ ఒకడు ఈ గదిలోనే కొంతకాలం మకాం చేశాడు సార్.

జ: (ఉలిక్కిపడి) ఈ గదిలోనా?

వె: అవును సార్. డాబుగా సూటూ బూటూ వేసుకొస్తే మీలాంటి పెద్దమనిషే ననుకున్నాను.

జ: (తటాలున నిలబడి) నాలాంటి పెద్దమనిషా?

వె: అవును సార్ మొదట అట్లానే అనుకున్నాను. వాడు వచ్చినప్పటినించీ లాడ్జర్స్ పర్సులు పోవటం మొదలుపెట్టాయి. అనుమానించి కాపువేశాను సార్.

జ: ఆఁ! కాపువేశావా!

వె: ఏంజరిగిందో తెలుసా సార్! వాడు దొంగచూపులు చూస్తూ ఓ గదిలో జొరబడి స్టాండుదగిరికి వెళ్లి కోటుజేబులు తడమటం చూశాను సార్.

జ: (జేబురుమాలుతో చెమట తుడుచుకుని) ఆఁ- చూశావా?

వె: అవును సార్. పొంచిఉండి చూశాను. (స్టాండ్‌దగ్గిరికి వెళ్లి ప్రొఫెసర్ కోటుజేబులో చెయ్యిపెట్టి అభినయిస్తూ) వాడిలా పర్సు లాగాడో లేదో ఠక్కుమని... పట్టుకున్నాను సార్.

జ: (పారిపోవటానికి దిక్కులు చూస్తూ) పట్టుకున్నావా? అబద్ధం!

వె: అబద్ధమా? కావలిస్తే మేనేజరుగార్ని అడగండి.

జ: (అవకాశం చిక్కినందుకు సంతోషిస్తూ) సరే, అడిగొస్తాను (వెళ్లబోతాడు.)

వె: ఉండండి సార్. ఈమాత్రం దానికే అడగాలా? నేనంటే నేను పట్టుకోలేదు. మేనేజర్‌కి రిపోర్టు చేశాను సార్.

జ: రిపోర్ట్ చేశావా? (నిస్పృహతో కుర్చీలో కూలబడతాడు.)

వె అవునుసార్. ఆపళాన వాడిని పట్టుకుని మేనేజర్ తన్నాడు సార్!—దవడలు వాచిపోయాయి. వాడీ జన్మలో మళ్లీ దొంగతనం చెయ్యడు సార్.

జ (దవడలు తడుముకుంటూ) వెయిటర్, నిజంగా రిపోర్ట్ చేశావా?

వె: నిజంసార్. నాకు యాభై రూపాయలు బహుమతికూడా దొరికింది.

జ: బహుమతీ! (తటాలున లేచి తన కోటు తీసుకుని పర్సు తీసి) ఇదిగో, వెయిటర్, ఈ బహుమతి తీసుకో (వంద రూపాయల కాగితం ఇవ్వబోతాడు)

వె: (నిర్ఘాంతపోయి) ఏమిటిసార్ ఇది! నా కెందుకు, సార్. నా డ్యూటీ నేను చేశాను సార్. ఉంచండి సార్, ఉంచండి. ఎంతమంచి ప్రొఫెసర్ సార్ మీరు.

జ: పరవాలేదులే, తీసుకో.

వె: వొద్దుసార్. నాకంత ఆశ లేదు. మీ దయ ఉంటే చాలు కూర్చోండిసార్. ప్రొఫెసర్ గారు వొస్తున్నారేమో, చూస్తాను. (తలుపుదాకా వెళతాడు.)

జ: (అనుమానంగా అతనివైపు చూస్తూ పర్సు జేబులో పెట్టుకుంటాడు) ప్రొఫెసర్ వస్తున్నారా?

వె: (తిరిగివస్తూ) లేదు సార్. రావ్ అండ్ రావ్ కంపెనీ జనరల్ మేనేజర్ వచ్చే టైం కూడా అయింది.

జ: రావ్ అండ్ రావ్ కంపెనీ జనరల్ మేనేజరా!

వె: అవునుసార్. వారికి ఈ రూమ్ బుక్ అయింది. ప్రొఫెసర్ గారు బజారునించి రాగానే ఖాళీ చేస్తామన్నారు. చూసిపోదామని వచ్చాను. వారింకా రాలేదు.

జ: ఆయన వొచ్చేదాకా ఇక్కడే వుంటావా?

వె అవునుసార్.

జ: (తలపట్టుకుని, తటాలున ఆలోచన తట్టగా) వెయిటర్ కొంచెం కాఫీ తెచ్చి పెడతావా?

(47-వ పేజీ చూడుడు)

# నక్షత్రఫలితాలు

[30-7-58 మొదలు 5-8-58 వరకు]

గ్రహస్థితి

| | | | |
|---|---|---|---|
| | కుజ | | కు |
| | మకర, కుంభ, మీనములలో చంద్రుడు | | ర |
| | | | బు |
| | శు | గురా | |

### *అశ్విని [చూ, చే, చో, లా]*

ఈ వారము ప్రతిపనికి అనవసరంగా ఆలస్యం జరుగుతుంది. ఏ పని చేసేందుకూ సమాధానము కుదరక చికాకుపడతారు. ఆశాభంగం ఎక్కువ. వర్తకులకు లాభం తక్కువ. రహస్యములను కనిపెట్టుటలో నిపుణులగుట వలన అందుకొరకు ప్రభుత్వము మిమ్ములను నియమిస్తుంది. ఉద్యోగస్తులకు శిక్షకొరకు వనపర్వతప్రాంతములకు బదిలీ కావచ్చును. విదేశీయులతో పరిచయము, విచిత్ర వస్తు సంపాదన, కార్యసాధన, 31, 1 తేదిలలో కార్యయత్నము. 2, 3 లలో ఆటంకములు త్రిప్పట, చాంచల్యము, ఆత్మీయుల అనారోగ్యము, బదిలీ. 4, 5 లలో ప్రయాణము, మిత్రదర్శనము, లాభము.

### * భరణి [లీ, లూ, లే, లో] *

ఈ వారం మీరు యొవరిసహాయమును కోరి కార్యములు చేదామనుకున్నారో ఆవ్యక్తివల్లే మీకు ఆటంకములు కలుగుతవి. ధనాభావము ఎక్కువగా వుంటుంది. ఆధ్యాత్మికచింత కలవారగుటచే ఈశ్వరకృపచే అన్నికష్టములూ గడచి క్రమేణ కార్యసిద్ధి పొంగుతారు. ఇంట్లోవారి ఆరోగ్యము ఆందోళన కలుగజేస్తుంది. ఉద్యోగస్తులకు ఒత్తిడి. వ్యాపారస్తులకు నిరాశ. విద్యార్థులకు అశ్రద్ధ 30, 31, 1 నష్ట ద్రవ్యలాభం. 2, 3 లలో ఆటంకములు ఆరోగ్యచింత. 4, 5 లలో సాధుసాంగత్యము. ఆత్మవికాసం, కార్యలాభం.

### * కృత్తిక [అ, ఈ, ఊ, ఏ] *

ఈవారం మీకు అనుకూలతకన్న ప్రతికూలత ఎక్కువ. దావాలలో గెలుపుపొందుతారు. శ్రమ ఎక్కువపొందినపైని యత్నకార్యములు ఫలిసాయి. పరోపకారమునకు యత్నపడి పనుల ఒత్తిడివలన చేయలేక నింద పొంగుతారు ఇచ్చిపుచ్చుకొనే పట్ల వివాదములు. ఉద్యోగస్తులకు అధికారుల అనాదరణవున్నా, తోటివారి సహకారముచే సర్దుకుంటుంది. వర్తకులకు వారమంతా నిరాశగా వున్నా వారాంతమందు మేలుగా వుంటుంది. 2, 3 తేదిలలో అధికార్ల ఒత్తిడి, నిందలు, వివాదములు, 3, 4 లలో కార్యలాభము.

### * రోహిణి [ఓ, వా, వీ, వూ] *

మీ ఆలోచనలు కార్యరూపమునకు వచ్చేందుకు ఎన్ని ఆటంకాలు కలిగినా నిరు


బి. నరసింగరావు


త్సాహపడక పట్టుదలతో ప్రయత్నించి తుదకు కార్యసిద్ధిని పొందుతారు. ఖర్చులకు అవుసరపడిన సొమ్ము సమయానికి చేతికిరాక, ఋణం చెయ్యవలసివస్తుంది. కాని వారాంతమున తీరుస్తారు యంత్రములవల్లగాని అగ్నివల గాని ఎత్తుస్థలములనుండి పశుటవల్ల గాని అవయవములకు తగిలేదెబ్బలుజాగ్రత్తవల్లతప్పవచ్చు రసాయనిక శాస్త్రజ్ఞులకు, లోహపుసామాన్లు రంగులు వ్యాపారస్తులకు కష్టముతో కూడిన లాభము. ఇంజనీరింగు శాఖ వుద్యోగులకు, యంత్రములు నడుపు నిపుణులకు మేలుకాలము. 2, 3 లలో ఆరోగ్య చింత, ప్రమాదసూచన. 4, 5 లలో కార్య సాధన.

### * మృగశిర [వే, వో, కా, కీ] *

గత రెండు వారములనుండి కలుగుతూవున్న ఆటంకములను గడిచి, ఈ వారము అధికారుల సహాయముచేతను మీయుక్తిచేతను కార్యసిద్దిని పొందుతారు ధనాదాయము వృద్ధిఅవుతుంది. 30, 31, 1 లలో తొందరులుతగ్గి కార్యక్రమము ఒకదారిని నడుస్తుంది. 2, 3 తేదిలలో తొట్రుపాటు. 4, 5 అధికారుల ఆదరణ, ధనలాభము, బంధుదర్శనము, కార్యసిద్ధి, కవులకు, శిల్పులకు, నటీనటులకు యోగకాలము. విద్యార్థులకు ఉత్సాహముగా వుంటుంది. ఈశాన్య దిక్కునుండి శుభవార్త.

### * ఆరుద్ర [కూ, ఖ, జ, ఛ] *

ఈ వారము మీకు యోగము ఎక్కువ. ఉన్న యిబ్బందులు తీరుతవి. అనుకున్న సొమ్ము చేతికి వస్తుంది. దావాలలో గెలుపు కలుగుతుంది. పురుష సంతానము సుఖ సంతోషాలకై చేసిన ప్రయత్నాలు ఫలిస్తాయి. పండితులతో శాస్త్ర ప్రసంగములు చేయుటచే విజ్ఞానము వృద్ధిపొందుతుంది. ఉద్యోగస్తులకు అధికారము పెరుగుతుంది. 30, 31, 1 భాగ్యవృద్ధి, కార్యానుకూలత. 2, 3 బంధువుల రాకపోకలచే ఖర్చులు. 4, 5 ధనలాభము, పండితగోష్ఠి. ఉపాధ్యాయులకు, పండితులకు, న్యాయవాదులకు, న్యాయస్థానములలో ఉద్యోగులకు మేలుకాలము. విద్యార్థులు క్రొత్తసంగతులు తెలుసుకుంటారు.

### * పునర్వసు [కే, కో, హా, హీ] *

ఈ వారము మీకు యోగదాయకమైనా మానసికాందోళన వుంటుంది. ధనయోగము కలుగుతుంది. కవితాగోష్ఠి, గానసభలవంటి వినోదాలలో బంధుమిత్రులతో కలిసి పాల్గొంటారు. ఇదివరకు అనారోగ్యముతో వున్న దూరస్థులైన ఆప్తులు కోలుకుంటున్న వార్త తెలిసి సంతోషము పొందుతారు. నీటిపై ప్రయాణము చేయవలసి వస్తుంది, ప్రత్తి, దూది, నూలు, బట్టలు, బియ్యము, వెండినగల వ్యాపారస్తులకు లాభయోగము. కవులకు, గాయకులకు, నటీనటులకు మేలుకాలము. 30, 31 1 తేదిలలో ధనయోగము, కార్యసిద్ధి. 2, 3 మానసికాందోళన 4, 5 కుశలవార్త. బంధువులరాక, విందు వినోదము.

### *పుష్యమి [హూ, హే, హో, డా]*

గత రెండువారములవలెనే ఈ వారము కూడా మీకు యోగదాయము. క్రొత్త అనుభవములు కలుగుతవి. ఆదాయము అనుకున్నదానికన్నా ఎక్కువవుతుంది. శుభకార్యాలోచన చేస్తారు. సాంఘికసేవచేసి కీర్తి పొందుతారు క్రొత్తవిషయములనుగురించిచేసినఆలోచనలను కార్యరూపములోకి తీసుకొస్తారు. విద్యార్థులు ఉత్సాహముగా చదువుకుంటారు. ఉద్యోగస్తులకు హోదాతో గౌరవముకూడా పెరుగుతుంది. ఖరీదైన వస్తువుల క్రయవిక్రయములలో వర్తకులకు అనుకున్నదానికన్నా ఎక్కువ లాభము కలుగుతుంది. 30, 31, 1 ధనయోగము, ప్రయాణము, స్త్రీలతోనూ, ఆపులతోనూ విందు, వినోదము. 2, 3 అధిక ఖర్చులు. 4, 5 సంఘసేవ. కీర్తి, భార్యకు అలంకారప్రాప్తి.

# ★ నక్షత్రఫలితాలు ★

*** ఆశ్లేష [డీ, డూ, డే, డో] ***

ఈ వారము యత్న కార్యములకు ఆటంకములు కలుగుతవి. కార్యభారమువల్ల తీరుబడి వుండదు. ఆర్థికస్థితి సరిగా వుండనందున గృహావసరములు తీరక ఇబ్బంది కలుగుతుంది. వేళతప్పిన నిద్ర, భోజనమువల్ల, కళ్లు మంట, కాళుపీకు, తలపోటు వంటి అనారోగ్య సూచనలు కనబడగానే ఔషధ చికిత్స పొందుట మేలు. ఉద్యోగస్తులకు ఒత్తిడివున్నా అధికారుల మన్నన పొందుతారు. వర్తకులకు శ్రమ ఎక్కువ. రాజకీయ వాదులకు మేలుగా వుంటుంది. 2, 3, తేదీలు అనారోగ్యము. 4, 5 తేదీలలో కార్యలాభము, ధనయోగము.

*** మఖ [మా, మీ, మూ, మే] ***

ఈ వారము మీకు మిశ్రమయోగము. మొదట్లో నిరాశగా వుంటుంది. క్రమేణా స్నేహితుల సహాయమువల లాభము పొందుతారు. ధనలోపమువల్ల ఆందోళన. ఉద్యోగస్తులకు మంచిరోజులు కావు. వర్తకులకు మాంద్యం. విద్యార్థులకు శ్రద్ధ తక్కువ. ప్రభుత్వముచే రహస్యభేదనకు నియమితులౌతారు. మనోవ్యధ. గృహకలతలు, నిరాశ వంటి అవయోగములున్ననూ, ప్రయాణము, మిత్రసహాయము, కార్యసిద్ధి, విదేశీయులతో పరిచయము, అపురూపవస్తు సంపాదన మొదలగు మంచియోగములు కూడా కలుగుతవి. 2, 3 తేదిలలో ఆప్తుల ఆరోగ్య చింత.

*** పూర్వఫల్గుణి (పుబ్బ) ***
**మో, టా, టీ, టూ**

ఈ వారము మీరు తలపెట్టిన పనులకు ఆటంకములు కలుగుతవి. ధనాభావమునకు తోడు బంధువుల రాకపోకలవల్ల అధిక ఖర్చు అచే మనోవ్యధగా వుంటుంది. మత సంబంధమైన ఉపన్యాసములు వినుట, వ్యాసములు చదువుట, సాధుసాంగత్యములవల్లను, అధ్యాత్మిక చింతచేతను మనోవికాసము కలుగుతుంది. ఉద్యోగస్తులు కొంత శ్రమపడిన పైని మేలు పొందుతారు. వర్తకులకు అకస్మాత్తుగా ధనలాభము కలుగుతుంది. వారమంతా ఆటంకములు, గృహకలతలు, అధిక ఖర్చులు వున్నా, నష్టద్రవ్యలాభము, సాధుసాంగత్యము, ఆత్మవికాసము వంటి శుభయోగములు కూడా కలుగుతవి. 2, 3 తేదిలలో ఆప్తుల ఆరోగ్యము సరిగా వుండనందువల్ల వ్యధ.

*** ఉత్తరఫల్గుణి (ఉత్తర) ***
**[టే, టో, పా, పీ]**

ఈ వారము పరోపకారమునకు పూనుకొని సాగక మాటపడి విచారిస్తారు. కార్యభారము ఎక్కువ. ధనలోపముచే క్రిందు మీదౌతారు. కోర్టువ్యవహారములలో గెలుపు పొందుతారు. భార్య ఆరోగ్యము ఆందోళన కలిగిస్తుంది. అపర దినుసులు, ఉప్పు, మినుములు, నువ్వులు, నూనె వర్తకులకు మేలుగా వుంటుంది. ఆటంకములు, కలహాలు వంటి ఒడిదుడుకులున్నా ధనలాభము, కార్యానుకూలత వంటి శుభయోగములు కూడా కలుగుతవి. 2, 3 తేదిలలో భార్య అనారోగ్యము. విద్యార్థులకు బద్ధకము. ఉద్యోగస్తులకు బదిలీ.

*** హస్త [పూ, ష, ణ, ఠ] ***

ఈ వారము రాబడికి మించిన ఖర్చులు కలుగుటచే అప్పు చేయవలసి వస్తుంది. ప్రారంభించిన కార్యమునకు ఆటంకములు కలిగినా, అధైర్యపడక ప్రయత్నించి తుదకు ఫలప్రాప్తిని పొందుతారు. శరీరముపై కురుపులు లేస్తాయి. అగ్నివల్లగాని, యంత్రములవల్లగాని, వాడి పనిముట్లవల్లగాని అవయవములకు అపాయము జరుగవచ్చును. ఉద్యోగస్తులకు అధికారుల పోటుమాటలచే మనోవ్యధ. సోదర సహాయము కలుగుటవల ఇదివరకు చేసిన అప్పు తీరుస్తారు. భూస్వాములకు, గనుల యజమానులకున్నూ శ్రమతో కూడిన లాభయోగము. పోలీసుశాఖవారికి మేలుకాలము. 2, 3 ప్రసాదము, బదిలీ. 4, 5 ధనయోగము.

*** చిత్త [పే, పో, రా, రీ] ***

ఈ వారము మీ పలుకుబడివల్ల కార్యసిద్ధిని పొందుతారు. ఆర్థికస్థితి బాగుంటుంది. నూతన మిత్రలాభము కలుగుతుంది. ఉద్యోగస్తులకు అధికారుల ఆదరణ లభిస్తుంది. మంచి ఉత్తరములు వస్తవి. డాక్టర్లకు, గణితశాస్త్రజ్ఞులకూ, కవులకూ, శిల్పులకూ, నటీనటులకూ యోగకాలము. వస్త్రములు, ఇత్తడి, కంచువర్తకులకూ యోగకాలము. 30, 31, 1 కార్యానుకూలత, ధనయోగము, విద్యాగోష్ఠి. 2, 3 అధికఖర్చులు, బద్ధకము. 4, 5 మంచి వార్తలు, అధికారుల ఆదరణ. విద్యార్థులకు అనుకూలము కవులు నూతన రచనలు ప్రారంభిస్తారు

*** స్వాతి [రూ, రే, రో, తా] ***

ఈ వారము దేవబ్రాహ్మణభక్తి, పుణ్యక్షేత్ర సంచారము, ధనలాభము, పుణ్యకార్యాచరణ, పుత్రసాప్తి సూచనలు, గృహమందు శుభకార్యాలోచనలు జరుగుట, బిరుదులుపొందుట, ఆకస్మిక ప్రభుసన్మానము, సుఖజీవనము, వైద్య, జ్యోతిష శాస్త్ర ప్రసంగములు, ఘనకార్య ప్రయత్నములు వంటి రాజయోగములు కలుగుతవి. విద్యార్థులు కొత్త సంగతులు తెలుసుకుంటారు; ఉపాధ్యాయులకు, పండితులకు, న్యాయవాదులకూ, న్యాయస్థానములలో ఉద్యోగస్తులకూ యోగకాలము.

*** విశాఖ [తీ, తూ, తే, తో] ***

ఈ వారము మీకు తలచిన కార్యములలో జయము, నీటిమీద ప్రయాణము, తెల్లనివస్తువులు కొనుట, వినోదములలో పాల్గొనుట, దధి, క్షీర, మధురపదార్థయుక్త సుభోజనము వెండిపాత్రలతో చేయుటవంటి యోగములు కలుగును. విద్యార్థులకు మేలుగావుంటుంది. ప్రత్తి, దూది నూలు, తెల్లనివస్త్రములు, వెండి, బియ్యము ద్రవపదార్థ వస్తువుల క్రయవిక్రయములవల్ల వర్తకులకు లాభము. కవులకు, గాయకులకు, నటీనటులకు యోగకాలము. వారమంతయూ శుభయోగములున్నా మానసికాందోళనతో 2, 3 తేదీలు కూడియుంటుంది.

*** అనూరాధ [నా, నీ, నూ, నే] ***

ఈ వారము ఇష్టవస్తులాభము, వివాహాది శుభకార్యాలోచన, కృషిమూలకముగా లాభము, ధనధాన్యవృద్ధి, పశుసంపద, పరోపకారమువల్ల కీర్తి, ప్రభుత్వ కార్యనిర్వహణవల్ల గౌరవమువంటి రాజయోగములు కలుగుతవి. విద్యార్థులకు మేలుగావుంటుంది. ఖరీదైన వస్తువుల క్రయవిక్రయములలో వర్తకులకు లాభయోగము. కవులకు, గాయకు

---

**—ధరలు:—**

నూలు, వస్త్రములు: మందముగా వుండును.

నూనె దినుసులు: నిలబాటుగా వుండును.

బెల్లము, పచందార, చింతపండు: మార్పు లేదు.

ఆహార ధాన్యములు: మందమగును.

పప్పుదినుసులు: నిలబాటుగా వుండును.

వెండి, బంగారము: క్రమముగా మందముగా వుండును.

అంతటా సాధారణముగా వర్తించును.

*　　　*　　　*

జన్మనక్షత్రము బట్టిగాని, జన్మనక్షత్రము తెలియనివారు నామనక్షత్రము (వారి వారి పేర ననుసరించి పేరు మొదటి యక్షరము)ను బట్టిగాని ఫలితాలు తెలుసుకొనునది కృష్ణుడను పేరునకు మృగశిరా నక్షత్రమున్నూ, హృషుడను పేరునకు స్వాతియూ, శ్రీధరుడను పేరునకు చిత్తయును, క్షేత్రపాలుడనే పేరునకు హస్తయును, భీముడు, భైరవుడు అనే పేర్లకు పూర్వాషాఢయును చూచుకొనునది.

లకు, కళాకారులకు, నటీనటులకు యోగ కాలము. 2, 3, తేదీలలో కుటుంబకలతలు. 4, 5 తేదీలలో ధనయోగము.

### *జ్యేష్ఠ [నో, యా, యీ, యూ]*

ఈ వారము మీకు రాబడి తక్కువ. కార్యభారము ఎక్కువ. గృహావసరములు తీరనందునకలతలు. ఆరోగ్యం చెడుచున్నట్లు సూచనలు కనబడగానే గ్రహరాజైన రవికి శాంతిచేయించుట, ఔషధ చికిత్సను పొందుట మేలు. ఉద్యోగస్థులకు క్రొత్త సమస్యలు వర్తకులకు ఆందోళన. విద్యార్థులకు మంచికాలము కాదు. 30, 31, 1 తేదీలలో ఆటంకములు. కార్యభంగము, శ్రమ కలిగిననూ, పితృవరమునుండి సహాయము, కార్యలాభముకూడా వుంటవి. 2, 3 తేదీలలో అనారోగ్యము. 4, 5 తేదీలలో లాభయోగము.

### * మూల [యే, యో, బా, బీ] *

ఈ వారము నిలకడలేని ఆలోచనలతో యేపని చెయ్యలేకపోతారు. ధనలోపమువల్ల యిబ్బంది. శ్రమపడినప్పటికీ మాటదక్కదు. గృహమందున్న వృద్ధుల అనారోగ్యము ఆందోళన కలిగిస్తుంది. ఆకస్మికముగా కలుసుకున్న మిత్రుని సహాయమువల్ల చిక్కులు తొలగి ఫలసిద్ధి కలుగుతుంది. ప్రయాణము చేయవలసి వస్తుంది. అందువల్ల వర్తకులకు లాభము ఉద్యోగస్తులకు బదిలీఅయే భయము కలుగుతుంది. విద్యార్థులకు మంచి కాలము కాదు 30, 31, 1 ప్రయాణము విదేశీయుల పరిచయము. విచిత్ర వస్తు సంపాదన. 2, 3 ఆప్తుల అనారోగ్యము. 4, 5 మిత్రదర్శనము, కార్యలాభము.

### *పూర్వాషాఢ [బూ, ధ, భా, డా]*

ఈ వారము మీకు మిశ్రమయోగము. ధనలోపము వుంటుంది. అనుకున్నటుగా పనులు జరగవు. కోరిన సహాయము లభించదు. అవసరములు తీరక ఆందోళన కలుగుతుంది. దైవముపై భారమువేసి కార్యసాధన ప్రయత్నించి ఫలమును పొందుతారు. వర్తకులకు చాలాకాలమునుండి రాకుండా నిలిచిపోయిన బాకీలు వసూలవుతవి. 30, 31 1 పుణ్యపురుష సాంగత్యము. ఆత్మవికాసము, శాంతి, ధనయోగము. 2, 3 ఇంట్లో వారి అనారోగ్యముచే ఆందోళన. 4, 5 గుప్త ద్రవ్యలాభము. పుణ్యక్షేత్ర దర్శనము, వింత వస్తువులను చూచుట.

### *ఉత్తరాషాఢ [బే, బో, జా, జీ]*

ఈ వారము కార్యభారముచే శ్రమ ఎక్కువ. ఇతరులకొరకు శ్రమపడినను చేసిన ప్రయత్నము ఫలించనందున మాట పడతారు. కోర్టు వ్యవహారములు మీపరము అయినా మరికొన్ని క్రొత్తచిక్కులు తలెత్తుతాయి. భార్యకు ఆరోగ్యము చెడుటవల్ల ఆందోళన కలుగుతుంది. ఉద్యోగస్తులకు బదిలీఅయే సూచన లున్నవి. అపరదినుసులు, ఉప్పు, మినుములు, నువ్వులు, నూనె వ్యాపారస్తులకు లాభయోగము. అన్యజాతి వారివల్ల గౌరవము కలుగుతుంది. 30, 31, 1 శ్రమతోకూడిన కార్యానుకూలత. 2, 3 వివాదములు, నిందలు, ఆరోగ్యచింత. 4, 5 పైవారిచే గౌరవము.

### *శ్రవణము [జూ, జే, జో, ఘా]*

ఈవారము ఎంత ప్రయత్నించినా కార్య సాధనలో అనేక ఆటంకాలు కలుగుతవి. సాహసము, పట్టుదలగలవారగుటచేతను నిరాశ పొందకుండా కలిగిన చిక్కులను విప్పుకొని మేలు పొందుతారు సోదర సహాయమువల్ల ఒడిదుడుకులు సద్దుకుంటాయి. జాగ్రత్తగా వుండుటవల్ల అవయవములకు దెబ్బలు తగిలే ప్రమాదము తప్పవచ్చును. 30, 31, 1 కార్య భంగము, మనోవ్యథవంటి ప్రతికూలము లున్నా సోదర సహాయము, కార్యానుకూలత కలుగుతవి. 2, 3 ప్రమాదము. 4, 5 ధన యోగము, కార్యసాధన. రసాయనఎరువులు, ఖనిజములు, లోహముల వ్యాపారస్తులకు లాభయోగం.

### * ధనిష్ఠ [గా, గీ, గూ గే] *

ఈవారము మీకూ యోగదాయకము. యుక్తిగా యత్నకార్యములను సాధిస్తారు జ్ఞాతులవల్ల ధనసహాయము, అధికారులవల్ల కార్యసహాయము కలుగుతవి. క్రొత్తవారితో పరిచయ లాభము, ధనయోగము. ఈశాన్య దిక్కునుండి మంచివార్త తెలియును. విద్యార్థులకు అనుకూలము జ్యోతిష శాస్త్రజ్ఞులకు, గణితశాస్త్రజ్ఞులకు, డాక్టరుకు, కవులకు, శిల్పులకు, నటీనటులకు యోగ కాలము. 30, 31, 1 ధనలాభము, కార్య సిద్ధి, మిత్రలాభము, మంచివార్త. 2, 3 అనుకోని ఖర్చులు, ఆందోళన. 4, 5 ఉద్యోగస్తులకు ప్రమోషనువంటి అనుకూల పరిస్థితి. కవులు నూతన రచనలు మొదలుపెడతారు.

### * శతభిషం [గో, సా, సీ, సూ] *

ఈవారము మీకు యోగప్రదం. గత వారము అవకుండా నిలిచిపోయిన పనులు ఈవారము సుముఖమవుతాయి. అధికార ములో ధనాదాయముకూడా పెరుగుతుంది. బిరుదులు పొందుట, సన్మానములు కలుగుట వంటి రాజయోగములు కలుగుతవి. పండిత గోష్ఠి, నూతన గ్రంథపఠనముచే విజ్ఞాన వృద్ధి అవుతవి. 30, 31, 1 ధనలాభము, కార్యాను కూలత, సంతానమునకు క్షేమాభివృద్ధి. 2, 3 నిలకడలేనిస్థితి 4, 5 పండితగోష్ఠి, సన్మానము. ఉపాధ్యాయులకు, పండితులకు, న్యాయవాదులకు వారమంతా యోగ కాలము.

### *పూర్వాభాద్ర [సే, సో, దా, దీ]*

ఈవారము అన్ని రంగములలోనూ మీరు చేసే ప్రయత్నాలు అనుకూలముగా కొన సాగుతవి. ఆదాయము ఎక్కువవుతుంది. ఇంట్లోవారి ఆరోగ్యము బాగుపడుతుంది. దక్షిణదిక్కునుండి మంచివార్త వింటారు. కవితాగోష్ఠి, గానసభలు మున్నగు వినోదములలో పాల్గొంటారు. నీటిపై ప్రయాణం చేయవలసి వుంటుంది. విద్యార్థులకు మేలు కాలము. దధి, క్షీర, మధుర పదార్థయుక్త సుఖభోజనము చేస్తారు. బియ్యము, నూలు, బట్టలు, వెండి వ్యాపారస్తులకు లాభము. 30, 31, 1 ధనలాభము, కార్యసిద్ధి. 2, 3, మానసికాందోళన, ఖర్చులు ఎక్కువ. 4, 5 విందు, వినోదము. కవులకు, గాయకులకు, నటీనటులకు యోగకాలము.

### * ఉత్తరాభాద్ర [దూ, శం. ఛా, ధా] *

ఈవారము యత్నకార్యములుఫలిస్తాయి. అనుకున్న దానికన్నా ఎక్కువగా ఆదాయం పెరుగుతుంది. దూరప్రయాణం చేయవలసి వుంటుంది. సాంఘిక కార్యములలో కీర్తి గొంటారు. శుభకార్యాలోచనలు చేస్తారు. బంధుమిత్రులతోనూ, స్త్రీలతోనూ, విందు వినోదము. విద్యార్థులకు అనుకూలము. వర్తకులకు విలువగల వస్తువుల క్రయవిక్రయములలో లాభము. కవులకు, గాయకులకు, కళాకారులకు నటీనటులకు యోగకాలము, 30, 31, 1 ప్రయాణము, ధనలాభము, కార్యసిద్ధి. 2, 3 అధిక ఖర్చులు. 4, 5 సన్మానము, విందు, వినోదము, అలంకార ప్రాప్తి.

### * రేవతి [దే, దో, చా, చీ] *

ఈవారము కార్యభారము ఎక్కువ. రాజవార్తా ప్రసంగములు, వింత మాటలు వినుట, పరాక్రమమువల్ల ఘనత, ధనలాభము ప్రయాణము వుంటాయి. అకాల భోజనము వల్ల వేడిచేసి కడుపునొప్పి నేత్రపీడ, బల హీనత వంటి సూచనలు కనబడగానే ఔషధ చికిత్సపొందుట మేలు. ఉద్యోగస్థులకు బదిలీయగుటగాని ఒత్తిడికి తట్టుకోలేక సెలవు పెట్టుటగాని జరుగును. విద్యార్థులకుబద్ధకము. 30, 31, 1 ప్రయాణము, ఘనత ధనలాభము కార్యానుకూలత. 2, 3 అనారోగ్యము, బదిలీ సూచన. 4, 5 అనుకూలయోగము. ★

# వనితాలోకం

"ఫస్టు", తారీఖుకోసం ఎంతమంది వేచి వుంటాం ముఖ్యంగా మధ్య తరగతికి చెందిన ఉద్యోగస్తులందరూ ఈ సుదినం కోసం ఎదురుచూస్తూంటారు ముందు నెల 20 వ తారీఖునుండే దినాలు భారంగా గడుస్తుంటాయి ఇంట్లో నెలకని తెచ్చిన సరకులు నిండుకొని ఉంటాయి కానీ చేతిలో పైసాలు ఉండవు "ఫస్టు" రాగానే 'అమ్మయ్య' అని నిట్టూర్చి, జేబులు నింపుకొని ఇండ్లకు వస్తారు, కానీ, మళ్లా 20 వ తేదికే (కొన్నిసార్లు 15 కే) ఫస్టుకోసం చింత!

మధ్య తరగతి కుటుంబాల్లో వచ్చిన కొద్ది ఆదాయాన్ని వ్యయం చేయడం, జీతం వచ్చే వరకు అప్పులు లేకుండా సాగించడం పెద్ద సమస్య. ఎంత ఖర్చులు తగించుకొన్నా నెలాఖరుకు కష్టపడాల్సొస్తుంది నెల మొదట్నుంచీ జాగ్రత్తగా ఉంటే చివరి రోజుల్లో చింత ఉండదు ఇలా మాటల్లో చెప్పడం సులువే కాని తీరా మనం నెలాఖరుకు చూస్తే, 20 వ తేదీకి ఏ రెండు వెండినాణెములో మిగిలి ఉంటాయి

కొందరు ఇంటి ఖర్చులకై భార్యలకు కొంతమాత్రం ఇచ్చి మిగిలిన డబ్బు ఏ సేవింగ్సు బ్యాంకులోనో వేస్తారు 'ఇంతలో సర్దుకోడానికి ప్రయత్నించు, సరిపోకపోతే చూద్దాం' అని భార్యలతో చెప్పొచ్చు. డబ్బు కావల్సొస్తే 'డ్రా' చేసికోవచ్చు ఫ్రెండ్ల చుట్టూ బిక్క మొఖం వేసుకొని తిరక్కుండా

ఒకావిడ ప్రతినెల చివర తప్పకుండ అప్పుకోసం ప్రత్యక్షమౌతుంది నెలచివర తీసుకోవడం. మొదట్లో ఇచ్చేయడం ఆవిడ కలవాటైంది అభిమానం ఉన్నావిడ కాబట్టి అడుగకముందే ఇచ్చేస్తుంటుంది కాని ఏ ఒక నెలైనా 'ఈ నెల అప్పులు లేకుండా సర్దుకోవాలి' అని నిర్ధారణ చేసికోదను కుంటాను. అప్పుడప్పుడు చెప్తుంటుంది, వాళ్ళ ముసలి అత్తగారిక్కి, పట్నంలో చదువుకొంటూన్న కొడుక్కి డబ్బు పంపిస్తూండాలని ఒ విధవ ఆడబడుచు సహాయం కోర్తూంటుందని, రెండవ కొడుకు పని దొరక్క తిరుగుతున్నాడని, ఇవి కాకుండా ఆవిడ చేయికూడా పెద్దదే అనవసరమైన ఖర్చులు చేస్తుందనిపిస్తుంది నాలుగణాలతో పోయేది ఎనిమిదణాలు వ్యయం చేస్తేగాని ఆవిడకు తృప్తి ఉండదు పొదుపుగా ఉండాలని కొంచెమైనా ప్రయత్నించదను కొంటాను

---

'శ్యామలా దేవి'

(మాచెర్ల)

---

కొందరున్నారు, నెల మొదట్లో, వచ్చిన ప్రతి సినీమాకి హాజరవటం, దారినపోయే ప్రతీ బట్టలమ్మకునే వాడినీ పిలవడం వీరి చెడ్డ అలవాట్లు. నెలమొదట్లో కోరికలు కొంచెం అదుపులో పెట్టుకొంటే నెలాఖరు కూడా సవ్యంగా సాగిపోతుంది ఎనభై రూపాయల జీతగాడైనా నెలకో ఐదు రూపాయిలు కష్టపడిదాస్తే (బ్యాంకులో) అవసరానికి అప్పు అడక్కుండా సరిపోతుంది ఇలా చేయడంలో భార్యాభర్త లిద్దరూ శ్రద్ధవహించాలి ఒక్కరే ప్రయాసపడడం వ్యర్థం ఇంట్లో ఖర్చు లెక్కువ కాకుండా భార్య చూసుకొంటేటప్పుడు భర్తతనయిష్టం వచ్చినట్లు సిగరెట్లకి అనవసరసమయాల్లో కాఫీలకు డబ్బు తగలెయ్యకూడదు భర్తకి పేపర్లు చదివాలని అభిలాషఉంటే, దానిని జాగ్రత్తచేసి పేపరు కొనేవాడి కమ్మడం భార్యవిధి, ఇది ఆమె గమనించాలి ఒక నెలపేపర్లు 2-8-0 రూ లకు అమ్ముడు పోయాయని చెప్పటం భార్యకు తృప్తినీ, భర్తకు సంతోషాన్ని కలిగిస్తుంది తాను ఏ వుద్యోగం చేసి సంపాయించక పోయినా ఈ పేపర్లపై రాబడి అంతా తన సంపాదన అనే గర్విస్తుంది భార్య.

కాయగూరలు ఇలాంటివి డబ్బున్నప్పుడు వీశెలు వీశెలు కొనకుండా, కుటుంబానికి కావలసినంత, నిర్ణయించే కొనుక్కుంటే అనవసర నష్టాలు తగించుకున్న వారమౌతాము అలాగని కుటుంబాన్ని సరిపోకుండా ఉండేలాగ చెయ్యకూడదు

ఎదిగిన పిల్లలింట్లో ఉన్నప్పుడు వాళ్ళకి కూడా కుటుంబఖర్చులు ఎంతలో ఉండాలో అర్థమయ్యేలా చెయ్యాలి సంసారాల్లోలాగే హాస్టల్సులో ఉన్న విద్యార్థులు కూడా బాధపడ్తూంటారు వాళ్ళవీ చిన్న సంసారాలలాటివే నెల మొదట్లో ఇండ్లనుండి తలిదండ్రులు మనియార్డరులు పంపుతారు కట్టవలసిన ఫీజులు కట్టేసి మొదటి మూడువారాలు దుబారా ఖర్చులుచేసి చివరి వారం అప్పులడగడం కొందరి అలవాటు మధ్యతరగతి కుటుంబాలకు చెందినపిల్లల్కు చిన్నప్పట్నుంచీ ఇంట్లో ఖర్చులు గమనించి వుంటే హాస్టల్సులో కూడా అప్పులడక్కుండా జాగ్రత పడతారు పైచదువులకి పోకుండా ఒక ఇంటి వారైతే ఆ క్రొత్త సంసారాన్ని అప్పులు లేకుండా సాగించడాని కవకాశ ముంటుంది

భర్త యింటిఖర్చులకై యిచ్చిన డబ్బు సరిపొయ్యేలా వాడాలి అప్పుడే అవసర ఖర్చులకు భర్త డబ్బు నిల్వచేయడానిక్కి వీలు చిక్కుతుంది ఆమె పొదుపుతనం భర్త గమనించాలి. ఒక యిల్లాలంటుంది, 'ఇంటి ఖర్చులకు సరిపడ్డ డబ్బుకూడా ఇవ్వరండీ, వారేమో, వారి యింగిషు నవలూను ఒక జేబు పుస్తకాలు కొనేయడం, స్నేహితుల దానం చేయడం'. ఇంకో ఆయనున్నారు వాళ్ళకు రూ 300 లు అప్పుందని తెలిసీ కూడా అతని భార్య రూ 150 పెట్టి ఒకనగ చేయించుకుందని బొత్తిగ తన బాధ్యతను గుర్తించలేని మనిషని నాదగ్గిర విచారిస్తూంటారు ఇలా కాకుండా ఇద్దరి ప్రయత్నాలు వుంటేనే అప్పులేకుండా నెలాఖర్లు వస్తాయి

నేనూ బి ఏ చదివాను కానీ ఏం ప్రయోజనం? అని నిస్పృహ చెందావు నీ అభిప్రాయం అర్థం చేసుకున్నాను కానీ ఏకీభవించటంలేను వ్యతిరేకిస్తున్నాను.

ఆడదాని చదువుకు సార్థకత లేదని నీకు బాగా అనుభవమైందా? లేదు అది నీ మనస్తత్వం ప్రతీ జీవితంలోనూ ప్రతీక్షణం ఏవో సంఘటనలు జరుగుతూనే వుంటాయి అటువంటి సంఘటన లెంతో అమోఘమైనవైతే, వాటికి కించిత్తు విలువివ్వటంలో అర్థముంది కానీ నీ అనుభవాలు అతి సహజమైనవి నీ చదువును గురించి గానీ, నీ గురించి గానీ ఎప్పుడూ ఎవ్వరూ ఏమీ అడగలేదు నీకు డిగ్రీవుందనే విలువివ్వలేదు అసలు నువ్వు చదివావనే ఎవ్వరూ పట్టించుకోవటం లేదు అందుకే నీ ప్రాణం చివుక్కుమంటుంది ఎదటివాళ్లు నీ చదువునీ, నిన్నూ గౌరవించటం లేదనే బాధలో "ప్రయోజనం లేని డిగ్రీ లేకుంటే మాత్రం ఏం?" అని నీభావం అంతా నీ సంసారం గురించీ, భర్త హోదానీ, పిల్లా పాపనీ అడుగుతారు చదువులేని ఆడదాన్నడిగినట్టు నన్నూ యివే అడిగి వూరుకోవాలా? అని నువ్వు మథనపడతావు కానీ యింత చదివి కూడా మన సంప్రదాయాలూ, వాతావరణం అర్థం చేసుకోలేక అసలు విషయానికే ఎసరుపెట్టటం చిత్రంగావుంది

ఇప్పటివరకూ, యిప్పుడుకూడా మనలో చదువుకున్న ఆడవాళ్లు కొన్నే! క్రిందటి మన పెద్దల హయాంలో అసలు నాస్తి అందుకే నువ్వేం చదువుకున్నావని ఆడదాన్నడిగే అలవాటు మనలో లేదు ఇప్పుడిప్పుడే యువతు లెవ్వరైనా తారసపడితే చదువు విషయం సంప్రదించాల్సిన అవసరాలు అవకాశాలు వస్తున్నాయి రాను రాను తప్పనిసరీ, అలవాటూ కూడా ఔతుంది అంటే మనం యిప్పుడిప్పుడే కొత్త ప్రపంచంలోకి వస్తున్నామన్నమాట అందుకే లోకం మనకేసి ఆలస్యంగా చూస్తుంది మగవాళ్లలా కాదు ఆదినుంచీ వాళ్ల స్థాయే వేరు మగవాడికి చదువు, హోదావుంటే బావుంటుందనీ, వుండితీరాలనీ లోకం ఏనాడో గుర్తించింది ఈ నాటికీ, గౌరవిస్తోంది కాని యికమీదట యిద్దర్నీ గౌరవిస్తుంది

అసలు చదువనేకళకి విలువుందని అంగీకరిసావా? పుట్టినవ్యక్తి పుట్టనట్టే చలనం లేకుండా అక్షరజ్ఞానం తెలీకుండా మోడులా వుంటే ఎలావుంటుందీ? ఐదేళ్ళు నిండి అక్షరాభ్యాసం చేసుకుని స్కూల్లోనూ, కాలేజీలోనూ విద్య నేర్చుకుని డిగ్రీ పొందితే ఎలావుంటుంది? ఏమిటీ తేడా? ఇద్దరూ మనుషులే శారీరకంగా యిద్దరూ ఒకటే. కానీ మానసికంగా వాళ్ళలో వూహించలేని, అమోఘమైన, చిత్రమైన తేడా ఒకడు రాయి ఒకడు రత్నం—ఒకడు మోడు—మరొకడు చిగురు! ఎందుకని? మొదటి వ్యక్తికి అత్యల్పమైన జ్ఞానం వికసించే అవకాశాలు లేక వికసించక స్థాణువులా వుండిపోయింది పుట్టినప్పుడిద్దరూ సమానమేఐనా రెండో వ్యక్తిజ్ఞానం అమోఘం. ఆ మెదడు ప్రతీక్షణం ప్రకృతిరహస్యాలని ఛేదించాలనే యోచిస్తుంది ఇదే ఇద్దరు వ్యక్తుల్లో చదువుచూపించే తేడా—మంచులాంటి సహజమైన జ్ఞానంమీద సూర్యకిరణంలా పనిచేస్తుంది చదువు.

ఇంతవిలువైన చదువు నేర్చుకుని విజ్ఞానం సంపాదించటానికి స్త్రీ పురుష భేదాలెంచటం అవివేకం మొగవాడేం నేర్చుకుంటాడో ఆడదనే నేర్చుకుంటుంది మాట వరసకి రేడియో ఎలా పనిచేస్తుందో మొగవాడే తెలుసుకుంటే బావుంటుందీ గానీ ఆడదేం తెలుసుకోవాలి? ఎందుకూ? అనటం ఎంత సమంజసమో జ్ఞానోపార్జనకి స్త్రీ పురుష భేదాలెంచటం అంత సమంజసం చదువుల తల్లి సరస్వతి ఆడది సాధారణంగా విద్యార్థినికుండే చురుకు, తెలివి విద్యార్థికుండదు కారణం తెలీదు కాని నిజమంతే

నీ అభిప్రాయం "ఆడదివుంటే ఏం లాభం? డబ్బుదండగే గానీ, వుద్యోగం చేస్తుందా? సార్థకం చేసుకుంటుందా? కనీసం ఎవరైనా అడగనే అడగరే!" అని ఇలా చాలామంది అంటారు అలవాటు చేసుకున్నారు

కానీ ప్రభావతీ! చదువుకి గమ్యస్థానం వుద్యోగం కాదు విజ్ఞానం మొగవాడైనా చదువుకున్నంత మాత్రాన వుద్యోగం చేసి తీరాలనే నియమమేమీ లేదు సంసారం పోషించుకోగలగటానికి, డబ్బు సంపాదించటానికి వుద్యోగం చెయ్యాలి ఉద్యోగం చెయ్యాలంటే అర్హత (డిగ్రీ) వుండాలి డిగ్రీవున్నవాడవసరమైతే (ఆ అవసరం డబ్బుకోసం కావొచ్చు కేవలం కాలక్షేపంకోసం కావొచ్చు లేదా హోదా మీద మోజు కావొచ్చు ఏదోఒకటి) వుద్యోగం చేస్తాడు అవసరమే లేకపోతే వుద్యోగం ఎందుకు?

ఇదే ఒరవడిలో చూస్తే అవసరమున్న ఆడది వుద్యోగంచేస్తుంది లేనిది వూరుకుంటుంది బహుశా యివ్వాళ లేని అవసరం రేపు రావొచ్చు రేపు వుద్యోగంచెయ్యందే గడవకపోవచ్చు అప్పుడు డిగ్రీ ఎక్కణ్ణుంచి వస్తుంది? మానవజీవితం, దినదినగండం నూరేళ్ళాయుష్షు మనపరిస్థితి నిశ్చలంగా వుంటుందని గ్యారంటీవుందా?

ఆడదాని చదువుకు సార్థకతేమిటీ? అంటావు అదే నాకు నచ్చదు అసలు చదువుకి సార్థకత ఉద్యోగం కాదని మరోసారి చెప్తున్నాను మొగవాడి చదువు సార్థకమౌతోందా? లేదు కాలేజీల్లో నేర్చుకునే దానికీ, వుద్యోగంలో చేయాల్సిన పనికీ ఎక్కడా సంబంధం వుండదు డాక్టరీ, ప్లీడరీ, ఇంజనీరింగులాంటి కొన్ని విద్యలే నిజంగా సార్థకమౌతున్నాయి కానీ ప్రతి డిగ్రీ సార్థకం కావటంలేదు అందుకని ఆ డిగ్రీయే అనవసరమంటామా? విజ్ఞానం సంపాదించారు అంతేచాలు

నీలాటి విద్యార్థినులు ఎందరో ఉద్యోగాలు చేస్తున్నారు ఇంకెందరో చెయ్యటం లేదు ఎందుకని? ఇద్దరు పిల్లల్ని ఎవరు చూస్తారు? వంటెవరుచేస్తారు? సంసారానికి లక్ష పనులుంటాయి ఇల్లాలు ఆఫీసులో కూర్చుంటే యిల్లెవరు చక్కబెడతారు? సాయంత్రం అలసిపోయివచ్చే భర్తకెవరెదురొస్తారు చిర్నవ్వుతో? భార్యాభర్తలు తలోదారిపోతే, సాయంత్రం యింటికొచ్చే వేళకి యిల్లు బోసిగా లేదా గందరగోళంగా మాలపల్లిలా వుంటుంది అందుకే ఇల్లాలు ఇంటిలో వుండి ఇల్లు చక్కబెట్టుకుంటుంది నివురుగప్పిన నిప్పులా, స్త్రీత్వం పుణికిపుచ్చుకుని, గ్రాడ్యుయేటయినాకూడా గృహిణిగావుండిపోతుంది హైహీల్సు టకటకలాడించుకుంటూ, హేండ్ బాగ్ గిరగిరాతిప్పుతూ, జారిపోయే పైటని సర్దుకోకుండా, నడివీధిలో హేండ్ బాగ్ తెరిచి లిప్ స్టిక్ సరిచేసుకుంటూ తిరిగితేనేనా విద్యకి సార్థకత? సంపాదించిన విజ్ఞానం మెరుగు వేసుకుంటూ కుటుంబం సరిదిద్దుకోవటంలో, భర్తకి అనుకూలగా వుండటంలో, పిల్లల్ని సౌభాగ్యులుగా పెంచుకోటంలో లేదా విద్యకి సార్థకత? అసలు ఆడది వుద్యోగం చెయ్యటం తప్పుకాదు అది వాళ్ళ అవసరాలమీద ఆధారపడివుంటుంది ఇటు యింట్లోనైనా, అటు ఆఫీసులోనైనా పోకిళ్లుపోకుండా అందంగా డ్యూటీ నిర్వహించుకోవటంలోనే వుంది గౌరవం.

# ★ ప్రియమైన ప్రభావతీ! ★

అవసరం లేని ఆడవాళ్లుకూడా వుద్యోగం చెయ్యాల్సిన అవసరం రావాలని కోరుకో కూడదు. గృహిణిగానే తన చదువు విని యోగించుకోవాల్సిన అవసరాలు కొల్లలు కొల్లలు. మొట్టమొదటిది భర్త ముచ్చట తీర్చటం. ధవాళిలో పడిపోయి, మనసు పోరు పెడుతున్నా, అదమాయించి, వేల కట్నాలతో ముక్కలుగొలైనా చూసి ఎరగని అమ్మాయిల్ని పెద్ద పెద్ద వుద్యోగస్థులూ, విద్యావంతులూ పెళ్ళయితే చేసుకొంటున్నారుగానీ, ఆ తర్వాత తన సర్దాలకి తగినది కాదని అసంతృప్తిగా ఫీలవటం జరుగుతుంది. రెండు సంగతులు చెప్తాను. ఓసారి మా బంధువు లమ్మాయికి భర్త వుత్తరం రాశాడు. ఆవిడ కోరికతో ఆ వుత్తరం నేను చూడాల్సివచ్చింది. అందులో ఒకచోట: "నువ్వింత తెలివి తక్కువదాని వనుకోలేదు. ఎంతో సర్దాతో, ఆశతో నీ కెన్నో విషయాలు రాస్తున్నాను. సరిగ్గా జవాబివ్వటం తెలీదు. నాలుగు నెల్లకో చీటీ రాస్తావు లక్ష తప్పుల్తో. ముచ్చటగా వుత్తరం రాయటం నీకు చేతగాదంటే నాకెంతో బాధగావుంది. ఎంతరాసినా అర్థం చేసుకోవు" ఇలా ఎంతో అసంతృప్తిగా, విరక్తిగా నడిచిందా వుత్తరం. నిజంగా నాకు మాత్రం అతనిమీద కసితీరినట్టయింది. ఏం? అంత ముచ్చట పడేవాడు స్వల్ప కట్నంతో సర్దా తీర్చే అమ్మాయిని చేసుకో లేకపోయాడా? చదువుకోనిదని తెలిసి కూడా రూపాయ కాసుల కాశపడి, ఈ నాడా అమ్మాయిని సతాయించటం దేనికి? కానీ ఆ అమ్మాయికే చదువుంటే అతని సర్దా తీరేదికాదా? – ఇంకోవిషయం. ఓ ఇంజనీర్ పెళ్ళికిముందు ఒక షరతుపెట్టాడు. ఏమని? "మా అమ్మాయి నేను చెప్పినట్టు వినాలి. క్లబ్బుకి రమ్మంటాను. షికారుకి రమ్మంటాను. సినిమాలకి తీసికెళ్తాను. ఏమీ సిగ్గుండకూడదు. వుత్తరాలు రాస్తుండాలి. సోషల్ గా మాట్లాడాలి" ఈ విధమైన షరతు అమ్మాయి తరుపు వాళ్లంగీకరించారు" ఓ నువ్వు రావొద్దన్న చోటికి కూడా వస్తుంది" అని చెప్పి పెళ్ళిచేశారు. తర్వాత ఎక్కడెక్కడికి తీసివెళ్తున్నాడో నాకు తెలీదుకే. కానీ చాలామంది చదువుకున్నా విచ్చలవిడిగా తిరగటం అసహ్యించుకుంటారు. ఇక చదువుకోని ఆ అమ్మాయి భర్త చెప్పినట్టు విన్నప్పటికీ ఏదో డ్యూటీ నిర్వర్తించినట్టే వుంటుందిగానీ, షరతుల ద్వారా ప్రీతిగా ఎలావుండగలుగుతుంది? ఇంగ్లీషు పిక్చర్ కెళ్దాం" రమ్మంటాడు. తప్పనిసరిగా వెళ్తుందిగానీ ఏం లాభం? ఇద్దరికీ సుఖం లేదు. డబ్బుకోసం కోర్కెల్ని చంపుకుంటారుగానీ, చదువుకున్నవాడు, చదువుకున్నదాన్నే పెళ్లాడితే బావుండేదని మథనపడతాడు. ఒకబ్బాయి ఎన్ని విషయాలు చెప్పినా ఎదటి వాళ్ళకే చెప్తాడు కానీ యింట్లో భార్యతో మనసిచ్చి మాటాడడు" వినేక చస్తున్నా నాకే చెప్పక పోతే మా ఆవిడికి చెప్పకోరాదూ?" అని సర్దాకి విసుక్కుంటే "దానికి చెప్పి లాభం లేదు అర్థం చేసుకోదు" అంటాడు సీరియస్ గా. మొగవాళ్లు భార్యలు తమకితగ్గవాళ్ళు కారని ఏ క్షణం అనుకుంటారో, ఆ క్షణంనుంచే కలిసీ మెలిసీ వుండలేక పోతారు. స్త్రీ చదువుకి ముఖ్యమైన సార్థకత యిది.

కుటుంబ సంరక్షణా, పిల్లల పెంపకం లాంటి గృహవిషయాలూ, బతుకుదెరువూ, యిరుగూ పొరుగూలాంటి బయట పదిమందితో మెలిగే తీరులో విద్యావంతురాలికీ విద్యాహీనురాలికీ తేడా వుంటుంది. చదువులేని వాళ్ళు సంసారాలు చేసుకోటం లేదా? అనకు. ఓ సంగతి. ఒకావిడ కొడుకేం చెప్పినా వినేస్తుంది "ఇన్స్పెక్టర్ గారొస్తున్నారు. ఆయనకి విందుచేసాం. అరరూపాయి తెమ్మన్నారు" లేదా "గ్రూఫ్ ఫోటో తీయించుకుంటున్నాం" (ఎప్పుడుపడితే అప్పుడే) కొత్త పుస్తకం కొనక్కోవాలి. (పరీక్షల్లో కూడా) ఇలా తరుచు ఏదోవంక పెట్టి అరా, పావలాతీసుకు పోతూంటాడు. అస్తమానూ ఇన్స్పెక్టర్ కి విందు చెయ్యాలనీ, ఎప్పుడుపడితే అప్పుడు ఫోటోలుతీయించుకోవాలనీ, పరీక్షల్లో పుస్తకాలుకొనక్కోవాలనీ, ఆవిడకి తెలీ. చెప్పగానే నమ్మేస్తుంది. ఇలాంటివే యింటా బయటా ఎన్నో గొడవలెదురౌతాయి. కానీ విద్యావంతురాలైతే అలా బోల్తాపడదు. ఇదే ఆడదాని విద్యకి సార్థకత. భర్తని సంతృప్తి పర్చి తెలివిగా సంసారం చేసుకోటంకంటే మరేం ప్రయోజనం కావాలి? కావాలంటే డిగ్రీ రెడీగా వుంటుంది.

ఇక ఎవరూ అడగరే! అన్నది నీ వెర్రిగానీ మరేంగాదు. మనని గురించి ఎదటివాళ్ళెందుకడగాలి? నువ్వెంతమంది ఆడవాళ్ళనడిగావు? అసలు అడక్కూడదు. జనం కిటకిటలాడే రైలుపెట్లో కూర్చుని వున్నప్పుడు ఎవరైనా అడిగితే నువ్వుగాబట్టి గర్వంగా "బి. ఎ." అంటావు మరి డిగ్రీ లేనివాళ్ళేం చెప్పుకుంటారు? లేదని చెప్పటానికెంత సిగ్గుపడతారో ఆలోచించావా? అడగటమంటూవస్తే నిన్నేగాదు ఆడవాళ్ళందరికీ ఆ ప్రశ్న ఎక్కడో ఓ చోట ఎదురౌతుంది. కానీ గర్వంగా చెప్పుకోగలిగేవాళ్ళు కొంతమంది. సదా ఎదటి వాళ్ళకి తన గొప్ప చెప్పుకోవాలనే తాపత్రయం దేనికి? అందుకే ఆ ప్రశ్న అడక్కూడదు.

"చూశావా? మీతోటి వనితే ఆడచదువులనవసరమంది." అని మగవాళ్ళడుగుతూంటే నీ తొందరపాటుకి నాకు కోపంవచ్చింది. చదువులోకి దిగినప్పుడు నాన్నగారు చెప్తున్నా చదువుకేం సార్థకతవుందనుకుని చదివావు? కానీ ఆవూహే నేడు నిరర్థకమై పోయిందా? ఆర్థికంగా సాయపడలేక పోతున్నావా? నీకా అవసరం లేదు. అందుకే ఉద్యోగం చెయ్యటంలేదు. ఐనా నామా

(55 వ పేజీ చూడండి)




## మైసూరుబోండా

వినుకొండ ఒక సోదరి బోండాలు, వడలు మొదలైనవి చమురు పీల్చకుండా ఉండేటందుకు సుళువులు చెప్పమని కోరారు. దానికి ఒక సోదరీమణి పిండి పలుచనయితే చమురు పీల్చుతుందని చెప్పారు. కాని అంత మాత్రానికి చమురు అంతగా పీల్చవు. పిండి రుబ్బి ఏ మాత్రం నిలవఉంచి పిండివంట చేసినా, చమురు తప్పక పీల్చుతుంది. ఇంకొకటి రుబ్బినపిండిలో సోడా వేస్తేకూడా చమురు ఎక్కువగా పీల్చుతుంది. అయితే సోడా వేస్తే పిండివంట మెత్తగా మృదువుగా గుల్లవిచ్చి నోట్లో వేసుకుంటే నే కరిగిపోతుంది.

ఈ సోదరే మైసూరుబోండా చేసేవిధం తెలుపమని అడిగారు. ఇంతవరకు ఎవరూ చెప్పలేదు. కనుక నేను తెలిసినమాదిరి చెపుతాను. వేయించిన శెనగపప్పు ఓ పావు తీసుకొని బాగుచేసి మెత్తగా దంచి పిండిజల్లెడలో జల్లించి, ఒక ప్రక్క ఉంచి, ఓ పావు తాజా పచ్చిశెనగపిండి తీసుకొని జల్లించి, యీ పిండీ, ఆ పిండీ కలిపి ఒక స్టీలు పాత్రలో వేసి తగినంత టేబుల్ సాల్టుకూడ వేసి పెద్దనిమ్మకాయంత తాజావెన్న గాని, అంతే వెన్న కాచిన నెయ్యి (మరగబెట్టినది) వేడి వేడిది, యీ పిండిలో వేసి, కళ కళలాడిన నీటితో ముద్దగ కలిపి మూత పెట్టి మూడు నాలుగు గంటలు నాననిచ్చి అర్ధపావుశేరు ఉల్లిపాయలు, ఎనిమిది పచ్చిమిర్చి సన్నగా తరిగి యీ పిండిలో వేసి ఉండలు లేకుండా బాగా కలిపి గట్టిగా ఉంటే మరికొంచెం వేడి నీళ్ళుపోసి కలిపి, పొయ్యిపై బాణలి పెట్టి చమురు వేసి, కాగనిచ్చి నిమ్మకాయ సైజులో ఉండలు చేసి, కాగే చమురులో వేసి, దోరగా వేగనిచ్చి తీసివెయ్యాలి. బోండాగుల్ల విచ్చాలంటే చిటికెడు సోడా వెయ్యాలి. వెన్న గాని, నెయ్యి గాని లేనివారు, తాజాది దొరకనివారు, అదే కొలత మంచినూనె మరగ కాచి, పిండిమధ్యలో గొయ్యి చేసి, వేడి నూనెపోసి పిండి కలపాలి. అయితే ఈ బోండా నెయ్యి వేసినంతరుచి ఉండదు. బోండా వదుగుఇస్తుందని కొందరు అర్ధ సవాశేరు ఉర్లగడ్డలు మెత్తగా ఉడికించి, తోలు తీసి, మెత్తగా పిసికి పిండిలో కలుపుతారు.

* * *

## ఆకుకూరలు నిల్వచేసే పద్ధతి

ఆకుకూరలు మూడు నాలుగు రోజులు వాడకుండా ఎండకుండా నిలవఉండేపద్ధతి, కరివేపాకు గాని, మిగతా ఆకుకూరలు గాని బాగు చేసి, శుభ్రమైన కళాయిపాత్రలో గాని భరిణలో గాని వేసి గాలి చొరబడకుండా మూత వేసి ఉంచినటయిన, చక్కగా ఆకు వాడకుండా, వాసనపోకుండా ఉంటుంది. నీళ్ళుచల్లితే నిలవ ఉండదా ఏమిటి? అని కొందరు అడిగేరు! నీళ్లుచల్లితే ఒక్కపూటే నిల్వఉంటేది. మరునాటికి ఆకు కుళ్ళిపోతుంది.

కొత్తపల్లి రాజ్యలక్ష్మి
(చిన్నగంజామ్)

## టొమాటోపండ్లతో మురబ్బా

కావలసిన సరుకులు: 1 శేరు టొమాటోలు (80 తులాలు) ½ శేరు పంచదార, (40 తు॥), యాలకులు, జీడిపప్పు, చారపప్పు, గసగసాలు.

ఒక పెద్దగిన్నెనిండా నీళ్ళుపోసి అవి తెరుగుతుండగా, చిన్న స్టీలు గిన్నెలో ఈ టొమాటోలు పెట్టి ఆ నీళ్లగిన్నెలో దించవలెను (లోనికి నీరుపోకుండా) పై గిన్నెకి మూత పెట్టవలెను. బాగా ఉడికిన తర్వాత గిన్నెను దించి ఆ పండ్లను చల్లార్చి పిసికి జల్లెడతో గాని, పల్చని బట్టతో గానీ, రసమును వడబోయవలెను. పంచదారలో ఈ రసముకలిపి అడుగంటకుండా పాకము పట్టవలెను. తీగపాకము (జిలేబీపాకము) లావచ్చిన తరువాత దించి జీడిపప్పు, యాలకులు, చారపప్పు, గసగసాలు నేతితో వేయించి అందులో వేయవలెను. చల్లారిన తరువాత దీనిని సీసాలలో పోసియుంచిన 15 రోజుల వరకు పాడుగాదు. ఇది పూరీ, చపాతీలలో నంచుకోవడానికి బాగుంటుంది. ఇది పిల్లలకు చాలా బలమునిచ్చును.

* * *

## ఉసిరికాయల మురబ్బా

1 శేరు ఉసిరికాయలు (కొలత), 2 చెంచాల నెయ్యి, ¼ శేరు పంచదార (కొలత) కావాలి.

ఉసిరికాయలను శుభ్రముగా కడిగి స్టీలు గిన్నెలో నెయ్యి వేసి ఉసిరికాయలను పోసి గిన్నెను పొయ్యిమీదపెట్టి నీళ్ళ చెంబు మూత పెట్టవలెను మెత్తగా వేగిన తరువాత పళ్ళెములో చలార పెట్టవలెను. తరవాత పంచదారలో నీళ్ళుపోసి పాకము పటెన తరువాత గింజలుతీసి అందులో వేయవలెను. తరువాత పాకము పల్చబడును. అదికూడా గట్టిపడునరకు పొయ్యిమీదవుంచి చలారిన తరువాత వెడల్పు మూతిగల సీసాలో ఉంచుకొనవలెను ప్రతిరోజు 2 ముక్కలు ఉదయమున తినిన ఆరోగ్యముగా వుండును.

## గుల్ కంద్

గులాబిపూల రేకలు (గులాబిరంగు పూలు కొన్ని), 1 శేరు (కొలత) పంచదార (1 శేరు కొలత)

గులాబిపూల రేకులు తీసి పంచదారలో కలిపి స్టీలు పళ్ళెములోపోసి పిసికినచో కొంత తడి వచ్చి పంచదార అంతా కరుగును. (కరుగువరకు పిసకవలెను) ఈ ముద్దను సీసాలో పెటి యెండలో 10 రోజులుంచవలెను. బాగా పూరిన తరువాత తినిన ఆరోగ్యము. ★

సీతంరాజు శారదాంబ, షాద్‌నగర్]

---

గృహవైద్యం:

## నల్లులకోసం

'నేను కొరుకుడుకు మందు పలానవీధిలో నున్న జబీనా గనికి తెలుసునట!' అన్న మాట మా వూరు చిన్నదవటం వల్ల వీధివీధినా, వాడ వాడలా తెలిసిపోయింది. నేనుకాటువున్న అబ్బాయిలను, అమ్మాయిలను తీసుకొని నా దగరకు గుంపులు గుంపులుగా వచ్చేవారు. తీరా వచ్చిన తరువాత నేను మా ప్రక్కయింటి బలిజెవాళ్ల మంచాల్లోని నల్లులు తెప్పించి కాటున్నచోట కుట్టిప్పకు అందరూ విస్తుపోయి చూచేవాళ్ళు నావైపు 'ఇంతేనా నీ వైద్యం అన్నట్లు.' నేను చేసిన వైద్యం కొందరికి దురద తగ్గించింది తగ్గిన వాళ్ళంతా నన్ను తెగ పొగిడారంటే అందులో ఆశ్చర్యమేమిలేదు. ఇక మందు పని చేయనివాళ్ల సంగతి వినండి.

"మరిచోద్యం కాకపోతేను! ఎక్కడైనా విన్నారుటే! ఈ నల్లివైద్యం ఈవిడకు నిజముగా పిచ్చిపట్టినట్టుంది అన్నారు మా వీధి అమ్మలక్కలంతా! నేను ఎవరి మాటలు లెక్క చేయకుండా మా ప్రక్కింటి వారి మంచాన్ని నల్లులు లేకుండా గాలాను.

బక్రీద్ పండుగకు మా ఆడపడుచు

(55-వ పేజీ చూడండి)

# వనితా వాణి



## మానవ నైజం

9-7-58 తేది ఆంధ్ర సచిత్ర వారపత్రికలో వనితావాణి శీర్షిక క్రింద "అదా కారణం?" అంటూ "నేనూ చదివాను బి. ఏ. అయితే ఏం లాభం?" అన్న నా వ్యాసంమీద చిన్న సమాధానం చాలా సంకుచితభావాన్ని వ్యక్తపరుస్తూ శ్రీ తంగెళ్ళ పాండురంగ శర్మగారు వ్రాశారు. దానికి ప్రతిసమాధానం యివ్వడం నా ధర్మంగా తోచి వ్రాస్తున్నాను.

"లేనివారు అంతచదువు చదివి చివరకు యిలా ఎందుకు నిస్పృహ చెందారో చాలా ఆశ్చర్యంగా వుందని" వ్రాశారు. అంత చదువు చదువుకోబట్టే యింత నిస్పృహకు కారణం అయివుంటుందని వూహిస్తే యిట్లా ఆశ్చర్యపడవలసిన అవసరం వుండేది కాదేమో శర్మగారికి!

మనం ఎదురుచూచినది జరుగక పోతే నిస్పృహ చెందడం అనేది ఒక్క స్త్రీ నైజమే కాదని, పురుషులలో కూడా యీ నైజం వుందని, యిది మానవజాతి నైజమేనని మనవి చేస్తున్నాను. స్త్రీపురుషులు తాము ఎందులో ఉత్తీర్ణులైతే అందులో గుర్తించబడాలని వాంఛిస్తారు. నలుగురిలో మన్నన పొందని ఏకళయినా సార్థకత లేనిదని నా అభిప్రాయం. "నీ చదువుక్రింద ఖర్చు పెట్టిన సొమ్మంతా వృథా" అని మా నాన్న అన్నారంటే అందులో తప్పేమీ లేదని తర్వాత నేను గ్రహించినమాట వాస్తవము. అది నా అనుభవం కూడాను.

కొత్తగా కాపరానికివచ్చిన కోడల్ని యిరుగుపొరుగు చూచి అభినందిస్తే ఆ అత్తగారికి ఎంతో ఆనందం. అట్లా ఎవరూ రాకపోతే ఒకమారు వచ్చారే గారు చూడ్డానికి అంటుంది.

మాతృత్వం వహించినతర్వాత ఆ నూతన శిశువును తన బంధువర్గంవారు, పరిసరాలవారు చూచి ఎంత బాగున్నాడమ్మా అంటే ఆ పురటాలు పొందే ఆనందం యింతా అంతా కాదు. నిజానికి బాగుండకపోయినా సరే. కాకిపిల్ల కాకికిముద్దు గదా!

అట్లాగే భర్త ఒక చీర కొని తెచ్చాడనుకోండి దానిని తెచ్చీ తేవడంతో ఆప్యాయంగా అందుకొని, చాలా బాగుందండి. ఇట్లాంటిది నేనెప్పుడూ కట్టుకో లేదు. మీకు చీరలనాణ్యంకూడా మాకంటె బాగా తెలుసునే అని రెండుమాటలు అంటే ఆ భర్త ఎంతో పొంగిపోతాడు. కాని ఆచీరనైపు చూడకుండా నా పెట్టెమీద పడేద్దురూ అని అంటే ఎంతో నీరసంగా భార్య చూచినట్లు భర్త దుఃఖపడతాడు. చేసినపనికి, చదివిన చదువుకి, కొంత రికగ్నిషన్ వుండాలని నా అభిప్రాయం. తర్వాత దాని సార్థకత రెండోపక్షం క్రిందకు వస్తూంది. మరి మీ ఉద్దేశం ఏమిటో!

—టి. ప్రభావతి, బరంపురం.]

*  *  *

## దూరదృష్టిలేని విమర్శ

25-6-58 వ తేదీ ఆంధ్రవార పత్రికలో కుంటపల్లినుండి (సంగం) మురళీధరరావుగారు వ్రాసిన విమర్శ చదివితిని. నా వ్యాసాన్ని వీరు ఆమూలాగ్రంగా చదివి కూడా అర్థం చేసుకోలేకపోవడం చాలా విచారకరం. వీరింకా పురాణకాలంలోనే ఉండటం శోచనీయం. అసలు మంగళసూత్రం, ప్రేమకు, పవిత్రమైన వివాహమునకు, చిహ్నమనే సంగతి వీరు మరచిపోయినట్లున్నారు. మన హిందూ సాంప్రదాయానుసారం జీవితమందు ఒక స్త్రీకి ఒక్కడే భర్త, ఒక పురుషునికి ఒక్కతే స్త్రీ అనెడు విశాలభావంతో నేనీ వ్యాసాన్ని వ్రాసియున్నాను కాని వారది గమనించలేదని అర్థమగుచున్నది. వారు వ్రాసినటువంటి పురాణకాలపు ఉదాహరణలు కేవలము పురుషుల ఆధిక్యత కొరకు ప్రాకులాడుతూ వ్రాసినట్లున్నవి మరి పురుషుల ఆదర్శప్రాయుడైన శ్రీరామచంద్రుని ఏకపత్నీవ్రతము వీరు ఎలా మరచిపోగలిగారో అర్థమగుటలేదు. పురుషులు భార్య చనిపోయిన మూడవ నెలలోనే ద్వితీయ వివాహము (ఆపైయింకా అవకాశముంటే మరి నాలుగైదు వివాహాలు) చేసుకుంటే తప్పులేనప్పుడు, స్త్రీని భర్త చనిపోయిన తరువాత హింసించి ఆమెయొక్క పవిత్ర ప్రేమ చిహ్నమైన మంగళసూత్రమును తీసివేయుట తగనిపని అని వ్రాసినదాంట్లో తప్పేమున్నదో నాకర్థమగుటలేదు. విడాకులకు అనుకూలురుగా నుండుటకన్నా నైతికబలము గలిగి జీవితములో వివాహమను నది స్త్రీకిగాని పురుషునికిగాని ఒకేతూరి అని అనుకొనెడివారి నుద్దేశించి, మంగళసూత్రమునకు ప్రాధాన్యత కల్పించి నేనీ వ్యాసం వ్రాసియుంటని. భర్త మరణానంతరము జీవితాంతంవరకు మరల వివాహము చేసుకొననప్పుడు భర్త జ్ఞాపకార్థము అతను కట్టిన మంగళసూత్రము ధరించి ఉంటే మాత్రం తప్పేమిటి?

ఈ మాత్రమైనా ఆలోచించక వారు వ్యతిరేకార్థములతో కూడిన మాటలతో వ్రాసిన విమర్శను నేను హర్షించలేకపోతున్నాను. సావిత్రీదేవి భర్త చనిపోయినప్పటికీ మాంగల్యాన్ని త్రెంచి పారవేయకుండానే కష్టపడి తిరిగి భర్తను పొందగలిగినది. కాని యీ రోజుల్లో భర్తను తిరిగి తెచ్చుకొను శక్తిలేదు. కనుక వారి ప్రేమకు పవిత్ర చిహ్నమైన మంగళసూత్రాన్ని అట్టిపెట్టుకున్నట్లయితే కొంతవరకు సావిత్రీదేవి అడుగుజాడల్లో మెలిగిన వారవుతారు.

—కొత్తపల్లి రాజ్యలక్ష్మి, చిన్నగంజామ్]

*  *  *

## అసలు కారణం

సి. ఉత్తరగారు వ్రాసిన "రకరకాల బాధలు" చదివాక నిజంగా చాలా ఆశ్చర్యపోయాను. మరీ అలాంటి మొరటు మనుషులుంటారా, లేక అలా రాద్దామని రాశారా అనిపించింది. మరీ అంత తెగింపు మనుషులుంటారా అనీ అనుకున్నాను. ఉంటారుపో అలాంటి వారి నుండి తప్పించుకోవాలేగాని, ఎంత మొహమాటస్తులైనా అంతగా బాధపడాలా? ఇరుగు పొరుగుల బాధపడలేక స్ప్రింగ్ విరిచి గ్రామఫోను మూలపడేసిన ఉత్తరగారిమీద మహాజాలి కలిగింది.

ఉత్తరగారు చెప్పిన వస్తువులన్నీ మా ఇంటిలో వున్నై కాని మరీ అన్ని బాధలు నాకెన్నడూ అనుభవానికి రాలేదు. పోతే చిన్న చిన్న అవస్థలు మొదట్లో పడాల్సొచ్చింది. అప్పటో అడిగిన వస్తువు యివ్వలేనని మృదువుగా నిరాకరించటము చేతగాకనో బిడియమువల్లనో అడిగినవన్నీ అప్పచెబు

కుంటేదాన్ని. ఇలాంటి బాధలందరికీవుంటాయని ఎవరూ నాతో చెప్పిన పాపాన్ని పోలేదు. కాని పత్రికల్లో సోదరీమణులు రకరకాల ఇబ్బందులను చెప్పుకోవటము వాటి నివారణోపాయాన్ని మరొకరు సూచించటము జరగటంవల్ల అందరికీ యిలాంటి బాధలున్నాయని తెలిసి రావటమేగాకుండా నాదగరకొచ్చే వాళ్లకు ఎలా సమాధానమివ్వాలో నేర్చుకున్నాను.

ఇప్పుడేమనుకుంటానంటే, చెడ్డవారైంది మన ఇరుగు పొరుగు కాదు. మన స్వభావమే వాళ్ళనలా తయారుచేస్తుందని ఇప్పటి నా గుణాన్ని తెలుసుకొన్న వారెవ్వరూ, అనవసరంగ నన్ను బాధపెట్టనూ పెట్టరు. దానివల్ల తామూ చిన్నబోరు. వారు బాధపెట్టదల్చుకున్న నేను వాళ్లవలలో చిక్కుకోను. నిక్కచ్చిగా మాట్లాడితేనే తప్ప మనకు సుఖముండదు. అలా అని అందరితోనూ పోట్లాడమనీ, నిష్ఠూరము తెచ్చుకోమని అనటం లేదు సుమండీ!

కొందరు నాజూగ్గాపనిచేసి పెట్టమనో, ఫలానావస్తువిమ్మనో అడుగుతారు. అలాంటి వాళ్లకి మనమూ నాజూగ్గానే మన అయిష్టత తెలుపవచ్చు. వచ్చినవాళ్లు కొంతమోతాదు మించి మాట్లాడితే, మనము తగ్గకూడదు. తగాదా, అక్కడే వస్తుంది పేచీ. మన బలహీనతను గుర్తించి, వాళ్లు మనలను ఆటలాడిస్తారు. వారికి తగ్గట్టే మొండిగా జవాబిస్తేగాని మన్ని బతకనివ్వరు.

మా యింట్లోని రికార్డును పట్టుకుపోతామని అడిగే దమ్ములు ఎవరికీ లేవు సరికదా, రికార్డులు వినవలసి వస్తేకూడ ఎంతో మర్యాదగ వీలుంటే పెట్టండంటారు. వీలుంటే, అవతలివారు అడిగిన దానిని చేయమని చెప్పడానికి మనకు నోరుకూడ రాదు. వీల్లేకపోతే మరోసారి రండంటాను. ఇలా సూటిగ మాట్లాట్టంవల్ల నాకు ఏ చిక్కూ రాలేదు. ఎవ్వరూ నన్ను నిష్ఠురోక్తులాడలేదు. ద్వేషము అంతకన్నా లేదు. అయితే కొందరుంటారండి. వీళ్లకు సరిగ్గా వ్యతిరేకులు. "ఏమండోయ్ మేము యివాళ యీ పాటను విని తీరాలి. పెడతారా? లేక మమ్మల్నే పెట్టుకోమంటారా?" అనే బాపతు మనుషులు. వారికి తగు విధంగానే సమాధానము చెప్పి తప్పించుకొంటాను. మర్యాదగా అడిగితే వీల్లేకపోయినా వాళ్ల కోరికలు తీర్చాలనుటుందిగాని, దబాయిస్తే లొంగాలేమిటీ?

సూయింగ్ మెషీను వల్ల కూడ నాకీ అవాంతరాలు వచ్చి పడలేదు. కుట్టడము తెలిసినవారుగాని లెగ్ మెషీను ఉపయోగించలేరు. నన్నే కుట్టమంటారా? వారిచ్చిన బట్టను మూలనుపడేసి ఏ నెలకో, నెలా పదిహేనురోజులకో తిరిగియిస్తే రోగము కుదురుతుంది. ఒకటీ రెండూ అయితే కుట్టివ్వగలం, కాని మన్నే టెయిలర్నని చేసేస్తే ఎలా?

మనకు కొనే తాహతుంది, హాయిగా సుఖపడక పైవారికి భయపడి మానుకుంటామా? ఉత్తరగారి లాంటి భయస్తులు ఎంత మొహమాట పడ్డా, వాళ్లకి మాతి విరుపులు, నిందలూ లాంటివి తప్పవు. పైగా వస్తువులూ నష్టపడాలి.

ఇలాంటి ఇబ్బందులను సున్నితంగా తప్పించుకోవాలే గాని, ఇంకొకాళ్లకని మనం త్యాగము చెయ్యనవసరము లేదు

—ప్రమీల క్రిష్ణమూర్తి, మైసూరు]

* * *

వనితాలోకం శీర్షిక క్రింద సోదరీమణులు వ్రాసే వ్యాసాలు వనితావాణిలో తెలియచేసే వారి వారి అభిప్రాయాలు తోటిసోదరీమణులందరికీ చాలవుపయోగం అని నా అభిప్రాయం. కేవల విమర్శన దృష్టియేకాక అందరి అభిప్రాయాలు ఈ విధంగా తెలియచేసే అవకాశం అందరూ సద్వినియోగం చేసుకోవడం నాకు చాలా సంతోషంగా వుంది.

కుంకం పెట్టుకుంటే అది సడక మచ్చపడితే అది పోవడానికి ఏం చెయ్యాలో ఎవరికైనా తెలిస్తే వ్రాస్తారని తలుస్తాను.

—కుమారి టి. ఎస్. ఆర్. కృష్ణ,
విజయవాడ.]

* * *

## ఈ సారి కాశీ వెళ్తే

ఈ మధ్య ఆంధ్ర సచిత్ర వారపత్రికలో "మా కాశీయాత్రవిశేషాలు" అన్న వ్యాసంలో యీ క్రింది ముఖ్యస్థలాలనుగూర్చి సూచించారు కారు రచయిత్రి. చూడలేదనటానికి సావకాశం లేదు. వెళ్ళినవారు చూడకుండ ఉండరు కనక. లేక అన్ని విషయాలు వ్రాయటంల్లో మర్చిపోయారో.

1. కాశీకి నాలుగైదు మైళ్ళదూరములో "సారనాథ్" అను ఒక చరిత్రాత్మకమైన బౌద్ధారామముకలదు. అక్కడ బుద్ధభగవానుని ఆలయము పాలరాతితో చెక్కబడిన చాల అందమయిన కట్టడము. ఆ ఆలయములోపల చుట్టూ గోడలమీద బుద్ధుని జీవితచరిత్ర రంగులతో చిత్రించబడినది. చిన్నపిల్లలుకూడ మొదటనుంచీ ఒక్కొక్క బొమ్మే చూస్తూ వెడితే ఎవ్వరూ చెప్పకుండ బుద్ధుని కథ వాళ్లకే తెలిసేటట్లున్నాయి బొమ్మలు. ఆలయమునకు సమీపములో ఒక పొట్టి వృక్షము కలదు. దాని క్రింద బుద్ధభగవానుడు కూర్చుని తపస్సు చేసినట్లు అక్కడ వారు చెప్పెదరు. ఆనాటి చిత్రకళ, రాళ్ల మీద పెద్ద పెద్ద బానలమీద చెక్కిన శిల్పాలు చూడ ఆశ్చర్యంగా యుంటాయి

అక్కడే అశోక చక్రవర్తి కాలపు కట్టడముల శిథిలములు కలవు. అశోకుడు రాజ్యపరిపాలనలో తన సైన్యము పోవుటకు ఈ ప్రాంతంలో కొన్ని రహస్యమార్గాలు నిర్మించాడట. అవి అక్కడ కొన్ని మాత్రమే ఇప్పుడు చూడగలము.

2 కాశీస్టేషనునుంచి పూరిలోకి వెడుతూంటే కొంచెం దూరంలో ఒక అందమయిన భవనము కలదు. దానికి ఒక్కటే అంతస్తు. క్రింద ఒక్కటే పెద్దహాలు. ఆ హాలు అంతటా మన హిందూదేశపటము, తెలుపునలుపుల పాలరాతితో చాల అందముగ చెక్కబడియుంది. ఆ పటములో నదులదార్లు పర్వతములు, పట్నములు మొదలైనవన్ని చక్కగ గుర్తించబడియున్నాయి. అంత పెద్ద హిందూదేశపటము మనము మరెక్కడ చూడము. మేడ నాలుగు అయిదు మెట్లు ఎక్కగానే గోడకు కన్నమున్నది. ఆ కన్నముద్వార హిందూదేశపటము చూచిన అదొక విచిత్రముగ కనుపించును. దేశము యొక్క ఉపరితలము ఎట్లుండునో గ్రహించవచ్చు. ఈ మేడమీదనుంచి క్రిందికి చూచిన విమానంమీదనుంచి క్రిందికి చూడగలిగితే హిందూదేశ ఆకారమెట్లుండునో వూహింపవచ్చు.

3. టౌనులోనే ఒక దేవాలయము కలదు. అక్కడ అన్నీ లింగాలే. నారుచల్లితే లింగాలు మొలిచాయి అని ప్రతీతి. చూడవలసిన గుడి చూచారా!

యఱ్ఱమిల్లి గాయత్రి,
మదరాసు-1.

* * *

జూన్ 4వ తేదీ ఆంధ్ర వార పత్రికలో శ్రీ నందిగామసూర్యనారాయణగారు వ్రాసిన "సనాతనాచారాలు మంచివే!" అను వ్యాసము చదివి చాల ఆశ్చర్యపడ్డాను. వారి ఆలోచనలన్నీ 19వ శతాబ్దపు ఆలోచనలలాగున్నవి.

—సి. రామమోహన్ (న్యూఢిల్లీ)

* * * *

కొప్పుల సువర్ణగిరిగారు వ్రాసిన "సుస్తీ చేస్తే చూడవచ్చేవారు" అన్న వ్యాసం చదివాను. చాల బాగుంది. వారికి నా ధన్యవాదాలు.

—కుందడి భారతీదేవి (సత్తెనపల్లి) —పి పోలారావు (పిఠాపురం)

* * *

వార పత్రికలో పి. రమణగారు మాచ్ ఖండ్ ప్రయాణంగురించి చాలబాగ విపులీకరించారు. వ్యాసం చదువుతుంటే మాచ్ ఖండ్ లోఉన్నట్టే తోచింది. వారికి నాధన్యవాదాలు వనితాలోకంద్వారా తెలియపరుస్తున్నాను.

—ఎం. ఎ. కిషోర్



# బాలసాహిత్యం

# పేరయ్యబేరం

పేరయ్యయనుపల్లె
పేదకాపొకడు
ఏలేశ్వరము సంత
కేగె నొకనాడు.

సంతలో నాదినము
సాలెవా డొకడు
వింతబట్టల నెన్నొ
వేలమ్ము వేయ,

చూచిపో మన పాట
నాచెంత నిలిచె.
బట్టవేలములోన
పాల్గొనెడివారు

పాట పెరిగినకొలది
పట్టుదలతోడ
బట్ట ధరదాటినా
పాడుచునె యుండి.

"ధర పెరుగుచునెయుండ;
దాటు మరి కొంత;
నేపాడితేమటుకు
నిలుచునా"యనుచు

పాపమా పేరయ్య
పాడాడుపాట.
బట్టధర కాపాట
పదిరెట్టులయ్యె

పట్టుదలలావారు
బెట్టు విడిచారు.
సాలెవాడును చాల
సంతోషమంది

పేరయ్య పేరనే
వేసెనాపాట.
తెమ్మ రొక్కము, బట్ట
గొమ్మనెనుసాలె.



పి. యస్. రంగారావు

పేరయ్యవద్దేమి
పెన్నిధులు గలవు?
"సొమ్ము నాకడలేదు
అమ్మతోడయ్య,

పాడాను ఊరకే
వేడుకగతోచ,
కరుణించి నన్నొడిచి
కాపాడు"డనగ

సాలెవాడును, తక్కు
షాహుకారులును,
పాడవచ్చినవారు,
పాపమని యనక

'బేరాల చెడగొట్టె
నూరా'యటంచు
పేరయ్య వీపును
పెట్లించినారు.

తన కవసరములేని
పనులనెంధైన
తలదూర్చు పేరయ్య
వలెశాస్తి యగును. ★

పూర్వం ఒక అబ్బాయి ఒక గిసీపందిని పెంచాడు దానికి ఒక గూడు కట్టించి, రోజూ జాగ్రత్తగా సంరక్షించేవాడు ఒక దినం అతడు తన స్నేహితుల్ని పిల్చుకువచ్చి దాన్ని చూపిస్తూ, "ఒరేయ్, ఎవరైనా దీనితోక పట్టుకోగలరా" అనేవాడు. ఇది విని వారెక్కడ పట్టుకుంటారో అనే భయంతో అది ముడుచుకుని కూర్చునేది ఇది చూచి వారంతా నవ్వేవారు.

ఒకసారి గిసీపందికి ఒక కోరిక పుట్టుంది, తనతోక కత్తిరించుకుంటే బాగుంటుందని అది వెంటనే తన గూడు ప్రక్కన ఉన్న ముంగిస దగ్గరకు వెళ్లింది. ముంగిసతో "ముంగిసా, ముంగిసా, నాతోక కత్తిరించేద్దూ. వీరితో చాలా అవస్థగా ఉంది" అంది.

ముంగిస పకాపకా నవ్వింది "ఎందుకు నవ్వుతావు ముంగిసా?" అంది గిసీపంది "ఏం లేదులే ఏదో నాఆలోచన," అని, "నేను బాగా కత్తిరించ లేనుగానీ, బూరుగుచెట్టు మీద ఉండే ఉడత దగ్గర కెళ్లు" అంది.

గిసీపంది వెంటనే ఉడతదగ్గర కెళ్లింది అది గుర్రుకొడుతూ నిద్రపోతోంది. దాన్ని లేపి ఈ సంగతి చెప్పింది ఉడత పకపకా నవ్వుతూ "ఇప్పుడు నాకు నిద్రవస్తోందిగానీ, చెరువుగట్టుచెట్టు మీదున్న గుడ్లగూబ దగ్గర కెళ్లు అది శుభ్రంగా తీసేస్తుంది," అని చెప్పింది గిసీపంది పరుగెత్తుతూ చెరువుదగ్గర గుడ్లగూబ దగ్గర కెళ్లి "గుడ్లగూబా, నాతోక కొంచెం పీకి పారేద్దూ" అంది గుడ్లగూబ "హాహాహాహా" అని నవ్వి "ఓసీ గిసీపందీ, నాదగ్గర కత్తెర లేదు. వెళ్లి మీ యజమాని పెంచే పావురాన్ని అడుగు" అంది గిసీపంది "ఎందుకబ్బా, అందరూ నవ్వుతారు?" అనుకుంది

గెంతుతూ పావురం దగ్గర కెళ్లింది పావురాన్ని "పావురమా నాతోక కొరికేద్దూ," అంది పావురం "హిహిహి" అని నవ్వి "నేను నా బిడ్డలకు ఆహారం పెట్టాలి మీ యజమానినే అడుగు అతని దగ్గర చాకు ఉంది" అంది

గిసీపంది మళ్లీ తన యజమాని దగ్గర కెళ్లి "అబ్బాయీ! నాతోక తీసేస్తావా ఇది కాళ్ళ కడ్డంపడుతూంది" అంది ఆ అబ్బాయి పకాపకా నవ్వి, లోపలకు వెళ్లి బ్లేడు తెచ్చి "ఏదీ, వెనక్కు తిరుగు. కోసేస్తా" అన్నాడు గిసీపంది వెనక్కు తిరిగింది "ఏదీ, నీకసలు తోక లేందే ఓసి గిసీపందీ గిసీపందులకు తోక లుండవని నీకు తెలీదా? అందరి దగ్గర కెళ్ళి అడిగావా" అన్నాడు "ఔను, నేనడగ్గానే అందరూ నవ్వేవారు," అంది.

"ఐతే పో, అవమానం పాలయ్యావు" అన్నాడు అబ్బాయి ★



# కన్నకడుపు

చిన్ని సాయంత్రం బడి వదిలిపెట్టిన తర్వాత ఇంటికి వస్తున్నాడు తన యింటినందు మలుపుదాకవచ్చాడు. మలుపుదగ్గరవున్న సోడా కొట్లో స్నేహితుడు పాండు అయిస్క్రీం కొనుక్కోవడం చూశాడు చిన్ని. ఆగిపోయాడు అక్కణ్నుంచి చిన్ని యిల్లు యాభైగజాలుకూడ వుండదు

అనలుచిరు తిళ్లకు కక్కుర్తిపడే స్వభావం చిన్నికిలేదు. వయస్సు ఏళ్లే అయినా వూహా మాత్రం వే. తన తల్లిదండ్రులు డబ్బు లనివారని తెలుసు అందుకేడబ్బులు ఎప్పుడూ అడగడు బళ్లో తోటి పిల్లలు రకరకాల మిఠాయిలు తింటున్నా చూస్తూ వూరుకుంటాడు చిన్ని.

కాని అయిస్క్రీం అనేది ఆ వూరు రావటం క్రొత్త. అదయినా ఆ సోడా కొట్టు రామయ్య ఒక్కడే అమ్ముతాడు ఏ రోజుకారోజు బస్తీ నుంచి తెప్పిస్తాడు. తోటి పిల్లలు కొనుక్కు తినటం చాలా సార్లు చూశాడు. దాన్ని గురించి రకరకాలుగా వర్ణిస్తారు వాళ్లు. 'చల్లగా, తియ్యగా, అదో గమ్మత్తుగా' వుంటుందని చెప్తారు. కాని కానింత వరకు రుచి చూడలేదు.

పాండు కొనడం చూసిన తర్వాత చిన్నికి దానిమీద ధ్యాస మళ్లింది. పాండు కొనుక్కుని రోడ్డు మీదకు వచ్చాడు. దాన్ని చప్పరిస్తూ 'ఏరా చిన్నీ! నువ్వెప్పుడన్నా అయిస్క్రీం తిన్నావురా?' అని ప్రశ్నించాడు.

'లేదు...' అన్నాడు.

చిన్నికి భయం వేసింది వాళ్ల అమ్మ చూస్తుందేమోనని. ఒకవేళ పాండును పెట్టమని అడుగుతున్నాడని అనుకుంటుందేమోనని భయపడ్డాడు. పోనీ యింటికి వెళ్లి పోదామా అనుకున్నాడు తిరిగి అయిస్క్రీం ఎలా వుంటుందో రుచి చూస్తే బాగుంటుందన్న కోరిక వెనక్కు లాగుతోంది. అందుకని అక్కడే వుండిపోయాడు.

జి. రామకృష్ణ

పాండు శ్రీమంతులబిడ్డ ఇలాంటి చిరుతిళ్లకు లెక్కలేదు. అతని జేబు ఎప్పుడూ గలగలమంటూ వుంటుంది.

అయిస్క్రీం సగంవరకు తిని తక్కింది చిన్నికి ఇవ్వబోయాడు.

చిన్ని 'మా అమ్మ చూస్తే కంతుంది. నాకొద్దు నువ్వే తిను' అన్నాడు చెయ్యి వెనక్కు లాగుకుంటూ.

'ఫర్వాలేదు లేరా. గబగబా తినేసి వెళ్లిపో. మీ అమ్మ చూడదులే' అని చేతిల్లో పెట్టాడు.

ఎలాగో తినాలని వుంది కాబట్టి యిక కాదనలేకపోయాడు చిన్ని. తీసుకున్నాడు. కాని బెరుకు బెరుకుగానే వుంది. ఇంటి తలుపువేపే చూస్తున్నాడు.

ఇంతలోకే తల్లి తలుపు తీసుకుని బయటకు రావడం చూశాడు. తల్లి కూడ చిన్నిని చూసింది

గభాలున చేతిలో అయిస్క్రీం దూరంగా విసిరేసి యింటి ముఖం పట్టాడు చిన్ని. పాండుకూడ వెళ్లిపోయాడు.

ఇది చూసిన తల్లి రుద్రమూర్తి అయింది. చిన్ని యింట్లోకి రాగానే 'గాడిదా! వాళ్లదగ్గిరా వీళ్లదగ్గిరా ఎంగిలి తిళ్లుతింటున్నావా!...' అని వీపుమీద దబదబా బాదింది.

చిన్ని పెద్ద పెట్టున ఏడుస్తూ 'నేను. ఇంకా తినలేదమ్మా..... పాండే యిచ్చాడు..' అన్నా ఆ కోపంలో తల్లి వినిపించుకోలేదు

చిన్ని ఏడ్చిఏడ్చికుక్కి మంచలో పడుకుని నిద్రపోయాడు.

తల్లి వంటపని అయిన తర్వాత వచ్చి చూసింది చిన్ని నిద్రలో కూడ వెక్కుతూనే వున్నాడు. మంచి నిద్రలో వున్నాడు చొక్కా ఎత్తి వీపు చూసింది. లేత శరీరం మీద ఎర్రటి వాతలు తేలాయి తన గుండెమీద భగభగ మండే ఎర్రటిచువ్వలతో కాల్చినట్లయింది. దుఃఖం పొర్లుకొచ్చింది. నోటికి ఏమిటి అడ్డపెట్టుకుని ఆ కన్నకడుపు వేదనలో రోదించింది.

కొడుకును కొట్టిన దృశ్యం గుర్తుకొచ్చి మరింత బాధపడింది. తన మూర్ఖతకు తనను తిట్టుకుంది...

'ముక్కు పచ్చలారనివాడు తోటిపిల్లలు ఏమేమో తింటూ వుంటారు. ఎప్పుడూ ఏమీ అడిగిన పాపాన పోలేదు. ఎవరేమిపెట్టినా పుచ్చుకోడు. అయిస్క్రీం అంటే ఎలా వుంటుందో రుచి చూడాలని పెద్దవాళ్లే ఎగబడుతున్నారు. చంటి నాగమ్మవాడికి మనసు వేయడంలో తప్పేముంది. పాండు తింటుంటే చూస్తూ నుంచునివుండి వుంటాడే అతనే ఏడిచేతిలో పెట్టివుంటాడు. తానుఅసలు తినలేదనిగోలపెట్టాడు నన్నుచూసి హడలిపోయి అవతల పారేసి యింటికి పరుగెత్తుకొచ్చి వుంటాడు అలాంటివాణ్ణి యీ యినుప చేతులతో బాదాను... అయిస్క్రీంకోసం వాడి మనసు

## కన్న కడుపు

ఎంత బాధ పడిందో. ఆ ఒక్క కోర్కె తీర్చలేక పైగా కొట్టాను..." అని మాతృమూర్తి తనలో తాను బాధపడుతోంది.

అటునుంచి యిటు దొర్లిన చిన్ని 'నేను ఇంకా తినలేదమ్మా—' అని కలవరించాడు.

గాయపడ్డ ఆ తల్లి గుండెను ముళ్లతో గట్టిగా పొడినట్లయింది. దుఃఖం కట్టలు తెంచుకుని పొర్లుకొచ్చింది. ముఖానికి చేతులు అడ్డం పెట్టుకుని ఏడ్చింది.

పొలం పనికిపోయి తిరిగివచ్చిన చిన్నితండ్రి యీ దృశ్యం చూసి ఖంగారు పడ్డాడు. రుద్ధకంఠంతో సంగతి భర్తకు చెప్పి 'ఒక అణా వుంటే ఆ రామయ్య సోడా దుకాణానికి పోయి ఒకపెట్టె అయిస్క్రీం కొనుక్కురండి...చిన్నిని లేపి వాడి చేత అయిస్క్రీం తినిపిస్తేగాని నా బాధ తీరదు' అని భర్తను పంపింది.

చెమ్మగిల్లిన కళ్లను తుడుచుకుని రామయ్య కొట్టు కెళ్ళి అయిస్క్రీం కొనుకొచ్చాడు.

తల్లి చిన్నిని లేపింది 'మీనాన్న అయిస్క్రీం తెచ్చారు చూడు నాన్నా!' అని.

కలగని లేచినట్లు లేచాడు చిన్ని. తల్లి అమాంతం చంక నెత్తుకుని ముద్దు పెట్టుకుంది. తండ్రి అయిస్క్రీం చిన్ని నోటి కందిచ్చాడు.

మొదటిసారి చిన్ని అయిస్క్రీం రుచి చూశాడు. అతని సంబరానికి అంతులేదు. 'బలే వుందే అమ్మా యిది...' అన్నాడు తృప్తిగా అయిస్క్రీం తింటూ.

కొడుకు ఆనందం చూస్తున్న తలిదండ్రుల ఆనందం వర్ణించడానికి ఆదిశేషునకు కూడ కష్టమే. ★

# ★ విముక్తుడు ★

(32 వ పేజీ తరువాయి)

వి: అలాగేసార్.

(నిష్క్రమణ)

(జయరాం బరువు తీరినట్టు నిట్టూర్పు విడుస్తాడు. డోలాయమానంగా ఉన్నట్టు అతని ముఖ కవళికలు వెల్లడి చేస్తాయి. ముంజేతిమీద కోటు ఉంటుంది. కోటు జేబులోంచి పర్సు తీస్తూ, పడేస్తూంటాడు. చివరికి పర్సు జేబులో నేఉంచి ఫాన్ స్విచ్ ఆఫ్ చేసి గబగబ తలుపువైపు నడుస్తాడు. ఆ సమయంలో జనరల్ మేనేజర్ రావు ప్రవేశం. నడి వయసు మనిషి. సూట్‌లో ఉంటాడు. చేతిలో లెదర్ సూట్ కేస్ ఉంటుంది.)

రా: గుడ్ ఈవెనింగ్ ప్రొఫెసర్.

జ: (తికమకపడి) ఆఁ! ఆఁ! గుడ్ ఈవెనింగ్ ...గుడ్ ఈవెనింగ్ ...మి ... మిసర్ మిస్టర్ ...

రా: రావ్ ! నేను రావ్ అండ్ రావ్ కంపెనీ జనరల్ మేనేజర్ని సార్.

జ: ఓ! (లేని చిరునవ్వు తెచ్చుకుంటూ) వెరీగ్లాడ్ టు మీట్ యూ ... వెరీగ్లాడ్ మిస్టర్ రావ్.

రా: (చిరునవ్వుతో ) మీరీ గదిలో బస చేస్తున్నారని మేనేజర్ చెప్పాడు సార్. ఈ సాయంత్రమే ఖాళీ చేసి వెళ్ళిపోతారని కూడా చెప్పాడు.

జ: ఆఁ ఎస్...ఎస్. ఇప్పుడే వెళ్ళిపోతున్నానండీ మీవిషయం మేనేజర్ నాకూ చెప్పాడు. మీరీరూమ్ ఇంక వాడుకోవచ్చు. కమిన్...కమిన్...(అతని చేతిలోని సూట్ కేస్ అందుకోబోతాడు.)

రా: ఓ! నో.. నో.. థాంక్స్ (సూట్ కేస్ తనే కిందపెడతాడు )

జ: (ఆత్రుతగా) నేను వెళ్ళొస్తాను... గుడ్ నైట్ (త్వరగా వెళ్ళబోతాడు.)

రా: (అడ్డొచ్చి) ఓ... నో నో... అప్పుడే వెళ్ళిపోతారా సార్. మీకిబ్బంది కలిగించినట్టున్నాను. క్షమించండి.

జ: ఇబ్బందేం లేదు. బ్రెయిన్ టైమైంది. వొస్తా...

రా: మీ దర్శన భాగ్యం కలిగిందని సంతోషిస్తుంటే అప్పుడే వెళ్ళిపోతారా సార్ ? నా ఆతిథ్యం స్వీకరించండి ప్రొఫెసర్.

జ: హాహ దానికేం...! కాని...టైం లేదు ఎక్స్క్యూజ్ మీ...గుట్ నైట్ ...

రా: ఒక్క ఐదు నిమిషాలు కూర్చోండి సార్. నేను రాగానే మీరు వెళ్ళిపోతే మిమ్మల్ని తరిమి వేసినట్టు ఫీలవుతాను. కొంచెం కాఫీ తీసుకుందాం. (కొంచెం గట్టిగా) వెయిటర్.

జ: (గాభరాగా) అహఁ...కాఫీ వొద్దులెండి...ఊరికే కాసేపు మాట్లాడుకుందాం'

రా: ఆల్ రైట్. అలాగే ప్రొఫెసర్. మీరు యూనివర్శిటీలో మూడు రోజులు ఉపన్యాసాలిచ్చినట్టు విన్నాను.

జ ఆఁ.. ఆఁ...అవును.

రా: ఏ విషయం గురించి ప్రొఫెసర్ ?

జ: (తికమకపడి) ఏదో సాంకేతిక విషయం గురించిలెండి మిసర్ రావ్.

రా: ముఖస్తుతి అనుకోకండి. మీరు అణుశక్తివిషయాల్లో అఖండులని విన్నాను ప్రొఫెసర్.

జ: ఓ...థాంక్యూ.

రా: మరేం అనుకోకండి. మిమ్మల్ని చూడగానే నేను ఒక విధంగా ఆశ్చర్యపోయాను. మీరు నడివయసువారై ఉంటారనుకొనేవాడిని.

జ : అలాగా!

రా: చిన్న వయసులోనే గొప్ప పేరు తెచ్చుకున్నారు ప్రొఫెసర్. అయినా వయసులో ఏముందిలెండి. అణుశక్తి విషయాలు నేనూ కొంత స్టడీ చేశాను. నాకు కొన్ని సందేహాలున్నాయి ప్రొఫెసర్. మిమ్మల్ని అడిగి తెలుసుకోవాలని చాలా కాలం నుంచీ అనుకుంటున్నాను.

జ : (గాభరాగా లేచి నిలబడి) తరవాత తీరిగ్గా చర్చిద్దాం. నాకు టైమయింది మిస్టర్ రావ్.. వొస్తాను...గుడ్ నైట్.

రా : గుడ్ నైట్ ప్రొఫెసర్.

(జయరాం వెళుతూ ఉంటాడు.)

ఫైల్ తీసుకోటం మర్చిపోయారు ప్రొఫెసర్. (దగ్గరికి వెళ్ళి ఫైల్ అందిస్తాడు.)

జ: థాంక్స్......(తలుపుదాకా వెడతాడు.)

రా : (సూట్ కేస్ చూసి) ఇదేమిటి ప్రొఫెసర్...సూట్ కేస్ మర్చిపోయి వెడుతున్నారే...

(సూట్ కేస్ అందిస్తాడు.)

ఏమిటి ప్రొఫెసర్ ...తీసుకోండి...సందేహిస్తారేం ! ఓ...యు వాంట్ హెల్ప్ ! (కొంచెం గట్టిగా) వెయిటర్ ...

జ : (ముచ్చెమటలు పోస్తాయి) ఓ...నో నో...వొద్దు...సూట్ కేస్ అందుకుని ఏమీ తోచక ఒకక్షణం నిలబడి వెళ్లబోతాడు)

రా : (స్టాండుమీద కోటు చూసి పకపక నవ్వుతూ) వాటీస్ దిస్ ప్రొఫెసర్ ? ప్రొఫెసర్లకి మతిమరుపని వినటమే గాని ఇప్పటివరకూ చూడలేదు. స్టాండుమీద కోట్ మర్చిపోయే వెడుతున్నారే. (తెచ్చి ఇస్తూ) సూట్ కేస్‌లో పెట్టండి.

జ : ఎక్స్క్యూజ్ మీ...మిస్టర్ రావ్... మనసు సరిగాలేదు. సూట్ కేస్ తాళం తీసి వుండటం చూస్తాడు. ముచ్చెమటలు పోస్తాయి.)

రా: అదేమిటి ప్రొఫెసర్, అలా ముచ్చెమటలు పోస్తున్నాయి...అరె...ఇలా కూర్చోండి......(సోఫాలో కూర్చోబెడతాడు) ఆకస్మాత్తుగా ఇలా అయిపోయారేం? డాక్టర్ని పిలిపించనా? (ఫాన్ స్విచ్ వేస్తాడు.)

జ : వొద్దు వొద్దు. ఏమీ లేదు. బాగా అలిసిపోయాను. బ్రెయిన్ ఫెటీగ్. అంతే. మీ రేమీ అనుకోకపోతే కాసేపు నన్ను ఒంటరిగా ఉండనివ్వండి మిస్టర్ రావ్.

రా : అలాగే ప్రొఫెసర్ ...సోసారీ... మిమ్మల్ని డిస్టర్బ్ చెయ్యను. కాసేపు రెస్టు తీసుకోండి. గెస్టురూములో ఉంటాను. అవసరమైతే పిలిపిస్తారు కదూ ? (జయరాంకోటూ, ప్రొఫెసర్ కోటూ స్టాండుకి తగిలించి నిష్క్రమిస్తాడు.)

(జయరాం తేరుకుని త్వరత్వరగా స్టాండు దగ్గిరికివెళ్ళి కోటు ముంజేతిమీద వేసుకునీ వేసుకోగానే ప్రొఫెసర్ నారాయణరావు ప్రవేశం. జయరాం ఆయనని చూసి కంగారుపడి కోటు స్టాండుకి తగిలించి ఆయనవైపు విచిత్రమైన చూపులు చూస్తూంటాడు.)

నా : హలో, గుడ్ ఈవెనింగ్ మిస్టర్ జనరల్ మేనేజర్.

జ : (కంగారుగా) గుడ్ ఈవెనింగ్... గుడ్ ఈవెనింగ్...ప్రొ...ప్రొఫెసర్.

నా : మీరువచ్చి చాలా సేపయిందా మేనేజర్ ?

జ : లేదు—ప్రొఫెసర్ ...ఇప్పుడే... ఇప్పుడే వచ్చాను.

నా : బజారునించి రావటం కొంచెం ఆలస్యమైంది. క్షమించాలి, మీకు ఇబ్బంది కలిగించాను.

జ : ఇబ్బందేం లేదండి...

నా : రెండు నిమిషాల్లో గది ఖాళీ చేస్తాను.

జ : తొందరేం లేదు ప్రొఫెసర్. టేక్ యువర్ ఓన్ టైమ్... నేనిక్కడ ఉండటం మీకు కొంచెం ఇబ్బందిగా ఉంటుందేమో ...కాసేపు అలా వెళ్ళొస్తాను. (వెళ్లటానికి ఉపక్రమిస్తాడు.)

నా : నో-నో-నో...ఏమాత్రం ఇబ్బంది లేదు. మీరలా కూర్చోండి మేనేజర్.

# ★ విముక్తుడు ★

చేసుండగా మీరు వచ్చారు. కనుక మీరు నాకు అతిథులు. (బలవంతంగా సోఫాలో కూర్చోపెడతాడు.) కొంచెం కాఫీ తీసుకుందాం...(గట్టిగా) వెయిటర్.

జ: (గాభరాగా) వొద్దు ప్రొఫెసర్... ఎక్స్‌క్యూజ్ మీ-నాకు కొంచెంపనుంది...



మళ్ళీ...మళ్ళీ దర్శనం చేసుకుంటాను. (లేచి నిలబడతాడు.)

నా: (కూర్చోపెడుతూ) ఓ...అలా వీల్లేదు మేనేజర్...మీరు చాలా మొహమాటం మనుషులే...నో-నో...యూఆర్ మైగెస్.

జ: (నిస్పృహతో కూలబడి బలిమాలుకుంటున్నట్టు) నాకు అర్జంటుపని ఉంది ప్రొఫెసర్-నన్ను వెళ్ళనివ్వండి.

నా: నేనూ అర్జంటుగా రైల్వేస్టేషన్‌కి వెళ్ళాలి. కాఫీతాగేసి పోదాం.

జ: నాకోసం బయట స్నేహితులు వెయిట్ చేస్తున్నారండీ.

నా: అయితే వాళ్ళనీ పిలుద్దాం...వెయిటర్!

జ: ఓ! వొద్దు...వొద్దు...ప్లీజ్...ప్లీజ్...ప్రొఫెసర్.

నా: ఆల్‌రైట్. మీఇష్టం. (వెయిటర్ ట్రేతో ప్రవేశం) అదిగో కాఫీ వచ్చేసింది. వెయిటర్ వైపు చూసి) గుడ్‌బాయ్!

వె: (ప్రొఫెసర్‌తో) సార్ మీకోసం ఓ కుర్రాడు వచ్చాడుసార్.

నా: కుర్రవాడా?

వె: అవునుసార్.

నా: ఏంకావాలి?

వె: బుక్‌స్టోర్సు కుర్రవాడు సార్. బుక్స్‌పార్సెల్ తెచ్చాడుసార్.

నా: ఓ-అలాగా బయట టాక్సీలో పెట్టమను. టాక్సీ డ్రైవర్‌తో ఇప్పుడే వస్తానని చెప్పు.

వె: ఎస్. సార్. (వెళుతూ) ఆ కుర్రాడు బిల్ ఇవ్వాలంటున్నాడు సార్.

నా: బిల్! ఓ-అవును. మర్చిపోయాను. వెళ్ళేటప్పుడు కోటు ఇక్కడే మర్చిపోయి వెళ్ళాను వెయిటర్.

వె: అవునుసార్. మీరు వెళ్ళాక చూశాను.

నా: అందులో పర్సు ఉండిపోయింది. బజార్లో పర్సుకోసం చూస్తేకోటే కనిపించలేదు. (నవ్వుతాడు) అందువల్ల బిల్ ఇక్కడికి పంపమని చెప్పాను.

(లేచి స్టాండ్‌దగ్గిరికి వెడుతూంటాడు. జయరాం పూర్తిగా ఆశవొదులుకుని కంగారు పడుతూ, వొణికిపోతూ కుర్చీలోంచి సగం లేచి, మళ్ళీ కూలబడిపోయి ప్రొఫెసర్ వైపు భయంగా చూస్తూంటాడు వెయిటర్ కాఫీ కప్పుల్లో పోస్తూంటాడు.

వె: (జయరాంతో) ప్రొఫెసర్ గారికి ఎప్పుడూ పరాకే సార్.

జ: (తటాలున ఏదో ఆలోచన మెరిసి) ఆఁ...నాకూ అంతే...నేనూ పరాకుపనులు చేస్తుంటాను. (లేనినవ్వు తెచ్చుకుంటాడు.)

(ప్రొఫెసర్ అందుబాటులో ఉన్న జయరాంకోటు తనదే ననుకుని చేతిలోకి తీసుకుని జేబులోడిమీ పర్సుతీసి మళ్ళీ కోటు స్టాండ్‌మీద పడేసి టేబిల్‌దగ్గిరికి వస్తూంటాడు. అది గ్రహించి జయరాం గుండె మీద చెయ్యివేసుకుని తేలిగ్గా ఊపిరివిడిచి 'అమ్మయ్య' అంటాడు.)

వె: అదేంసార్. ఒంట్లో బాగోలేదా?

జ: (పొరపాటుగుర్తించి) ఆఁ...ఆఁ... ఏంలేదులే. కొంచెం గుండెనొప్పిగా ఉంది. అంతే...

నా: (పర్సుతీసి నోట్లు లెక్కపెట్టి) ఇదిగో, వెయిటర్. ఈ ఆరొందలూ ఆ కుర్రాడికి ఇవ్వు. ఈవందా హోటల్ మేనేజర్‌కి ఇవ్వు. అందులో హోటల్ బిల్ పోను, కొంత మిగుల్తుంది. అది నువ్వు తీసుకో. (పర్సు బల్లమీద పడేస్తాడు.)

వె: (తీసుకుని) థాంక్స్, సర్. (నిష్క్రమిస్తాడు.)

నా: కాఫీతీసుకోండి మిస్టర్ జనరల్ మేనేజర్.

జ: (పూర్తిగా తేరుకొని కృతజ్ఞత నిండిన స్వరంతో) థాంక్స్ ప్రొఫెసర్...థాంక్స్ మెనీ...మెనీ...వెరీ మెని థాంక్స్... చాలా కృతజ్ఞుణ్ణి...చాలా...చాలా...

నా: (ఆశ్చర్యపోయి) ఇదేమిటి మేనేజర్ కొంచెం కాఫీకే అంత ఋణపడి పోయినట్లు మాట్లాడుతున్నారే! వండర్‌ఫుల్...మీరు చాలా చాలా మొహమాటస్థులు (ఇద్దరూ కాఫీ తీసుకుంటారు.) ఆల్‌రైట్...ఇంక నాకు టైమయింది. వొస్తాను, గుడ్‌నైట్.

జ: వెరీగుడ్‌నైట్ ప్రొఫెసర్.

(ప్రొఫెసర్ స్టాండు దగ్గిరికెళ్లి జయరాం కోటు తీసుకోబోతాడు)

అకోటు నాది ప్రొఫెసర్.

నా: ఓ...సారీ...రెండూ ఒకమాదిరిగానే ఉంటే పొరపడ్డాను. (తనకోటు చేతిమీద వేసుకొని సూట్‌కేస్ రెండో చేతో తీసుకుని వెళ్లిపోతూ ఉంటాడు)

జ: (బల్లమీది పర్సుచూసి చిరునవ్వు నవ్వి) పర్సు మర్చిపోయి వెడుతున్నారు ప్రొఫెసర్ (ఇస్తాడు)

నా: ఓ...థాంక్స్ నాకు మతిమరుపు మరీ ఎక్కువై పోతోంది. మిస్టర్ మేనేజర్ వొస్తా...గుడ్‌నైట్.

జ: (ఉల్లాసంగా) వెరీ వెరీ గుడ్‌నైట్ ప్రొఫెసర్. వెరీ వెరిగుడ్‌నైట్...వెరి...వెరీ (ప్రొఫెసర్ నిష్క్రమిస్తాడు. జయరాం కోటు తీసుకుని వెళ్లబోతుండగా మూర్తి ప్రవేశం.)

ఓ! మూర్తిగారూ! మీరు స్ఫటికం వంటి నిజం చెప్పారు. మూర్తిగారూ-మనిషి ఏమైనా కావొచ్చుకాని దొంగమాత్రం ఏ పరిస్థితులోనూ కాకూడదు. దొంగతనంకంటె హీనం

మరొకటి లేదు. అది ముమ్మాటికీ నిజం. అబ్బ అది మనిషిని ఎంత పిరికివాడిని చేసేస్తుంది! మూర్తిగారూ, మీ కెంత కటిక దారిద్ర్యం ఉన్నా, ఎంత ఆవేశంలో ఉన్నా, ఎంత కసిగా ఉన్నా దొంగతనం మాత్రం చెయ్యవద్దు.

మూ: (ఈ ధోరణికి అప్రతిభుడై) మేనేజర్ గారూ, మీరు మాట్లాడేదేమిటో నాకేమీ తెలియటంలేదు ఏమైనా ఆ విషయాలు నాకనవసరం. ఇందాక ఇక్కడ బల్లమీద నా టెస్టిమోనియల్స్ ఫైల్ మర్చిపోయాను దయచేసి తీసుకువెళ్ళనివ్వండి.

జ: ఓ అలాగే!

(మూర్తి బల్ల దగిరికి వెళ్ళి ఫైల్ తీసుకుంటాడు. జనరల్ మేనేజర్ రావు ప్రవేశం)

రా: ఎలా ఉంది ప్రొఫెసర్? కులాసా చిక్కిందా?

మూ: (ఆశ్చర్యంతో అర్థ స్వగతంగా) ప్రొఫెసర్!

జ: ఆఁ ఆఁ...కులాసాగానే ఉంది. థాంక్స్.

రా: మీకు విశ్రాంతి చాలా అవసరం ప్రొఫెసర్. ఈ రాత్రి ఇక్కడ ఉండిపోకూడదా?

జ: ఓ...నో...నో...థాంక్స్.

రా: మూడు రోజుల్నించీ అణుశక్తి మీద మీరిచ్చిన ఉపన్యాసాలు అద్భుతంగా ఉన్నాయని ఇప్పుడే నా మిత్రులు కొందరు చెప్పారు ప్రొఫెసర్.

జ: ఓ...! థాంక్స్, థాంక్స్ (వెళ్ళిపోవటానికి దిక్కులు చూస్తాడు)

(చేతిలో కాగితాలతో వెయిటర్ ప్రవేశం.)

వె: (జనరల్ మేనేజర్ తో) తమరు వచ్చేశారా సార్. నమస్తే సార్. ప్రొఫెసర్ వెళ్ళిపోయారా సార్?

రా: ఏం వెయిటర్, పరాకు చిత్తగిస్తున్నావే! వారేగా ప్రొఫెసర్!

వె: వారు కాదు సార్. ప్రొఫెసర్ నారాయణరావుగారికి ఈ రసీదు లివ్వాలి సార్.

రా: (ఆశ్చర్యంగా) అయితే వీరు ప్రొఫెసర్ నారాయణరావుగారు కాదూ?

వె: కాదు సార్. వారు ఇంకో ప్రొఫెసర్.

మూ: (ఆశ్చర్యంగా) వారు ప్రొఫెసరా? రావ్ అండ్ రావ్ కంపెనీ జనరల్ మేనేజర్ కాదూ?

రా: ఏమిటీ?

వె: రావ్ అండ్ రావ్ కంపెనీ జనరల్ మేనేజర్ వారు కాదు సార్ (జనరల్ మేనేజర్ని చూపిస్తూ) వీరు.

మూ: (ఆశ్చర్యంగా రావుని చూస్తూ) ఏమిటి సార్ ఈ కుంభకోణం?

రా: (కోపంగా) కుంభకోణమా?

మూ: మీ ఇద్దరిలో నిజమైన జనరల్ మేనేజర్ ఎవరో నాకు తెలియటంలేదండి. వారే ననుకుని ఉద్యోగం కోసం ఇందాక వారితో నా విషయం మనవి చేసుకున్నాను.

రా: (జయరాంతో) ఆఁ, ఏమండీ, మాట్లాడరేం? ఏమిటీ మోసం?

మూ: చెప్పండి సార్, మీరు జనరల్ మేనేజర్ కాదా?

జ: (పాలిపోయిన ముఖంతో) నేను జనరల్ మేనేజర్నీ కాదు, ప్రొఫెసర్ నారాయణరావునీ కాదు, మరే ప్రొఫెసర్నీ కాదు. జయరాం అనే ఒక సామాన్య వ్యక్తిని.

రా: అయితే ఇలా మోసగించటానికి కారణం?

జ: చెబుతాను. తిండిలేక మలమలమాడే పిల్లల కోసం, మందునీళ్ళకి గతిలేక తుది గడియల్లో ఉన్న తల్లి కోసం—నా రెక్కల కష్టం మీద ఆధారపడిన నా కుటుంబం కోసం గతి లేక దొంగతనం చేయాలనే ఉద్దేశంతో ఈ గదిలోకి వచ్చాను.

రా, వె, మూ: దొంగతనం కోసమా!

జ: అవును. దొంగతనం కోసమే. ఏం చెయ్యను, మరి? చదువుకున్న వాడినే. ఒకప్పుడు ఉద్యోగం చేస్తూ గౌరవంగా బతికిన వాడినే. అవసరంలేదని ఉద్యోగం తీసేశారు. అప్పటినించీ నానా అవస్థలూ పడ్డాను. మరో ఉద్యోగం దొరకలేదు. చిట్టచివరికి ఒక కంపెనీలో క్యాషియర్ ఉద్యోగం ఇస్తామన్నారు. కాని వెయ్యిరూపాయలు సెక్యూరిటీ డిపాజిట్ కట్టాలిట! వెయ్యిదమ్మిడీలు కూడా లేవు. ఆవేశంతో, కోపంతో, కసితో దొంగతనం చెయ్యాలని నిశ్చయించుకున్నాను. పెద్దమనిషిలా వచ్చాను ప్రొఫెసర్ గారి కోటుజేబులో పర్సు దొరికింది.

వె: ఆఁ. పర్సు తీశారా?

జ: తీశాను. అందులో వెయ్యిరూపాయల నోట్లున్నాయి. ఎంతో సంతోషపడ్డాను. జేబులో వేసుకున్నాను కాని ఆక్షణం నించీ అతివిచిత్రమైన పరిస్థితుల్లో చిక్కుకున్నాను. నా వేషంచూసి దొంగ అనుకోలేక ప్రొఫెసర్ననీ, జనరల్ మేనేజర్ననీ తలోవిధంగా అనుకున్నారు. నాస్థితినిబట్టి సమయానుకూలంగా ప్రవర్తించాను. కాని అదృష్టవశాత్తూ పర్సుతో తప్పించుకోలేకపోయాను.

రా: పర్సు ఎక్కడుంది?

జ: ప్రొఫెసర్ గారే తీసుకున్నారు.

రా: అయితే వారు దొంగతనం కనిపెట్టారన్నమాట.

జ: లేదు. వారి మతిమరుపువల్ల నాకోటే వారిదనుకుని అందులోంచి పర్సు తీసుకుని తమడబ్బు దక్కించుకున్నారు.

రా: నిజమా?

జ: ఆ సమయంలో వెయిటర్ ఇక్కడే ఉన్నాడు. అడగండి.

రా: నిజమా, వెయిటర్.

వె: నిజమేసార్. ఈ రసీదులు ఆడబ్బు తాలూకువే.

రా: (వేళాకోళంగా) అయితే పాపం, విఫలం చేద్దామని, ఫలితం దక్కలేదన్నమాట.

జ: దక్కిందిసార్. ఆడబ్బుతో పారిపోతే ఆక్షణమే నాజీవితం ఆఖరైఉండేది. పట్టుబడినా, పట్టుబడకపోయినా జీవితపర్యంతం ఈ దొంగతనం నన్ను వెంటతగిలి బాధించేది. సమాజంలో దొంగగా బతకలేను. ఇప్పుడు నేను ఏ పెద్దమనిషికీ తీసిపోను. ప్రొఫెసర్ గారు వెళ్ళేటప్పుడు మళ్ళీ పర్సుమరిచిపోతే పిలిచిఇచ్చాను. నేను బీదవాడిని పూటకిగతి లేనివాడిని. కాని. కాని. (ఆవేశంగా) నేను దొంగనికాను నేనూ సంఘంలో ఒక పెద్దమనిషిని. పరిస్థితులవల్ల క్షణిక దౌర్బల్యానికి లోబడినమాట నిజమే. కాని. కాని ఏదో మహాశక్తి నన్ను విచిత్రంగా కాపాడి నా పెద్దమనిషితనాన్ని నాకిచ్చివేసింది. సమయానికి అడ్డుపడి మీరందరూ నాకెంతో మేలుచేశారు. మీ అందరికీ నేను ఎంతో కృతజ్ఞుడిని. సెలవు. (నమస్కరించి వెళ్ళబోతూ ఉంటాడు.)

రా: (ఏదోఆలోచించి) చూడండీ... జయరాంగారూ మీకు అభ్యంతరం లేకపోతే రావ్ అండ్ రావ్ కంపెనీ కొత్త బ్రాంచీలో మిమ్మల్ని క్యాషియర్ గా వేసుకుంటాం. ఏమంటారు?

జ: (ఆశ్చర్యంతో) నిజమాసార్!

రా: శుద్ధనిజం. వెయ్యిదమ్మిడీలుకూడా సెక్యూరిటీ కట్టక్కర్లేదు.

జ: మీరు చాలా దయగలవారుసార్.

రా: హ. హ. దయేముందీ. సెలెక్షనే. వెయిటర్ మా అందరికీ కాఫీ.

వె: ఇప్పుడే తెస్తానుసార్. (నిష్క్రమిస్తూంటాడు) (తెర) ★



# 'ఇంటర్వెల్‌లో క్లైమాక్స్'

సినిమా కథలలో మామూలుగా క్లయిమాక్సు అనేది (పతాక ఘట్టం) కథ నాలుగో పాదంలో ఆరంభం అవుతుంది

కాని దక్షిణభారత సినిమాశాలూకు 1958వ సంవత్సరపు కథలో మటుకు ఇంటర్వెల్ లోనే క్లయిమాక్సు ఘట్టం క్రీనీడ వాలినట్లు కనిపిస్తుంది. ముడిఫిలిం 'కట్' కటతో గత ఏప్రిల్ 1 నుండి ఆరంభమైన అవస్థ, సంవత్సరం పూర్వార్థం ముగిసి ఉత్తరార్థం ఆరంభమైన ఈ వేళకు ఉపశమించడానికి బదులు ఉద్రిక్తం అయింది.

ఫిలిం దిగుమతికోటా నూటికి 60 వంతులు కోత పెట్టినప్పుడు, 'విజయా'ధిపతి నాగిరెడ్డి గారి నాయకత్వాన దక్షిణ భారతఫిలిం వణిజాలంతా ఉద్యమస్థాయిలో పరిశ్రమ కష్టసుఖాలు ప్రభుత్వానికి నచ్చచెప్పి 60% కోతలో 20% కోత తగ్గించగలిగారు. అప్పట్లో ఉత్తరాదివారు ఏ కారణంచేతనో ముఖావంగా ఉండి, కిమి నటించినా, రేపు అక్టోబరులో అసలుకే మోసంవస్తుందన్న పుకారు ఢిల్లీ కార్లను బయలుదేరాక, స్థానికంగా ఉన్న ఫిలిము నిలవ కరిగిపోయాక, ఇప్పుడు ఆందోళన చేస్తున్నారు.

చిన్నచిత్రాలు తీస్తే ఏ గొడవా ఉండదు అని పెద్దలు చెప్పుడినా, అలాటి పత్రకాలు

శ్రీగ్రాఫిలింస్‌వారి 'పతిభక్తి'లో జెమినీగణేశన్, సావిత్రి.

హాఠాత్తుగా అమలుకురావడం దుస్సాధ్యం. ఇప్పటి అవాంతరపరిస్థితిలో మరీకష్టం. గత వారం నాగిరెడ్డిగారు, కాగితంమీదవేసి చూపినలెక్కలూ, చేసినవాదాలూ చూసిన మీదట సినిమా అంటే గిట్టనివాళ్ళు కూడా, ఈపరిశ్రమమీద ప్రభుత్వం ఇంతటి 'వాత్సల్యం' చూపడంసబబుకాదంటారు. ఈపరిశ్రమ ప్రత్యక్షంగా రెండులక్షలమందికి జీవనోపాధి, ఇందులో 180 కోట్ల రూపాయిలు పెట్టుబడి ఉంది. ప్రభుత్వానికి, వినోదం పన్ను, రాబడిపన్నులద్వారా ఇరవైకోట్లు లభిస్తోంది. దేశం మొత్తంమీద వస్త్రపరిశ్రమది అగ్రస్థానం అయితే, ద్వితీయస్థానం చలనచిత్ర పరిశ్రమదే. ఇంత పెద్ద పరిశ్రమ అయినా, ఇది నడవడానికి నాడే ముడిసరుకు ఖర్చు మిగతా వాటన్నిటికన్న తక్కువ. ఒక చిత్రానికి ఐదారులక్షలు ఖర్చు అయితే అందులో నూరింట ఐదు రూపాయలకన్న మించి ముడిఫిలిముకు ఖర్చుకాదు. ఈ మాత్రంకూడా లేకుండా ఇందులో నూ పొదుపు చేయాలనడం సబబుకాదు. అసలు ఈ పరిశ్రమ ఏనాడూ దేశ ఆర్థికవ్యవస్థకి తగనిభారం కాలేదు; గిట్టనిచుట్టంలా లేదు. ముడిఫిలిం కొనడానికి కోటిన్నర రూపాయలు విదేశాలకు ఇచ్చినా, విదేశాలనుండి మనచిత్రాలు ఆర్జించేది దానికన్న బాగా ఎక్కువే. ఒక్క దక్షిణభారత చిత్రాలే సాలుకు 80 లక్షలు విదేశాలలో సంపాదిస్తున్నాయి. ఉత్తరాది చిత్రాలకు ఇంకా పెద్దమార్కెట్ ఉంది. అవకాశాలు, తగిన ప్రోత్సాహం ఉంటే, మన పరిశ్రమ దేశానికి డబ్బుగడించిపెట్టే ముఖ్యసాధనాలలో ప్రముఖమైనది కాగలదు అని నాగిరెడ్డిగారు తమ కరపత్రంలో వివరించారు.

రేపు అక్టోబరునుండి డిసెంబరు వరకూ దిగుమతి కోటాలు నిర్ణయించినపుడు, అసలు దిగుమతులన్నిటినీ కట్టిపెట్టేసా రనుకుంటున్నారు. అనగా అతి ముఖ్యమైన కొన్నిటికే అనుమతులిస్తారు. అప్పుడు కనక నిషిద్ధ వస్తువుల జాబితాలో ముడిఫిలిం పేరు ఉంటే, ఈ ఏడాది సినిమా పరిశ్రమ కథ చాలా కష్టఘట్టంలో ప్రవేశిస్తుందన్నమాట.

పరిశ్రమలో దీని పర్యవసానాలు ఎలా ఉంటాయో నిర్మాతలే చెప్పినా అవిఏమంత పెద్ద అతిశయోక్తు లనిపించవు...

ప్రభుత్వ సహాయం లేకుండా, పన్నులూ, కష్టాలూ నిభాయించుకుంటూ 25 ఏళ్ళ చరిత్ర సృష్టించుకొని, ఉజ్వల భవిష్యత్తుకు నాందీ వాక్యాలు వ్రాసుకొంటున్న చలనచిత్ర పరిశ్రమకు కేవలం, మూడురూపాయిలలో నాలుగు అణాలు ఆదా చెయ్యడానికి ఇటువంటి శిక్షవిధించడం న్యాయం అనిపించుకోదు——



జనతాచిత్రవారి 'టాక్సీస్టాండ్'లో అనితా గుహ.

1958 పూర్వార్థంలో సమకాలిక వేష భావం భరించిన పౌరాణికాలూ, పూర్వకాలపు ముస్తాబులు చేసుకున్న సమకాలిక సాంఘిక చిత్రాలూ, ఏ కాలానికి, జాతికి చెందని జానపదాలూ, దొరల జాతి జానపదాలూ, జానపదాల్లాంటి సాంఘికాలూ వచ్చాయి. మొత్తం మీద వాటిలో జానపదాలదే పైచెయ్యి; వీటిలో తర్జుమాలదే పైచెయ్యి.

ఉత్తరార్థంఒకచక్కని.పద్దని, అందమైన జానపదచిత్రంతో ఆరంభమైనా, ఇటుపై రాబోయేవి ఎక్కువగా సాంఘిక చిత్రాలే. వాటిలో ముఖ్యంగా మూడు చిత్రాలు అందరూ ఎదురుచూస్తున్నవి. అవి విజయ, జయంతి, అన్నపూర్ణా పిక్చర్స్ తీస్తున్నవి. విజయ వారి 'అప్పుచేసి పప్పుకూడు' హాస్యరసప్రధానమైన చిత్రం. దర్శకుడు ప్రసాద్. కథ, మాటలూ, పాటలూ సదాశివబ్రహ్మం, చక్రపాణి. నటులు సావిత్రి, రామారావు, రంగారావు, రేలంగి. సంగీతం ఘంటసాల.

రెండవది జయంతివారి సాంఘికం. దీనికి ఇంకా పేరు పెట్టలేదు. దర్శకుడు కె. వి. రెడ్డి, రచయిత పింగళి నాగేంద్రరావు కొత్తదనంగల ఇతివృత్తంతో దీన్ని రూపొందిస్తున్నారు. నటులు నాగేశ్వరరావు, జమున.

మూడవది అన్నపూర్ణావారిది. దీనికి పేరు ఖరారుకాలేదు. దర్శకుడు ఆదుర్తి సుబ్బారావు, మాటలు ఆత్రేయ, పాటలు శ్రీశ్రీ, ఆత్రేయ కొసరాజు వ్రాశారు. నటులు నాగేశ్వరరావు, సావిత్రి, రంగారావు.

ఇవికాక, ఈ ఏడాది విడుదలకాగల సాంఘిక చిత్రాలలో ముఖ్యమైనవి: ప్రభా ప్రొడక్షన్స్ వారి 'ఆడపెత్తనం', చేతనా వారి 'గుళ్ళోపెళ్ళి', ప్రసాద్ ఆర్ట్‌పిక్చర్స్ వారి 'ఇల్లరికం.'

ఈ ఏడాది విడుదల కాగల పెద్ద కాస్ట్యూం చిత్రం ఆర్. ఆర్. ప్రొడక్షన్స్ వారి 'కాత్తవరాయుడి కథ, దీనికి నటులు రామారావు, సావిత్రి. రచయిత ముద్దిపట్ల సూరి. దర్శకుడు రామన్న. అసోసియేట్. బి. ఎస్. మూర్తి.

## దైవబలం

పొన్నలూరి బ్రదర్స్‌వారి మూడవ చిత్రం 'దైవబలం' నిర్మాణం తెలుగు, తమిళ భాషలలో చురుకుగా సాగుతోంది. ఎన్. టి. రామారావు, గుమ్మడి, రేలంగి, రమణారెడ్డి, శివరావు, ముక్కామల, కె. వి. ఎస్. శర్మ, గాదెపల్లి, జయశ్రీ, గిరిజ, మాలతి, మోహన, బాలకుమారి మొదలగువారు పాల్గొంటున్నారు. మాటలు పరశురాం, పాటలు సముద్రాల, అనిసెట్టి వ్రాస్తున్నారు. సంగీతం అశ్వత్థామ సమకూర్చుతున్నారు. ఛాయాగ్రహణం సి. ఎల్. నారాయణ (అన్నయ్య) కళాదర్శకుడు వాలి. నిర్మాత వసంతకుమార

రెడ్డిగారే ఈ చిత్రానికి దర్శకత్వం నిర్వహిస్తున్నారు.

## భక్త రామదాసు

వి. ఎస్. ఫిలింస్ వారి 'భక్త రామదాసు' నిర్మాణం జూలై తొలివారంలో తిరిగి ఆరంభమై చురుకుగా కొనసాగుతూంది. ఇందులో కబీరు పాత్ర ధరించిన గౌరీనాథశాస్త్రిగారి హఠాన్మరణంవల్ల పని కొంత వెనకబడింది.

ఇపుడు గుమ్మడి వెంకటేశ్వరరావు కబీరుగా, ఆయాభాగాలను చిత్రిస్తున్నారు.

'రామదాసు' చిత్రంలో నాగయ్య, కన్నాంబ, లింగమూర్తి, సి. ఎస్. ఆర్., రామన్న పంతులు, చదలవాడ, వసల సూర్యచంద్రరావు, పేకేటి, నాగరాజు మొదలగు వారు పాల్గొంటున్నారు. రచయితయడవల్లి. పర్యవేక్షణ సముద్రాల. దర్శకుడు నాగయ్య. 

## శాంతారాం చిత్రానికి బెర్లిన్ బహుమతి

దర్శక నిర్మాత శాంతారాం చిత్రం 'దో ఆంఖేం, బారాహాత్', బెర్లిన అంతర్జాతీయ చలన చిత్రోత్సవంలో రెండు బహుమతులు గడించుకొంది. ఒకటి ప్రత్యేక బహుమతిగా ఇచ్చిన 'బంగారు ఎలుగు' విగ్రహం, ఇది బెర్లిన్ ఉత్సవంలో అగ్రశ్రేణి బహుమతి. రెండవది 'వెండి ఎలుగు' విగ్రహం. అంతరాతీయ 'కాథలిక్ చలనచిత్ర కళాలయం' నెలకొల్పిన అంతర్జాతీయసంఘం "భిన్న సంస్కృతులకు అతీతమైన స్థాయి అందుకొన్న" ఈ చిత్రంలో కావ్యాంశను, భావస్ఫోరకమైన శిల్పాన్ని, మెచ్చి ఈ బహుమతినిచ్చి గౌరవించారు.

ఈ చిత్రం గత సంవత్సరం విడుదలైన భారతీయ చిత్రాలలో ఉత్తమ చిత్రంగా ఎన్నిక అయి రాష్ట్రపతి సువర్ణ పతకం అందుకోవడం విదితమే.

బెర్లిన్ ఉత్సవంలో ప్రథమ బహుమతి, సువర్ణ విగ్రహం, 'ది ఎండ్ ఆఫ్ డే' అనే స్వీడిష్ చిత్రానికి లభించింది. ఇందులో ఇన్‌గ్రిడ్ బెర్‌మన్ నటించింది. 'స్టోరీ ఆఫ్ ట్రూ లవ్' అనే చిత్రం (జపాన్) తీసిన తదాషికి ఉత్తమ దర్శకుడి బహుమతి లభించింది.

ఉత్తమనటి: 'వైల్డ్ ఈజ్ ది విండ్' అనే చిత్రంలో నటించిన ఇటాలియన్ నటి అనా మగ్నానీ. ఉత్తమనటుడు సిడ్నీ పాయిటర్. ('ది డిఫరెంట్ వన్' అనే చిత్రంలో నటనకు.) 

## పంతులు చిత్రానికి రవిశంకర్ సంగీతం

దక్షిణ భారతంలో మూడు భాషలలో విడుదలఅయి ప్రజాదరణ పొందిన 'స్కూల్ మాస్టర్' (బడిపంతులు) చిత్రాన్ని, దర్శక నిర్మాత బి. ఆర్. పంతులు ఇపుడు హిందీలో పునర్నిర్మిస్తున్నారు. ముఖ్యపాత్రను ఆయనే నిర్వహించినా మిగతావారు బొంబాయి నటులే ఉంటారట. నిర్మాణం భరణీ స్టుడియోలో సాగుతుంది.

ఈ చిత్రానికి సుప్రసిద్ధ సితార్ విద్వాంసుడు, 'పథేర్ పాంచాలీ, అపరాజిత' చిత్రాల సంగీత దర్శకుడు అయిన పండిట్ రవిశంకర్ సంగీతం సమకూర్చుతారట. ★

దుర్గాఫిలింస్‌వారి 'పతిభక్తి' చిత్రంలో శివాజీ గణేశన్, ఎం. ఎన్. రాజం

# 'బ్రిడ్జ్ ఆన్ ది రివర్ క్వాయ్'

బాగా డబ్బుగడించే చిత్రాలన్నీ బాగా ఉండవన్నట్లే, బహుమతులు తెచ్చుకున్నవీ బాగుండవని కూడా ఒక అపప్రథలాంటిది వినబడుతూ ఉంటుంది. ఇది పచ్చి అబద్ధమూ కాదు; అలా అని ధోకాలేని మహా సత్యమూ అనుకోరాదు అని మందలించే మంచి చిత్రాలు-డబ్బూ, బహుమతులూ, పేరుకూడా తెచ్చుకున్నవి. అప్పుడప్పుడు వస్తూనే ఉన్నాయి. గత సంవత్సరం అమెరికాలో బాగా డబ్బుచేసుకున్న పది చిత్రాల జాబితాలో కెక్కి బాక్సాఫీస్ హిట్‌గా, అమెరికన్ మోషన్ పిక్చర్ అకాడమీ బహుమతులు ఏడిటిని సంపాదించుకున్న 'అవార్డ్ విన్నర్'గా, సర్వత్రా విమర్శకుల, కళాభిమానుల ప్రశంస లందుకొన్న మంచి చిత్రంగా, పేరు గడించిన 'బ్రిడ్జ్ ఆన్ ది రివర్ క్వాయ్' గత వారం మద్రాసులో విడుదల అయింది. దారుణమారణ హోమం యుద్ధాన్ని గర్హించి, యుద్ధం చేయించే వారు, చేసేవారు ఉన్మాదులని హృదయవిదారకంగా ఘోషిస్తుంది ఈ చిత్రం. యుద్ధం పట్ల జుగుప్స కలిగిస్తుంది. మామూలు మనుషులే కాక, జీవితంలో యుద్ధాన్ని 'ఆప్షనల్' (అభిమాన విద్య)గా హాబీగా తీసుకున్న బుద్ధిమంతులంతా రేపు ప్రొద్దుటికి మతం మార్చుకుంటారనుకోడానికి సదుపాయం లేకపోయినా ఈ చిత్రం మటుకు ప్రతివారిలోను ఒక విధమైన నిర్వేదం కలిగిస్తుంది. యుద్ధబుద్ధులలో కూడా, చిత్రం చూసిన తరువాత కొద్ది నిముషాలపాటైనా శ్మశాన వైరాగ్యంలాంటి చలనచిత్ర వైరాగ్యం ప్రవర్తిల్లుతుంది.

అయితే బహుమతులు తెచ్చుకొనే కొన్ని చిత్రాలలా దీని గొప్పతనానికి కారణం ఊహా మంచిదై ఉండడమే కాదు; సందేశం గొప్పది కావడమే కాదు, నూటికి కోటికి గోచరించే శిల్పనైపుణి, రామణీయకం ఇందులో నిలచాయి. ఈ చిత్రం ఛాయాగ్రహణ దర్శకుడూ, దర్శకుడు డేవిడ్ ('బ్రీఫ్ ఎన్ కౌంటర్'). లీన్‌లు ఇద్దరూ ఇందులోని 15 వేల అడుగులలోను అడుగడుగునా ప్రతిమాటను, చేతనూ తూచిచూచి వాడుకున్నారు. ఒకొక్క దృశ్యాన్ని ఒకొక్క ఉత్తమశ్రేణివర్ణచిత్రానికిమల్లే తీశారు. ఒకొక్క సన్నివేశాన్ని, రసభరితమైన కథగా, కావ్యంగా చిత్రించారు. ఆయా పాత్రల హృదయాలను, దేశ, కాల, స్థితిగతులకు అనుగుణంగానే అయినా, అతీతంగా కనిపించేరీతిన ఆవిష్కరించారు. ఆచేతనాలచేత, చలనచిత్ర అవధులను హిమగిరిశిఖరాలకు, దిగంతాలకూ పెంచగల నిశ్శబ్దం చేతా 'భీతి'కి నిర్వచనం చెప్పారు. భాషకు అందని భావాలు పలికించారు. ఈ అన్నిటికన్న ఎత్తుగా తీవిగా, శక్తివంతంగా, అందంగా కనిపించి అందర్నీ మైమరపించేది, విద్యుక్త ధర్మాలను తూ. చ. తప్పక పాటించి, ఆత్మగౌరవాన్ని, తనజాతి గౌరవాన్ని నిలబెట్టుకొన్న బ్రిటిష్ కర్నల్ నికల్సన్‌గా, బ్రిటిష్ నటుడు అలెక్ గిన్నెస్ ప్రదర్శించిన నటన. ఈ క్షణం అతడు ఘనీభవించిన ఆత్మగౌరవం. మరుక్షణంలో, ఆవరిస్తున్న దైన్యాన్ని ప్రతిఘటిస్తున్న శౌర్యం. ఉత్తర క్షణంలో, కాటువేయ చూచిన సర్పంలాంటి జాపనీస్ కర్నల్‌ను ధిక్కరించిన దర్పం. క్షణార్థంపాటు అనధికార వాత్సల్యం; ఉత్తరార్థంలో అధికారిక కాఠిన్యం. ఇన్ని హావభావాలను ఇంత సహజంగా, విశ్వసనీయంగా, సొగసుగా ప్రదర్శించగలగడం ఒక అలెక్ గిన్నెస్‌కే చెల్లింది...

గిన్నెస్ నటించిన కర్నల్ నికల్సన్ రెండవ ప్రపంచయుద్ధ కాలంలో తన పటాలం సహా, పై అధికారుల ఉత్తర్వుల ప్రకారం జపాన్ సైనికులకు లొంగిపోతాడు. జాపనీస్ కర్నల్ ఈ యుద్ధ ఖైదీలచేత, జపాన్ దళాలు తిరగవలసిన ఒక ముఖ్య రహదారిలో, ఒక నదిమీద వంతెన కట్టించబోతాడు. "మేము యుద్ధ ఖైదీలం తప్ప బానిసలం కాము. అంచేత మా సైనికులకు మా అధికారులే ఉత్తర్వులు ఇచ్చి పని చేయించాలి" అంటాడు కర్నల్ నికల్సన్. జాపనీస్ అధికారి అందుకు సమ్మతించడు. ఆఫీసర్ హోదాగల దళపతులుసహా కాయకష్టం చేయాలని శాసిస్తాడు. నికల్సన్ అంగీకరించడు. జెనీవా ఒప్పందాలు, అంతర్జాతీయ మర్యాదలూ మన్నించాలంటాడు. జాపనీస్ కర్నల్, నికల్సన్‌ను అవమానిస్తాడు. ఆనక దారుణంగా హింసిస్తాడు. అయినా నికల్సన్ శాంతియుతంగా, సహాయ నిరాకరణవిధానంతో ప్రతిఘటిస్తాడు క్రౌర్యాన్ని, పశుబలాన్ని. చివరికి అతని సహనమే జయిస్తుంది. జాపనీస్ కర్నల్‌ను నిస్పృహ ఆవరిస్తుంది. తను నిర్ణీత కాలానికి పూర్తి చేయవలసిఉన్న వంతెన నిర్మాణాన్ని నికల్సన్‌కు ఒప్పగిస్తాడు. నికల్సన్, జాపనీస్ ఇంజనీర్ల పథకంకన్న, కట్టుదిట్టమైన పద్ధతిలో వంతెన నిర్మించి పెడతాడు. శత్రువులకు చేతులారా సాయం చేస్తున్నామన్న భావం అతనికి కలగదు. నియమనిబంధనల మధ్య పుట్టి పెరిగిన మనిషిగా అతడు ఈ సమస్యని చూసాడు. ఆ సబబుల ప్రకారం యుద్ధ ఖైదీలు శత్రువులు చెప్పిన పని చేయాలి. పోతే నికల్సన్‌కు సంతోషకరమైన మరో విషయం: తన పటాలంలో సైనికులు కట్టుతప్పిపోకుండా వాళ్లకి మళ్ళా

(56 వ పేజీ చూడండి)



గురుదత్ ఫిలింస్‌వారి 'కాగజ్ కా ఫూల్' చిత్రంలో నటిస్తున్న వహీదా.




# వందలకొలదీ బహుమతులు గెలువబడాలి!

ఇది దక్షిణ భారతమందలి ప్రతి బిడ్డకున్నూ ఉత్సాహకరమైన రంగులు వేసే క్రొత్త పోటీ. ఇది చాలా సులభం, ఇది అత్యుత్సాహకరం, మరియు వందలకొలదీ బహుమతులు గెలువబడాలి, మీ దగ్గరనున్న మెక్లీన్స్ వ్యాపారి వద్దకు వెళ్లి ఒక ఎంట్రీ ఫారమును అడిగి తీసుకోండి.

మీరు చేయవలసినదల్లా ఒక సామాన్య బొమ్మకు మీ యిష్టమువచ్చిన రంగుల నుపయోగించి, రంగులు వేయండి. తరువాత మీ ఎంట్రీని మెక్లీన్స్ పెరాక్సైడ్ టూత్ పేస్టు యొక్క ఒక (Family) ఫ్యామిలీ సైజు లేక మీడియం సైజు ట్యూబు కార్టన్ లేదా రెండు (Large size) పెద్ద సైజు ట్యూబు కార్టనుల చేర్చి పంపండి! ఎంట్రీలు, (సుప్రసిద్ధ (సినిమా) చిత్రకారులు నిపుణులైన ఢిల్లీ యందలి శంకర్స్ వీక్లీ సంపాదకులగు శ్రీ శంకర్ గారిచేత నిర్ణయించబడును.) ప్రతి బిడ్డకున్నూ గెలుపు అవకాశముగలదు. ఈ అద్భుతమైన అవకాశమును విడవారకండి—మీరు మెక్లీన్స్ రంగులువేసే పోటీలో యాత్రగా పాల్గొనుటకు నిశ్చయించుకోండి. మీ వ్యాపారి వద్ద నేడే ఒక ఎంట్రీ ఫారమును తీసుకోండి.

*ఈ బహుమతులను గమనించండి!*

| వయస్సు గ్రూప్ I: 4–9 ఏళ్లు | వయస్సు గ్రూప్ II: 10-14 ఏళ్లు | వయస్సు గ్రూప్ III: 15-18 ఏళ్లు |
|---|---|---|
| మొదటి బహుమతి: మార్క్లిన్ ఎలెక్ట్రిక్ రైలు సెట్ లేక వాకీ-టాకీ బొమ్మ | మొదటి బహుమతి: జీస్ ఇకన్ కెమేరా (లెన్సు ఎఫ్:4.5) కేసు వగైరా | మొదటి బహుమతి: 17 జ్యూయెల్ రిస్ట్ వాచీ లేక ఉషా కుట్టు మిషను |
| రెండవ బహుమతి: మెజెస్టిక్ బేబీ కారు | రెండవ బహుమతి: మెకానో సెట్ (నం. 6) లేక ఎచ్.ఎమ్.వి. పోర్టబుల్ గ్రామఫోన్ | రెండవ బహుమతి: పార్కర్ 51 పెన్ & పెన్సిల్ సెట్ |
| మూడవ బహుమతి: లేగో బంపర్ బిల్డింగ్ సెట్ లేక బొమ్మరిల్లు సామగ్రి వగైరా | మూడవ బహుమతి: వ్యూ మాస్టర్ మరియు స్లైడ్లు లేక పెద్ద అల్లిక-పని సెట్ | మూడవ బహుమతి: స్టాంపు ఆల్బమ్ 1,000 స్టాంపులవగైరా లేక పొడుగైన చర్మపు వ్రాత కేసు |

## మరియు రెండువందలుకంటె ఎక్కువగా ప్రోత్సాహక బహుమతులు గలవు

**తల్లి దండ్రులకు బహుమతులు**

మీ బిడ్డ మొదటి బహుమతిని గెలుపొందినయెడల, దానితో పాటు మీకు ఒక ఘనమైనటువంటి 6-వాల్వుల ఫిలిప్స్ రేడియో సెట్ ఇవ్వబడును.

MACLEANS peroxide TOOTH PASTE

MACLEANS... cleans teeth whiter than ever before

# మెక్లీన్స్ రంగులువేసే పోటీ

## ప్రియమైన ప్రభావతి

(38-వ పేజీ తరువాయి)

వ్యంగా స్త్రీ వుద్యోగం చేసి తెచ్చేజీతం వంటమనిషికీ, పనిమనిషికీ, దాదులకీ కనాకష్టంగా సరిపోతుంది. "తన ఎద్దుని పాలికిచ్చి తను కూలిచేసినట్టు" వుంటుంది. గృహిణి యింటిపనులన్నీ స్వయంగా చేసుకోవటమే పెద్ద వుద్యోగం. అదే ఆరికంగా పెద్దసాయం —మీ తమ్ముళ్ళు చదువులు సార్థకమైనాయంటేఅందరు వుద్యోగాలుచేస్తున్నారనా? కట్నాలు తీసుకున్నారనా?—ఐతే ఏ కారణంచేతనైనా ఒక తమ్ముడు కట్నంలేని పెళ్లి చేసుకుంటే, డిగ్రీతో సంబంధంలేని వుద్యోగంచేస్తే, ఆ తమ్ముడు చదువు నిరర్థకమా? చదువుకొన్నకొద్దీ రేట్లు పెంచి అమ్ముడుపోవటం సమాజంలో చీడపురుగులాంటి సమస్యేగాని అది విద్యకి సార్థకత గాదు. ఆడచదువుకయ్యే ఖర్చు పైకి దండుగ్గానే వుంటుంది. రైల్లో జరిగిన పరాభవాల్లాంటివి నీ జీవితంలో చాలా వచ్చాయా? అది నీ భ్రమ. అంతేగాని అది పరాభవం గాదు. నీ హంగుల జోలికి పోకుండా, నిన్నొక గృహిణిలా మాత్రం చూశారు తోటివాళ్లు. మంచికో, చెడుకో నీ విద్య ఎప్పుడైనా సార్థకమౌతుందేమో! నీ డిగ్రీ నీకు రక్షకాదా? "బాగా చదువుకున్న దాన్ని పెళ్ళి చేసుకున్నాననే సంతోషంగానీ, విచారంగానీ నా భర్తకే" అన్నావు. నీతోబాటు ఆయనకీ కొంత చాదస్తం వుందనిపించింది. సంతోషానికర్థముంది. కానీ విచారం ఎందుకు? ఉద్యోగం లేదనా? మీరిద్దరూ అంతగా ఇష్టపడ్తున్నప్పుడు మీరనుకున్న విధంగానే చదువునెందుకు సార్థకపర్చుకోకూడదు?— దానివల్ల యింటా బయటా ఎన్ని కష్టనిష్ఠూరాలుంటాయోమీకే తెలుసు. అవసరం వున్నవాళ్లకి ఏదైనాతప్పదు.

ఒక్క విషయం. స్త్రీ వుమ్మడి డిగ్రీలతో పాటు గృహ నిర్వహణ శాస్త్రంకూడా కాలేజీలో సెపరేట్ గా నేర్పుకునే మార్పులు రావాలి. అప్పుడు నిజంగా స్త్రీ విద్య సార్థకమే. నిరర్థకంగాదు.

బహుశా మీ అమ్మాయిలకి నీకు పట్టిన అదృష్టం పట్టదేమో అనుకుంటున్నాను. నీ అభిప్రాయం వచ్చుక చెప్పాలనుకున్నది చెప్పాను. ప్రభావతీ, చనువులో వుండే మాధుర్యం మన్ననలో లేదు. సాధ్యమైనంతవరకూ చనువగా పిలవటం నాకిష్టం. ఏమీ అనుకోకేం. ★

—దద్దనాల రంగనాయకమ్మ.
(బొమ్మిడి.)

---

## నల్లులకోసం

(39 వ పేజీ తరువాయి)

హైద్రాబాద్ నుండి వచ్చింది. వచ్చినరోజే మా ఆడపడుచు మొదటి అబ్బాయికి పేను కొరుకుడు వున్నట్లు తెలుసుకున్నాను. నల్లి వైద్యం చేద్దామంటే మా ప్రక్కింటిలోనే కాదుగదా! మావూరంతా గాలించినా నల్లులు దొరకలేదు. ఆరోజు యేదో ఆఫీస్ పనిమీద మావారికి కర్నూల్ కు పోవలసి వచ్చింది. వెళ్ళేటప్పుడు కర్నూల్ స్టేషన్ వెయిటింగ్ రూములో నల్లులకు కొదవుండదు. వచ్చేటప్పుడు ఓ పది నల్లుల్ని పొట్లాం కట్టుకుని తీసుకురమ్మని పదే పదే జ్ఞప్తి చేసి పంపించాను. మరునటి రోజు రాత్రి మెయిలుకు మావారు పనిముగించుకవచ్చారు. వచ్చిన వెంటనే చేతిలోని సంచి లాక్కొని పొట్లాలన్నీ తీసి చూశాను. అందులో పువ్వులు,పిల్లలకు తెచ్చిన మిఠాయిపొట్లాలు తప్ప ఇంకేమియు లేదు. తెల్లబోయి మావారివంక చూశాను.

'ఇంతేనా నీ తెలివి' అన్నట్లు మావారు కోటు జేబులోంచి చిన్నపొట్లాన్ని బయటికి తీశారు. ఏదో గొప్ప విజయాన్ని సాధించుక వచ్చినట్లు పొట్లాన్ని ధీమాతో విప్పారు. అందరం విస్తుపోయాం. అందులో యేమీ లేవు పొట్లంలోనుండి పారిపోయాయేమో నల్లులన్నీ. ఇక నల్లులు దొరకడం చాలకష్టం. మా ఆడబడుచుతో మళ్ళీ "నల్లులసీజన్"లో వస్తే తప్పకుండా పేనుకొరుకుడు మాన్పుతానని. నల్లులకోసం నలుదిక్కుల గాలించిన ఎక్కడా దొరకవు. సీజన్లో తప్ప.

కాని తమాషా వారం తిరిగేసరికి మా యిల్లంతా నల్లులే! కోటుజేబులోని పొట్లాంలోంచి బయటపడ్డ పదీ, పదిరోజులలో పది వందలు అయివుండాలి. ★

—ఎం. ఎ. జబీనాగని, వెలుదుర్తి]



భాస్కర్ ప్రొడక్షన్స్‌వారి 'పార్వతీకల్యాణం'లో కృష్ణకుమారి, బాలయ్య.

## 'బ్రిడ్జ్ ఆన్ ది రివర్ క్వాయ్'

(౫౩-వ పేజీ తరువాయి)

క్రమశిక్షణ అలవరచ గలుగుతున్నామని. అంతే.

చివరకి వంతెన పూర్తిఅయిన వేళకు, బ్రిటిష్ సైనిక అధికారులకు ఈ విషయం తెలిసి, దాన్ని ధ్వంసం చేయించడానికి ముగ్గురు ఉద్యోగులను పంపుతారు. నికల్సన్ ఇది గ్రహించలేదు.

"యుద్ధం పూర్తిఅయాక, ప్రజలు దీన్ని చూడుకుంటారు; 'ఫలానా అప్పుడు ఒక బ్రిటిషు యుద్ధఖైదీల దళం దీన్ని కట్టిపెట్టింది' అని చెప్పుకుంటారు. అది తన జాతికే గర్వకారణం అని నికల్సన్ తాత్పర్యం. అందుకని, తన పక్షం అధికారులే వచ్చి వంతెనను కూల్చబోయినా దానిని ప్రతిఘటించబోతాడు.

అందులో అతడు కృతకృత్యుడుఅయితే, అంతమంచివాడూ 'దేశద్రోహి' కావచ్చు; ప్రయత్నించి విఫలుడైనా అంతే కావచ్చు. అందుకని, అతి సహజంగా సాగిన ఈ కథలో అతడు ప్రమాదవశాత్తు చనిపోతూ పోతూ పరాపరి డైనమైట్ పెట్టిమీదకే పడి, ప్రయత్నం, ప్రతిఘటించడం కూడా లేకుండా డైనమైట్ అంటించి వంతెన విధ్వంసానికి నిమిత్తమాత్రుడు అవుతాడు...

గిన్నెస్ తరువాత, ఈ చిత్రంలో జాపనీస్ కర్నల్ గా నటించిన సెసూ హాయకావా నటన చాలా గొప్పగా ఉంది. మహా క్రూరుడుగా, వేషం వేసుకున్న అర్థ విశ్వాసంలా కనిపించే ఆ అధికారి అంతరాంతరాలలో భీతిని, దౌర్బల్యాన్ని, విన్నపోయితను ఆ వ్యక్తికి గౌరవానికి భంగం కలుగకుండా అతి సున్నితంగా ఆ నటుడు ప్రదర్శించాడు.

మరొక బ్రిటిషు అధికారిగా జాక్ హాకిన్స్, ఈ చిత్రం సందేశాన్ని "ఉన్మాదం" అన్న ఒక్క ముక్కలో క్లుప్తంగా చెప్పిన మిలిటరీ డాక్టర్ గా జేమ్స్ డొనాల్డ్, అమెరికన్ నావిక దళాధిపతిగా విలియం హోల్డెన్ నటించారు. ఈ చిత్రం నిర్మాత శాం స్పీగల్.

సినిమాస్కోప్, టెక్నికలర్ లో తయారైన ఈ చిత్రం అంతా సింహళద్వీపంలోని చిక్కటి అడవులలో షూట్ చేశారు. ★

* * *

తమిళనాడులో ప్రజాదరణ పొందిన బుద్ధా పిక్చర్స్‌వారి 'పతిభక్తి' చిత్రాన్ని దుర్గా ఫిలింస్‌వారు తెనిగిస్తున్నారు. సావిత్రి, జెమినీ గణేశన్, శివాజీ గణేశన్, నాగయ్య, తంగవేలు, చంద్రబాబు, ఎం. ఎన్. రాజం మొదలగువారు ఇందులో నటించారు. దర్శకుడు ఎ. భీమ్‌సింగ్.

మాటలూ పాటలూ శ్రీ శ్రీ వ్రాస్తున్నారు. సంగీత దర్శకులు విశ్వనాథం రామమూర్తి. తెలుగు ప్రతికి సంగీత నిర్వాహకుడు చలపతిరావు, నిర్మాత కె. వి. పాదరి.

Printec and Publishec for Nageswara Rao Estates (Private) Ltd., by S. Radha krishna at
The Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street, Madras-1 Editor S Sambhu Prasad



సీతాకోకచిలుక

ఫొటో: పి. కృష్ణకుమార్.]

Regd No. M. 4479 Andhra Patrika Illustrated Weekly.